బొత్తొని ఇంటి దగ్గర మంట వెలుగులో బొత్తొని పెళ్ళాం లసుము చంటిదాని కాళ్ళ మీదేసుకొని పొయ్యిమీద కుండచేపు చూస్తున్నది

"ఏడ సచ్చినావ్-రేతరాత్రి దనక— ఇంటికాడ పోరి ఏడ్సేడ్సి పిల్ల కుతికెబడె" అన్నది.

"సూడనాన్న... ఈ ఒతుకీద వశంగా దు" ముత్తయ్యకు ఫిర్యాదుచేసింది.

ఇంకేదన్న మాట్లాడ్తె లసుము కూడా ఏడ్చేలాగున్నదని గ్రహించి ముత్తయ్య వెళ్ళిపోయాడు.

బొత్తొడు మాట పలుకూ లేకుండా కుక్కి మంచంలో కూలి పోయాడు. పొయ్యిమీద కుండ దిగిపోయింది. గంజి చిప్పల్లో చేరింది. ముగ్గురు పిల్లలు ఎగబడి తాగారు. లసుము కుండ బోర్లించింది. గంజి అయిపోయింది.

తనను పిలిచి గంజి పోస్తదేమొనని ఆశ పడ్డాడు. కాని పిల్లలు తాగేసరికే అయి పోయింది..........నడిపోడు చిప్ప నాకు తున్నాడు.

'రేపటినుంచి ఎంకయ్య పటేల్ బర్రెను గాయబోవాలె ఇన్నావురా?" పెద్దకొడు కు నుద్దేశించి లసుము ..

పెద్దకొడుకు మాట్లాడ కుండా పళ్ళు బిగపట్టి తొడలు గీరుకున్నాడు.

"నిన్నెరా కుక్కల కొడుకా!" తల్లి ...

"అయ్య బోతండు గదా!" పిల్లవాడు ఇంకా గోక్కుంటూనే....

తల్లి కాసేపు మాట్లాడలేదు. చిన్న పిల్లను నేలమీద గోనెసంచి వడేసి పండేసింది. చిన్న పిల్ల చలనం లేని మాసం ముద్ద లాగా పడున్నది." పోరికి జెరం మాడి పోతంది ..." తనకుతాను చెప్పుకున్నట్టుగా అని ..

"అయ్యను తీసేసిండ్లంట". ... ఈసారి తల్లి గొంతు కొద్దిగా వణికి ది ...

"ఎందుకోంటా?" పోరడు బిగ్గరగా కోపంగా....ఆ కోపం ఎంకయ్య మీదనో గోకుడు మీదనో తెలియలేదు.

"అయ్య ఒంట్లె నెత్తరయి పోయింది?" తల్లి ...

"మరైతె నా నెత్తురు తాగుతరా?" నెత్తిమీద జుట్టుపోస గోడ మీద వికృతంగా ఎగురుతుండగా....

"మాటలు నేర్చినవ్ కొడకా?" తల్లి.

"నేను సచ్చిన అని పనిలక బోను. కయి కలిసేత్త."

"నీక కయికి లెవడిత్తడు!"—తల్లి.

"అయితె ఎందుకయ్యెరో సూత్త—లాపోతె అర్ధమనాత్రి అని పడ రిగోడ పడదునికి బొండిగ గోత్త-లేకుంటె సందుకు పలుగ్గొట్టి పైక మెత్తుకత్త... "పోరని కళ్ళు దొంగ కళ్ళలాగ కాకుండా చిత్రంగా మెరుస్తు న్నాయి.

తల్లి బెదిరి పోయింది... ఎటూ చేతకాక పొయ్యిలోని కొరొయి తీసి కాలువ లోయింది.

బొత్తొడు హఠాత్తుగా లేచి భార్య చేదిలోని కొరొయి తీసి పొయ్యిలేశాడు. గంజి కుండ తన్నేసి పిల్లవాడ్ని వంగ బెట్టి గుద్దాడు.

పోరడు ఏడ్వలేదు.... విసురుగా లేచి నిలబడి "ఒరే అయ్య.... నీ గొంతు పిసుకుత"ననీ తిట్టుకుంటూ.... భూమిని గుద్దుతూ గుడిసెలనుండి చీకట్లోకి వెళ్ళిపోయాడు....

చిమ్మెట్లు రొద పెడుతున్నాయి.... ఎక్కడో కుక్క ఏడుస్తోంది.... రెండు మోకాళ్ళమధ్య తల పెట్టుకొని కూర్చుండి పండ్లు కొరికిండు.... తర్వాత అంతెత్తు లేచి నిలబడి "లంజెకాన నాకు గంజేదే?" అరిచిండు ఊగిపోతూ.

లసుము జవాబు చెప్పలేదు....మొగని ముఖాన్ని కనీసం చిత్రంగానైనా చూడ లేదు....

ఎడం కారతో లసుమును తన్ని—కుక్కి మంచంలో కాసేపు తల పట్టుక్కూర్చు న్నాడు తలను ఎవరో చెక్కలేస్తున్నట్టుగా




గట్టిగా పట్టుకున్నాడు.

సంఘం గుడిసెదగ్గర కొడుకు గొంతు చాలా కోపంగా, అలజడిగా పాడుతున్నట్లు వినిపిస్తోంది ...

"కొండలు పగలేసినం....మా నెత్తురు కంకరగా...."

బొత్తోడు లేచి బయటకు నడిచాడు.... నిటారుగా నిలబడి నెత్తురుమరకల్లా వెలుగుతున్న చుక్కలకేసి ఉమ్మేసి ఎన్నడు అంత గట్టిగా మాట్లాడెరుగని బొత్తోడు పెద్ద గొంతుతో నా నెత్తురు తాగిండ్లు - నా మాంసం తిన్నరు-నా బొక్కలు సీకేసిండ్లు- —నా గూట నరాలు తీసుకున్నరు బూమి గుంజుకున్నరు బలంగుంజుకున్నరు. ఒతుకు గుంజుకున్నరు .. తిట్టుతూ, వదురుతూ రాత్రంతా గూడెం ఆ కొసనుంచి ఈ కొస దాకా తిరుగుతునే ఉన్నాడు....

○ ○ ○

## 1980 ఆగస్టు 15 తర్వాత....

ఆకాశం మూసుకపోయింది.... ఉండీ ఉండీ మబ్బులు గుడగుడలాడుతున్నాయి. తళుక్కు తళుక్కున మెరుస్తోంది. గాలి వరుసక్రమం లేకుండా ఎటునుంచి ఒడితె అటునుంచే ఈడ్చి ఈడ్చి కొడుతోంది— చెరువుగట్టు మీది ఈత చెట్లు శివసత్తులు వెంట్రుక లిరబోసుకొని తూలినట్టుగా తూలుతున్నాయి....

చెరువు కట్టమీద తనలో తాను గొణుక్కుంటూ కూర్చున్న మనిషి లేచి నిలుచున్నాడు. అతను మెడకు ఎర్రని గుడ్డొకటి పట్టీలా కట్టుకున్నాడు. గడ్డం జుట్టు బాగా పెరిగిపోయి మనిషి వాలకం దాటిపోయి గుడ్డెలుగు ముఖమై పోయింది. నరాలు తేలిన కుడి మోకాలుకు ఎర్ర గుడ్డొకటి కట్టుకున్నాడు

అతను పెద్దగా అరుస్తూ "వానల్లు గురువాలె వానదేవుడా! మా సెర్వు నిండాలె అనదేవుడా! లాపోతే నీకు ఎంకనికి ఒట్టిన గతి బడ్తదది జేగర్త... మేం బూమిని పలుగజీర్తం....మల్ల మా నెత్తురు ఇత్తనాలు జెట్టి మాంసం ఎరువేత్తం...పంటలు బండుతయి ...పంటంత పంచుకుంటం....తెలిసిందా? ఆకలుండదు....నేనే దున్నుత... గప్పుడు నాసిన్న బిడ్డ బొందల నుంచి లేసత్తని... హే ...హ్హా యి నా యి కా...."
కాసేపు చిందులు తొక్కి డాన్సు చేశాడు.

ఆ తరువాత చిరిగిన గుడ్డపేగు నుండి రెండు ఎముకలు బయటకు తీశాడు. ఒక ఎముకను నెత్తిచుట్టు మూడుసార్లు తిప్పుకొని నిటారుగా నిలబడి "తూం తూం మంత్రం తుమ్మకాయ మాత్రం—గీబొక్క మా నెత్తురు తాగింది—" పాడుతూ భూమిమీద పెట్టాడు. అది ఎవరిదో ముంజేతి ఎముకలాగున్నది. ఇంకొక ఎముక తీసి కింది ఎముక

చుట్టు తిప్పి పెద్దగా ఏడుస్తూ "బావా ముత్తన్నా! నువ్వు మాకోసం బతుకకుంట బోతివా!" అన్నాడు చొల్లు కారుతుండగా ఆ ఎముకను మెడ ఎర్రగుడ్డ తీసి జాగ్రత్తగా కిందపరిచి దానిలో చంటి పిల్లలాగ పడుకో బెట్టి "నువ్వు పసి గుడ్డువు— శోఅమ్మ తానంద శోఖో ముకుందా? లాలి పరమా నంద రామగోయిందా!" అని ఏడుస్తూనే పాడసాగ డు.

మళ్ళీ భూమి మీది ఎముకను కాలుతో తన్ని "సావు కుక్కల కొడుక" అన్నాడు కసిగా....

గాలి తగ్గింది...సన్నగా వాన చినుకులు మొదలయ్యాయి ...రెండు ఎముకలు తీసు కొని ఎర్రగుడ్డలో చుట్టి చంకలో పెట్టకొని తడుస్తూ చెరువు కట్ట వెంట ఊళ్ళో కొచ్చాడు.

ఊరు నిర్మానుష్యంగా ఉన్నది...గుడి సెల్లో నుంచి కొందరు కలుగుల్లోని ఎలుక ల్లాగ తలలు బయటపెట్టి మాస్తున్నారు ...

"మబ్బులకు బొత్తొని పుచ్చి ముదిరి పోయింది" ఓ ముసలివాడు,

అయ్యో అటెటో పోతండు. పోలీసోల్లు సూసిండ్లంటే మల్లగుంజుకపోయి తంతరు". ముసలవ్వ బెదురుగా అనేసి "ముదినట్టమై పోను...." అన్నది తనే చేతులు దిప్పతూ ఏదో గుర్తొచ్చిన దానిలాగ "ఏమయ్యా సూసుకుంట కూకున్నవ్—అయన్నిట్టు ఇగ్గుకరాపో...." ముసల్ది....

ముసలివాడు గొంగడి కోలాటమేసుకొని గుడిసె బయటకొచ్చి పిల్లిలా అటటు చూసిండు. బొత్తొని దాకా నడిచి రెక్క ఒట్టుకున్నాడు...

తుపాకీ పేలినట్టుగా ఉరుము....

"అర్జెనా! అర్జెనా!" బొత్తొడు ముఖం మీద నీల్లు తుడుచుకుంటూ

"రారా...." ముసలివాడు.

"ఏడికి""

"ఆనెల్లెదనుక నాగుడెసెలుండేవు."

"ఆనలేకపోతేట్ల బతుకతవు-ఔగనో నీ కొడుక్కు రొట్టెలు గొంట బోయినవా

ఇగో గిట్లబోతె మాదిగిండ్లల్ల నాభారి యుంటది....నాకొడుకు సుత కొండల్లో గట్లల్లున్నడు. అనికి సుత రొట్టెలు గొంట బో...ఆళ్ళకు సెప్పు ... ను గారడిద్దెనేత్త- పోలీసోల్లు నవ్వుకుంట కూకుంటరు. బస్ గదే సందని అచ్చి మీనబడితే ఉన్న టుపాకు లన్నీ సంకల బెట్టుకపోవచ్చు. నేను మొన్న ఆగినుగాన్ని టుపాకి దిగిన—నిన్నే కాల్చేత్త నన్నడు...."

"మామూసల్ది నీకో టుపాకి త్తదట రారా!"

"చత్తెరి తొత్తుకొడుక—ఈరుడు ముత్తయ్యబావ చ్చిపోంగ ఏం జేసిండ్లు?" బొత్తొడు పెనుగులాడి తన రెక్క విడిపించు కొని "ఈరుడ ముత్తన్న ఎర్రెర్రదండాలు-సూరీడ కైలాసెమా మర్రమర్ర దండాలు" అని పాడుకుంటూ ముందుకు నడిచాడు.

ఎంకయ్య పటేల్ పెద్దరువాజ మూసు న్నది. బొత్తొడు దరువాజముంటు నిలబడి నాడు. "దొరా! తలుపులు తియ్యండ్లి" మొత్తుకున్నాడు.

"ఎవడుబే ..." కరుకు కంఠం.

"గ రడొన్ని బాంచెన్...."

లోపలినుంచి చప్పుడు లేదు. కాసేపటికి తలుపులు తెరుచుకున్నాయి. ఒక పోలీసు వాడు బనీనుమీద నిలుచున్నాడు. అతని వెనుక ఇంకో పోలీసు తుపాకి ఎక్కు పెట్టు న్నాడు. బొత్తొడు పోలీసును ఖాతరు చెయ్యకుండానే లోపలికి దూసుక పోయాడు. ధాన్నెపు ఇంటి అరుగుమీద ముద్దమొఖపు అమీను చెక్క కుర్చీలో కూర్చుండి సిగరెట్టు తాగుతున్నాడు.

"దండాలు బాంచెన్...." బొత్తొడు అరుగెక్కిండు. బొత్తొని నిలువెల్లా నీల్లు కారుతున్నాయి. ఒకక్క ఇంకో పోలీసు కోడిని కమిరిస్తున్నాడు.

"మల్లెందుకొస్తివిరా పిచ్చోడ" అమీను.

"సూసిపోదామని"

పోలీసు రెక్క పట్టుకున్నాడు.

# పన్నులు సకాలంలో చెల్లిస్తే

* వడ్డీ, జరిమానా పడవు.
* ఆదుర్దా, ఆందోళన చెందే పనిలేదు.
* అది మంచి పౌరుల లక్షణం.
* దేశ నిర్మాణానికి, సాధన సంపత్తులు సమకూరుతాయి

పన్నులు చెల్లించేందుకు ఆఖరు తేదీ ఉంది.

అయినా ఆఖరు తేదీకోసం చూడటమెందుకు ?

ఆలస్యము అపరాధము కావచ్చు.

## పన్నులు సరిగా చెల్లించండి
## దేశాన్ని శక్తివంతం చేయండి

జారీ చేసినవారు :



డైరక్టర్ ఆఫ్ ఇన్‌స్పెక్షన్,
రిసర్చ్, స్టాటిస్టిక్స్ అండ్ పబ్లికేషన్
ఇన్‌కమ్‌టాక్స్ డిపార్ట్‌మెంట్
న్యూఢిల్లీ—110 001.

"ఆగవయ్యా! కడుపులనుంచి దవ్తంది. కసేపు మంట కాగుతా?"నని మంటవేపు నడిచి ముంగాళ్ళమీద కూర్చుండి చేతుల్ని కాపుకొని ఎముకలు కూడా కాచి "బొ దొరా! కోడికూర బాగుంటదా?" పెదిమలు నాక్కుంటూ....

"నికాల్లో యహాంసే" తురక పోలీసు కసురుకున్నాడు.

"బొరా నీ పేరేంది?" యస్. ఐ.

"నచ్చిందా? ఒతికున్నదా" కోడి కాళ్ళు చర్మము వాసన చూసి బయట పారేస్తూ....

"రెడున్నావురా?" యస్. ఐ నవ్వుతూ మరో సిగరెట్టు ముట్టించి ...

"బొ దొరా! నచ్చింది బొత్తోడు-మనున్నది ముత్తయ్య.... హెం ...హెం" గడిదలా ఇకిలించి "బాగున్నదా దొం" అన్నాడు కోడికేసి చూస్తూ....

"ఛత్ .. అదేం నవ్వురా గాడిద నవ్వు" పోలీసు.

"గాడ్దులు నవ్వుతాయి సాంచెన్?"

"అది సరేగని... మీవోల్లు ఎక్కడున్నారో చెప్పగలవా? కోడికూరతోని మాంచి భోజనం పెట్టిస్త" యస్. ఐ.

"అయితే ఓ బీడియ్యండ్లి...."

యస్. ఐ. సిగరెట్టిచ్చాడు. ఫిల్టరుకు అగ్గిపెట్టి రెండు పీల్పులు పీల్చిండు. కళ్ళు చిత్రంగా తిప్పుతూ-ధాన్నెపింటి తలపులను లేచి పోయి పరిశీలించి చూశాడు. తలుపులకు ఎప్పుడో చల్లిన నెత్తురు నల్లగా మారిపోయి మరకలాగున్నది.

"గదేంటిది సాంచెన్?"

"నెత్తురుబే...." తురక పోలీసు.

"నాకెరికే .. గీయింట్ల మా నెత్తురు నిల్వ నేసిండని-అని నెత్తురు బలిచ్చి అళ్ళ నెత్తురాళ్ళు తీసుకున్నరు"

"ఎవరి రక్తమంటవ్రా" యస్. ఐ.

"ఎంకని నెత్తురు"

"నాకు కోపమొస్తె తంతరా? వాన్ని కట్టేయండి...." యస్. ఐ. దురుసుగా.

"ఎందుకు దొరా?"

"ఢోకిలికే మరి మీవోళ్ళ జాడ చెప్పు.." పోలీసు.

కిసుక్కున నవ్వింకు. మళ్ళీ ఆరిపోతున్న మంటదగ్గర కూర్చున్నాడు. సిగరెట్టు నిప్పులో పారేసి-ఇందాకటి రెండు ఎముకలు బయటకు తీసి "సూడిండ్లు దొరలు-గిది పాపాత్ముడు ఎంకయ్య పశేల్ది.. గీ నెయ్యితో నే మా నెత్తురు మాంసం దోసింకు. గిది సూసుండ్లి పాపాత్ముని ఎములోల్లు కప్పచెప్పిన పున్నాత్తుడది. ఇగో పోలీసోల్లు-గది తెలుసుకోండ్లి-మన బొక్కలు ఎన్నటికైనా నీకిపారేత్తరు. గీ కూకున్న దొరను నమ్మకుండ్లి-మీరు తలుసుకుంటె" బొత్తోడు ఏదో అనబోయాడు.

యస్. ఐ. లేచి బొత్తోన్ని రూడిచ్చి తన్నాడు. బొత్తోడు వాకిట్లో బురదలో పడిపోయాడు. బురదలోనుండి లేచి మోకాలు ఎర్ర గడ్డ నూడకీకాడు.

"పిచ్చోన్ని బయటికి వెళ్ళగొట్టండి..." అమీన్ కుర్చీమీద కూర్చున్నాడు.

తురక పోలీసు లేచి బొత్తొని పట్టకొని తలుపులదాకా తీసుకపోయి "ఒరే! కయి కురే! జావ్. గరుకూ జావ్... వో ఆద్మీ నహీహై... ఆదు మంచోడు గాదు." గుసగుసగా. "లేడ్మీకే నడూ...." గట్టిగా అని తలుపు మూసేశాడు.

వాన పెద్దదయ్యింది.... ఉరుములు పేలుతున్న బాంబుల్లాగా అంతకంతకు ఎక్కువయ్యాయి. మరుపులు తళుక్కు తళుక్కున మెరుస్తూనే ఉన్నాయి....

o o o

1951, 1982, 1988, 1934, 19 5.....

నెలలు, వారాలు....

తర్వాతి కథ రాసేది నేను కాదు.... మరెవ్వరు రాయగలరు?....

అదీ తెలియదు...

బహుశా జనం రాస్తారేమో! 

సీరియల్

# సౌభాగ్యలత

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవీ రామశాస్త్రి

— జరిగిన కథ —

(వకుళ, శ్రీమంత్‌ల జీవన నటన సాగుతూనే వుంది— ఇంటికెవరొచ్చినా అన్యోన్యత చూపిస్తున్నారు—అక్కడ శశిరేఖ-పెళ్ళి విషయమై మహేష్‌తో వివాదం పెట్టుకుంది. తను స్వేచ్ఛగా, ఏ రివాజూ లేకుండా పెళ్ళి చేసుకుందామని శశిరేఖ-ఎప్పుడో తీరిగ్గా తండ్రికి నచ్చచెప్పి లాంఛనంగా, పద్ధతి ప్రకారం పెళ్ళి చేసుకుందామని మహేష్, తీరా శశి తండ్రికి కట్న కానుకల విషయంలో గుండెలవిసిపోయాయి-అంతా కలిసి రెండు లక్షల యాభై వేలు పెట్టాలిట—అదే వకుళతో చెప్పాడు విచారంగా — శశి తల్లికి మాత్రం అహం ఇంకా తగ్గలేదు)

## ఇదిగో.... ఇక చదవండి

వకుళ నిర్లిప్తంగా నవ్వింది.

"మీ అల్లుడిగారికి అటువంటి ఆశలులేవని మీకు తెలుసు నాన్నగారూ, మీ ఆశీర్వాదమే మాకు అక్షరలక్షల విలువ!"

"నువ్విలాగే అంటావు కానీ........నాకేమిటో అపరాధం చేస్తున్నా ననిపిస్తోంది శశికి ఇవ్వవలసిన సామానులు కొన్ని కొనటానికి బజారు వెళ్తున్నాం. నీకు కూడా కొనాలని వుంది. ఆ మాట చెప్పటానికే వచ్చాను-వస్తావా బజారుకు?"

వినగానే వకుళ మనసు సంతోషించినా, వెంటనే ముకుళించుకుపోయింది.

"అమ్మా, అక్కా వెళ్తారుకదా బజారుకు? నేనెందుకు లెండి నాన్నగారూ, అయినా, ఇప్పుడు అక్క పెళ్ళికే బోలెడు ఖర్చుకదా! నా విషయం తర్వాత చూసుకోవచ్చు."

"అలా కాదు. తయారవ్వు వెళ్దాం."

"ఇపుడు రాలేను నాన్నగారూ. మామయ్య శారదను తీసుకు రావటానికి వెళ్లారు. ఏ సమయానికైనా రావచ్చు. నేనుండకపోతే బాగుండదు."

"బౌనమ్మా. నేను మరచే పోయాను. మేం వెళ్ళి తెస్తాంలే."
"ఒక్క మాట నాన్నగారూ......."
"ఏమిటి?"
"నాకు ఇప్పుడు ఏమీ కొనకండి, అమ్మ ఇష్ట ప్రకారం కానీయండి."
రఘురామయ్య వదనం వాడిపోయింది.
"మీ అమ్మ మాటలకేంలే– నేను లేనూ?" నువ్వు మరి శ్రీమంత్‌ను కూడా మించి పోయావు అభిజాత్యంలో, నేను నీ తండ్రి నమ్మా. నేను గాక ఇంకెవరిస్తారు నీకు? శశి పెండ్లి అయ్యాక అసలు ఏమి మిగుల్తుందనేది అనుమానమే. అందుకే ఇప్పుడే నీకూ ఏదో యిస్తే నాకు తృప్తి. మరేమీ చెప్పకు" అంటూ సాగిపోయాడు.
నాకు కావలసినది భర్త అనురాగం మాత్రమే! అది లభ్యం కావాలని ఆశీర్వదించండి నాన్నగారూ!
అనుకున్నది వకుళ లోలోన.
గృహ కృత్యాలకు ఉపక్రమించిందే కానీ మనస్సంతా అస్తవ్యస్తంగా మారిపోయింది.
"ఉన్న ఆస్తినంతా అక్కకే యిచ్చేస్తే అమ్మా నాన్న గార్ల భవిష్యత్తేమిటి?"
"అక్క ఇంత అనాలోచితంగా తన బాగే తాను చూచుకొంటోందేమిటి? అయినా ప్రేమించి చేసుకొనే వివాహాలలో కూడా హిరణ్యాక్ష వరాలుంటాయా? ఈ వివాహం శ్రీమంత్ మనసుపై ఎటువంటి ప్రభావం చూపుతుంది?
అనేక రకాల తర్జనభర్జనతో పనులు చేసుకుంటూ పోతున్న వకుళ శ్రీమంత్ రాకను గమనించనే లేదు.
సైకిల్ గోడవారగా వుంచి స్టాండు వేస్తున్న అతడు ప్రక్క మేడమీద నుండి రఘురామయ్య పిలుపు విని తలఎత్తి చూచాడు.
కడవలో మంచి నీరు నింపుతున్న వకుళ కూడ ఆ కంఠం విని అటు చూచింది.
రఘురామయ్యా, విశ్వేశ్వరీ తమ మేడ వరండాలో నిలబడి ఇటే చూస్తున్నారు.
"నేనే వస్తున్న శ్రీమంత్" అంటూ రఘురామయ్య మేడదిగి వచ్చాడు.
"నేనే వస్తాను కదండీ, మీ కెందుకంత శ్రమ?" శ్రీమంత్ దరహాస వదనంతో అన్నాడు.
"ఫర్వాలేదులే... ........ఏమిటి ఆలస్యంగా వచ్చావు?"
"వర్క్ ఎక్కువగా వున్నది లెండి...... ....రండి కూర్చుందాం."
కూర్చుని కబుర్లలో పడ్డారు.
కాఫీ ఫలహారాలు తెచ్చియిచ్చి వకుళ మరలా లోనికి వెళ్ళిపోయింది.
తండ్రి వచ్చిన కారణమేమిటో ఆమెకు తెలుసు అందుకు శ్రీమంత్ సమాధానాలెలా వుంటాయో? అందుకే తాను అక్కడలేకుండా జాగ్రత్త పడింది. కానీ దృష్టి అంతా అటే వున్నది.
శశి వివాహవార్త శ్రీమంత్ అతి శాంతంగా విని హర్షం ప్రకటించాడు. అతడి అంతరాంతరాలలో జ్వలించుతూన్న అగ్ని గుండం అనుభవజ్ఞుడైన రఘురామయ్య గ్రహింపకపోలేదు.
"వివాహం ఆట్టే దూరంలేదు. ముందేచెప్తే నీవు ఏమీ క్యాంపులవీ వేసుకోకుండా వూళ్లోనే వుంటావనీ.......,"
"పోనీ ఓ వారం పదిరోజులు సెలవు తీసుకుంటాను. పనులేమైనా నాకు చెప్పండి.




చేస్తాను."

ఉత్సాహంగా, మనస్ఫూర్తిగా వున్న ఆ మాటలు వకుళకు ఎంతో ఆనందాన్ని కలిగించాయి.

రఘురామయ్య కనులు ఆనందాతిరేకంతో చెమరించాయి.

"తెలుసు శ్రీమంత్. నాకు కొడుకువు కానీ అల్లుడవు కాదు. నీ పెళ్ళి అంత నిరాడంబరంగా జరుపుకొన్న నీ మీద ఏ ముఖం తో నేను బరువు బాధ్యతలుంచగలను?" కంఠం గాద్గదికమైంది.

"దానికేముందండీ ఎవరి నియమాలు వారివి అంత మాత్రానికే పరాయివాడినై పోయానా?"

"ఆ మాట అడగాలనే అడగలేక పోతున్నాను శ్రీమంత్. పెళ్ళి కాక పూర్వమే చనువుగా వచ్చేవాడివి నాదగ్గరకు. వివాహమయ్యాక దూరమై పోయావనుకుంటున్నాను. రావడమే మానేశావు" అంటూన్న రఘురామయ్య కంఠంలో ఒణుకు స్పష్టంగా కన్పట్టింది.

"లేదు మామయ్యా-నన్ను మనిషిగా నిలబెట్టిన మీకు ఎన్నడూ దూరం కాలేను" అన్నాడు తల వాల్చుకుని మందస్వరంతో.

"ఇక ఆ మాట నువ్వు అనే గౌరవం నా కెక్కడిది? ఇల్లు అమ్మి వడ్డీతో సహా ఋణం తీర్చేసుకున్నావుగా!"

సంభాషణ గంభీరంగా వుండడం గమనించిన వకుళ, మార్చే ఉద్దేశ్యంతో అక్కడకు వచ్చింది.

"బజారులో కొనవలసినవన్నీ అయ్యాయా నాన్నగారూ?" అనడుగుతూ ప్రక్కన కూర్చుంది.

"అయ్యాయిలేమ్మా, కాని ఆవిషయంలో సాయం తమ్ముని మీ ఇద్దర్ని అడగ

టానికి కూడా నాకు మనస్కరించలేదు. కారణాలు మీకే తెలుసనుకో."

ఎవరి మటుకు వారు మౌనంగా వుండి పోయారు.

ఆ మౌనాన్ని ఛేదించుతూ రఘురామయ్య హఠాత్తుగా అన్నాడు.

"చూడు శ్రీమంత్, నీ దగ్గర ఏ విషయమూ దాచటం నాకిష్టంలేదు. మీ అత్తగారు మీనుండి గోప్యంగా వుంచమని అన్నది కానీ నేను చెప్పేస్తున్నాను. శశికి రెండున్నర లక్షల కట్నంతో మహేష్‌తో వివాహం జరుగుతుంది!!"

"ఆఁ!!!"

కనురెప్పలు తమ ధర్మాన్ని విస్మరింపగా, విస్మయాన్ని మించిన ఏదో అనుభూతికి వివశుడైన శ్రీమంత్ వాగ్భ్రాన్యుడై చూడసాగాడు మామగారి వైపు.

ఆ వివశ విభ్రాంతులు ముందే అనుభవమైన తండ్రి కుమార్తెలు సిగ్గిలుతూన్నట్లుగా మౌనంగా తలలు వాల్చుకు కూర్చున్నారు.

"నీ అభిప్రాయం చెప్పు శ్రీమంత్." రఘురామయ్య సూటిగా శ్రీమంత్ కనుల లోనికి చూస్తూ గంభీరంగా అడిగాడు.

"నా అభిప్రాయమా?" శ్రీమంత్ ప్రశ్నలో విపరీతమైన ఆశ్చర్యం ధ్వనించింది.

"ఔను, ఇంత ధనమూ చెల్లించి ఈ వివాహం చేయాలంటావా? నీ సలహా కావాలి శ్రీమంత్."

భావయుక్తంగా నవ్వుతూ, కనుబొమ్మల విరుపుతో అడిగాడు శ్రీమంత్. "ఆ మాట చెప్పటానికి నేనెవరిని?"

"నువ్వు సర్వమూ నాకు-అంతేకాదు. నాకు ఇద్దరే ఆడపిల్లలు. ఆ విధంగా కూడ నీకూ వకుళకూ నా ఆస్తిపై హక్కు వుంది."

"మామయ్యా!" అభ్యంతరం చెప్పబోయిన శ్రీమంత్‌ను మాటలాడ నీయలేదు రఘురామయ్య.

"అందుకే నేను వివాహం నిశ్చయం చేసుకొని రాలేదు. అబద్ధం చెప్పాను శశి రేఖకూ విశ్వేశ్వరికీ ఆగడం చేస్తారని."

"మహేష్ అడిగాడా నాన్నగారూ కట్నకానుకలు కావాలని?" వకుళ అడిగింది.

"ఔనమ్మా. అతడి తండ్రి అన్నీ మాటలాడుతూంటే అతడు ప్రక్కన కూర్చు న్నాడు. ఆ మాటలన్నింటికీ అంగీకారంగా తల వూపుతున్నాడు. శశిని అడిగితే మహేష్ కూడా అంతస్థుల మనిషేననీ పెద్దల మాటే అతడి మాట అనీ అంటోంది."

"అయితే చేసేయాలి కదా నాన్నగారూ. అయినా మీ ఇష్టమేమిటో అలా కానీ యండి. మాకు మాత్రం ఏ ఆశలూ లేవు" అన్నది నెమ్మదిగా.

"వకుళా నువ్వు వెళ్ళి కాఫీ తీసుకురా" ఆజ్ఞాపించినట్లే అన్నాడు శ్రీమంత్.

వకుళ విస్మయంగా చూసింది. గంభీరంగా వున్నది శ్రీమంత్ వదనం. ఉద్దేశ్య పూర్వకంగానే అతడు తనను సంభాషణ నుండి తొలగించుతున్నాడని గ్రహించి, మారు మాటలాడక లేచి వెళ్ళిపోయింది. కానీ అతడి నిర్ణయమేమిటో వినవలెననే కుతూ హలంతో చాటుగా వినసాగింది.

"మామయ్యా, ఈ పెళ్ళి జరిగి తీరాలి! జరపడమే అన్ని విధాలా తెలివైన పని!" స్థిరంగా అన్నాడు శ్రీమంత్.

"ఎందుకూ అనవసరం." చీకాకుగా అన్నాడు రఘురామయ్య.

"శశి భవిష్యత్తేమౌతుందో ఆలోచించారా?" తీవ్రంగా అడిగాడు శ్రీమంత్.

"ఏం? వెంగ పెట్టుకుంటుందా? పెట్టకోనీ, బుద్ధొస్తుంది."

"బుద్ధి తనకా, మనకా వచ్చేది? వంశానికే అపకీర్తి కాదా?"

"అందుకని నిలువు దోపిడీ యిచ్చి, నీకు అన్యాయం చేయనా? ఏం ఫర్వాలేదు. లోగడ శుభలేఖే చింపిపారవేసింది. ఇప్పుడూ అలాగే మనసు సర్దుకోగలదు." ఖండితంగా అన్నాడు.

"అయితే మీరూ శశిలాగే జీవితంతోనూ, పరువుతోనూ జూదమాడ దలచుకున్నా తన్నమాట?" తనకే తెలియని తీవ్రతతో అడిగాడు.

"శ్రీమంత్!"

"ఔను మామయ్యా, లోగడ శుభలేఖ వరకూవచ్చిన వివాహం సంగతి లోకు లందరికి తెలిసినదే, ఇప్పుడు విచ్చలవిడి ప్రణయకలాపాలు ప్రపంచమంతా చూస్తోంది కాలక్షేప రాయుళ్ళు కథలల్లి పకపకలాడేందుకు ఇంకా అవకాశాలివ్వాలను కుంటున్నారా?"

రఘురామయ్య వాడిన వదనం శ్రీమంత్ వేడి చూపులను ఎదుర్కోలేక క్రిందికి వాలింది.

"మీలో ఒకడిగా నేను కటుంబం పరువూ పరపతీ ఆలోచించుతున్నాను గానీ డబ్బుకాదు, నాకే ఆశాలేదు. అంతా శశికే ఇచ్చి ఎలాగైనా ఆమె వివాహం జరిగేట్లు చూడండి ఇందుకు నేనకూడా శక్తి వంచన లేకుండా సహాకరించ గలవాడినే!"

"అంత నిక్కచ్చిగా వుండే డబ్బు మనుష్యులతో శశి సుఖపడుతుందా?"

భావయుక్త దరహాసంతో అన్నాడు.

"శశికోరిక అది, ఆమె చిన్న పిల్ల కాదు. కోరిన వరుని తెచ్చానే తృప్తేకాక, మీ ఇద్దరమ్మాయిల వివాహ బాధ్యతలనూ కూడ నిర్వర్తించామనే సంతృప్తి మీకు దక్కుతుంది."

ఇంకా మనసు అంగీకరించనట్లుగా స దిగ్ధంగా కూర్చున్నాడు రఘురామయ్య

"మామయ్యా!" అతి మృదువుగా అనునయంగా సంబోధించుతూ, తన కర్చీలో నుండి లేచి రఘురామయ్య చెంతకు వచ్చి చేరువగా నిలబడ్డాడు శ్రీమంత్.

"మామయ్యా! అనేకసార్లు అన్నారు మీరు నేను మీకు పుత్ర సమానుడనని. ఔనా?"

"ఊఁ."

"ఇంటి ఆడబిడ్డ పెండ్లి విషయంలో తండ్రికి కుమారుడు సహాయం చేయడం వింత ఏమీకాదు, శారద పెండ్లిచేశాము. ఆడపిల్ల పెండ్లిలోని సాధక బాధకాలన్నీ అవగత మైనాయి. అలాగే ఇప్పుడు శశి వివాహం కూడ-ఇందుకు సహాకరించడం కూడ నా బాధ్యత."

"శ్రీమంత్! !"

పట్టరాని ఆనందం పొంగి పొరలు తూండగా, దేవుడే దిగివస్తే భక్తుడు వొళ్ళు మరచి చూచినట్లుగా అల్లుడిని కన్నార్పక చూస్తూ ఉపోయాడు రఘురామయ్య.

"నేను వివాహాన్ని డబ్బుతో ముడిపెట్టి ఆలోచించలేదు. నాకు మీ ఆస్తిపై ఆశా లేదు, మీరన్నట్టు ఈర్ష్యాలేదు. వాక్కుగల వ్యక్తి వకుళ, అయితే, నాకు వకుళ మనసు బాగా తెలుసు, మీ ఆనందం కోసం, నా గౌరవం కోసం ఏదైనా చేయగల ఉత్తము రాలు వకుళ! అందుకే ఆమెను అడగకనే మీకు మాట ఇస్తున్నాను, శారద వివాహం కోసం ఈ ఇల్లు వదలుకున్నాను; శశి సుఖంకోసం మీరు యిస్తామంటూన్న ఆస్తిని కూడ వదలుకున్నా ననుకోండి."




లోనుండి వింటూన్న వకుళ తృప్తిగా, నిట్టూర్చింది.

బరువైన నిశ్వాసం వెడలింది రఘురామయ్య నుండి.

"అంతే-ఆలోచించ వద్దు ఇక మామయ్యా, శశి తనకేమి కావాలో, తానెవరో తనకే తెలియని అమాయక స్థితిలో వుంది. ఆమె బ్రతుకు అపప్రధ పాలు కాకుండా వుండాలంటే మీరు వివాహం సత్వరం జరపడం మీ కర్తవ్యం, ఇది మీ తక్షణ కర్తవ్యం. ఇందుకు యిప్పుడు కాదు కదా-జన్మలో ఎన్నడూ కూడా నా అభ్యంతరం ఆక్షేపణలు వుండవు! ఇంత కంటే నేను చెప్పేదేమీ లేదు"

రఘురామయ్యకు మాటలు కరవైనాయి.

కుర్చీనుండి లేచి శ్రీమంత్‌ను ఆప్యాయత ముప్పిరిగొనగా, గాఢాలింగనంతో అభినందించాడు. శిరస్సు మూర్కొన్నాడు.

రెండు నిముషాల అనంతరం ఆ ఆవేశస్థితి నుండి తేరుకొన్నవాడై, శ్రీమంత్‌ను వదిలి,

"సరే నువ్వు చెప్పినట్లే చేస్తాను." అన్నాడు గొణుగుతూ.

వీధి గుమ్మం వరకూ అతడిని అనుసరించారు వకుళా శ్రీమంత్‌లు.

గుమ్మం దగ్గర ఒక్క క్షణం ఆగాడు రఘురామయ్య.

"వకుళా. ఎంత అదృష్టవంతురాలవమ్మా! నీ విషయంలో నాకు నిశ్చింత! నీభర్త దేవుడే."

వీధి తలుపులు మూసి వచ్చిన వకుళ అన్యమనస్కంగా ఒక తావున కూర్చున్నది.

"అక్క భవిష్యత్తు బాగుంటుందా?"

"ఇంత ఖర్చుపెట్టేస్తే, అమ్మా నాన్నగార్ల పెద్దవయసులు ఎలా జరుగుతాయి?"

"అక్కలో యింత స్వార్థం ఎలా వచ్చింది?"

"మహేష్‌లో ఇంత సిగ్గు లేమి తనమా?"

ఆ మెదడులో అన్నీ సమాధానంలేని భయంకర ప్రశ్నలే. ఒక్కటే సంతోషకర మైన ఈ విషయం. ఈ సంఘటన వలన శ్రీమంత్‌కు తనపై ఎంత గౌరవమో తెలిసి వచ్చింది.

దుస్తులు మార్చుకుని కాళ్లు చేతులు కడుక్కుని వంటగదిలోకి వచ్చిన శ్రీమంత్, అక్కడ వకుళ లేక ఏమైనా పనిలో వున్నదేమోనని మరలా బయటకు వస్తూ మధ్య గదిలో ప్రతిమవలె కూర్చున్న వకుళను చూచి భృకుటి ముడివేచాడు.

సాధారణంగా అతను వకుళను తనకై తాను పిలిచి ఏ పనీ చెప్పడు.

అతడి అవసరాలను కనిపెట్టి ఆయా సమయాలలో ఆమె తనంత తానే అతడికి కావలసినవి సమకూర్చి వుంచుతుంది.

తాను దుస్తులు మార్చుకోవడానికి లోనికి వెళ్ళగానే ఆమె గ్రహించి వంటగదిలో వడ్డన కుపక్రమిస్తోంది ఇన్నాళ్ళూగా.

ఆలోచనతో తననే చూస్తూ నిలచిన అతడిని వకుళ గమనించలేదు.

ఆమె మనసులోని అలజడిని కొంతవరకూ ఊహించ గలిగిన శ్రీమంత్ నిశ్శబ్దంగా తన గదిలోనికి నిష్క్రమించాడు.

పావుగంట గడచింది.

కాలక్షేపంగా ఏదో పత్రిక పుటలు త్రిప్పుతూన్న శ్రీమంత్ మధ్యగది వైపు చూచాడు.

కూర్చున్న తీరులో ఏ మార్పులేక, అలాగే చెక్కిట చేయిచేర్చి ప్రతిమవలె కన్పట్టింది వకుళ.

అరగంట గడచింది.

తన అస్తిత్వమే గుర్తింపనట్లుగా వున్నది ఆమె అన్యమనస్క స్థితి.

పుస్తకం విసిరేసి, కించిత్ విస్మయంతో లేచి వచ్చాడు శ్రీమంత్.

"వకుళా! భోజనం వడ్డించు" అన్నాడు వంటగదిలోనికి దారితీస్తూ.

అప్పటికి స్పృహలోనికి వచ్చిన వకుళ ఖంగారుగా లేచి అటు యిటు చూచింది.

కర్తవ్యం స్ఫురణకు వచ్చినట్టుగా గబగబా వచ్చి వడ్డన కుపక్రమించింది.

సాధారణంగా ఏ మాటలూ వుండవు గనుక ఆ రోజూ మౌనంగానే భోజనం ముగిసింది.

భోజనానంతరం వంట పాత్రలు సర్ది వేసి హాలులో చాప మీద పడుకొంటూన్న వకుళను చూచి, మరలా లేచి వచ్చాడు శ్రీమంత్.

"భోజనం చేయలేదేం వకుళా?"

వకుళ ఖంగారుగా నిలబడింది. అతడికి తనపై ఈ మాత్రం ధ్యాస కలిగిన దంటే విశేషమే! తానేమైనదీ, ఏమి చేస్తున్నదీ సాధారణంగా అతడు పట్టడు, శారద మాటలు నిజమేమో? సాన్నిహిత్యం సమస్యా పరిష్కారం చేసి సంయమన మేర్పరచ గలదేమో!

"వంట్లో బాగానే వుందా?" మరికొంత దగ్గరగా వచ్చి అడిగాడు.

"ఆఁ."

"మరి? అన్నం ఎందుకు మానావు?"

నేల చూపులు చూస్తూ జవాబిచ్చింది. "మామయ్య, శారద వస్తారు, కలసి తిందామని."

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యవంతమైన గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క హానిలేని శక్తిగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింటు రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

## నోటి దుర్వాసనను ఆపండి...
## కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
## దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

"వస్తారో రారో? అలస్యమైంది, నువ్వు తినేయి."

"అలాగే," అన్నది కానీ దిలే సూచనలు కన్పించలేదు. మొదటి సారిగా శ్రీమంత్ పరీక్షగా చూచాడు వకుళను.

పొడుగూ పొట్టికాని సన్నని విగ్రహం, తీరైన ముక్కు, పెద్ద కనులతో కళగా కన్పట్టే ముఖం, వత్తుగా చెంపలపై జాలువారుతూన్న అదుపులేని నల్లని కురులు.

"ఓ ఛాయ తక్కువన్న మాటేకాని చాలా అందగత్తె నీ భార్య" అన్నాడు ఆ ఉదయమే ఒక సహోద్యోగి.

"నిజం" అన్పించాయి ఈ క్షణాన ఆ మాటలు.

"శ్రీమంత్!"

హఠాత్తుగా తలెత్తిన వకుళ శ్రీమంత్ తనను పరీక్షగా చూడడం గమనించి కలవర పడింది.

శ్రీమంత్ చూపులు తిప్పు కున్నాడు.

"మామయ్య ఉదయమే రావాలి, ఇంకా రాలేదు. ఉత్తరం కూడా రాలేదు." అన్నది దిగులుగా.

శ్రీమంత్ నవ్వేశాడు.

"వస్తారులే, శారద వుండమన్నదో-బావగారు ఊళ్ళోలేరో-రేపొస్తారో? ఖంగా రెందుకు? లే! అన్నం తిను"

"ఆకలి లేదు. వద్దు."

మళ్ళీ పడుకోబోతూన్న ఆమెకు చేరువగా వచ్చి భుజం పట్టి ఆపాడు. ఒక విధంగా బలంగానే నడిపించుకు వెళ్ళాడు వంటగదిలోనికి.

సిగ్గుతో సంతోషంతో పరవశమై నృత్యం చేసింది వకుళ హృదయం.

వివాహాత్పూర్వం కాబోయే మరదలిగా, చిన్ననాటినుండీ తెలిసిన స్నేహితు రాలిగా అనేకం మాట్లాడేది అతడితో. చిలిపి తగవులు కూడా పెట్టుకొనేది.

కానీ అనుకోకుండా మెలికలు తిరిగిన పరిస్థితులూ, ఊహించకుండా ఏర్పడిన బంధమూ ఇద్దరినీ స్తబ్ధులను కావించి వదలి పెట్టాయి. వివాహదినం నాటినుండి కూడా యిరువురి నడుమా మూగతనం రాజ్యమేలుతోంది. అయితే ఈ నాడు తండ్రి యింటి పరిస్థితుల ప్రభావమో, లేక ఇంట మరెవరూ లేక ఏర్పడిన ఏకాంతత మహాత్యమో తమ యిరువురి నడుమా ఇటీవలి కాలంలో జరుగని పెద్ద సంభాషణ జరిగింది.

అయితే శ్రీమంత్ ఆలోచనలు మరోవిధంగా సాగుతున్నాయి.

"వకుళను సంప్రదించకుండా తాను ఆమె తండ్రికి యిచ్చిన మాటవల్ల వకుళ ఏమైనా మథన పడ్తూన్నదా? నాకు రావలసిన వాటాను కాదనడానికి తానెవరు అను కుంటూన్నదా?"

ఆలోచించుతూ, వకుళ వచ్చే వరకూ బయట గదిలోనే కూర్చుని వున్నాడు.

అతడక్కడ వున్నాడని మరో గదిలోనికి పోబోతూన్న ఆమెను ఉద్దేశించి అన్నాడు.

"వకుళా! ఒకమాట చెప్పు "

"ఏమిటి?"

"నేను మీ నాన్నగారితో అన్న మాటలకు బాధపడుతున్నావా? నిన్నడగకుండా చెప్పడం పొరపాటని ఇప్పుడనుకుంటున్నాను."

మరి నిగ్రహించుకొనలేని వకుళ ఒక్క అంగలోవచ్చి అతడి ఎదపై వాలిపోయింది.

"నీ మాటలు పొరపాటుగా ఎంచేత పెద్దదాన్ను కాను శ్రీమంత్ నేను" మాటలు స్పష్టంగా లేకుండా తడబడుతున్నాయి.

అనుకోకుండా జరిగిన ఈ సంఘటనతో శ్రీమంత్ అప్రతిభుడై నిలచాడు.

"నీ ముందు ప్రపంచమే చిన్నదిగా కన్పిస్తోంది శ్రీమంత్-నా అంత గర్వంగా తల ఎత్తుకొని ఎందరు వారు నిలబడ గలరు?"

అశ్రువులు జాలువారుతున్నాయి ఆ చెంపలపై,

అయోమయంగా వున్నది శ్రీమంత్‌కు.

"ఏమిటీ పిచ్చి? ఏమిటో చెప్పందే నాకెలా తెలుస్తుంది చెప్పు!" అనునయంగా అంటూ ఆ కపోలాలు ఒత్తుతూ అడిగాడు.

"నీ మంచితనాన్ని లోకులూ, కావలసిన వారూ కూడా తమ స్వార్థానికి వాడుకుంటున్నారేమోనని భయంగా వున్నది."

ఏమీ మాటలాడలేక నిట్టూర్పుతో నిర్లిప్తంగా ఆమెను నడిపించి కుర్చీలో కూర్చుండ జేశాడు.

"అంత బేలవైతే ఎలాగ? ఇది లోకం, లౌక్యమే ఈ లోకులకు ఆయువు పట్టు."

"అది పాటించని మనవంటి వాళ్ళు మేమైపోవాలి?" రోషంగా, నిస్సహాయంగా అడుగుతున్న పద్ధెనిమిదేండ్ల వయసులో పద్ధెనిమిది నెలల పసిపాప కన్పట్టింది శ్రీమంత్ నేత్రాలకు.

ముగ్ధ! అమాయిక! అతి నాజూకు హృదయం.

ఆమెకు ఏమి చెప్పాలో, ఎలా అనునయించాలో తెలియలేదు శ్రీమంత్‌కు. ఆలోచిస్తున్నాడు అమాయకత ఉట్టిపడుతూన్న ఆ ముఖాన్ని చూస్తూ.

ఈమె శశిలా పెంకెగా, స్వార్థంగా బ్రతకలేదు.

శారద వలె తనను తాను నిలబడ గలది కాదు.

హక్కులూ, అరళ్ళూ ఎరిగిన ఆధునిక యువతి కాదు. (సశేషం)

# ఆపరేషన్ కిచెన్

ఓ.జి. రామారావు

అసలు నా శ్రీమతికి నాకూ తగాదా ఎలా వచ్చిందో గుర్తు లేదు. నిజానికి అది తగాదా కూడా కాదు. మా వ్యక్తిత్వాలలో వచ్చిన ఘర్షణ. ఒకరికొకరు లొంగకూడదన్న పట్టుదల!

కొద్దిరోజులనుండి మా ఆవిడ విసుక్కోడం వింటున్నాను. నాతో ఎదురుగా అనకపోయినా ఆవిడ విసురు నాకే ఉద్దేశించబడ్డాయని నాకు తెలుసు. ఉదాహరణకు ఆవిడ కంప్లయింట్సులో కొన్ని :

'ఎక్కడికీ కదలడానికి వీలులేదు. ఇల్లు ముడై పోయింది'

'మా అన్నయ్యగారబ్బాయి బారసాలకి వెళ్ళలేకపోయాను. నా దురదృష్టం!'

'నా ఫ్రెండ్ విజయ కూతురు పెళ్ళికి వెళ్ళనేలేదు. విజయ నన్ను జీవితంలో క్షమించదు'

'ఏమే, అప్పీ. నువ్వు హఠాత్తుగా ఊరెడితే నా పనేంగాను? నీకేం, నీ యిష్టం వచ్చినప్పుడు నాగాలు పెట్టేస్తావ్. కాని నా ఒక్క నాగా లేదుగా!'

యిదీ వరస. నాకు వళ్లు మండింది. ఏమిటి, ఎవరిని ఉద్దేశించి యీ చిరాకులు? అంతగా ఆవిడ ఎక్కడికైనా వెళ్ళాలనుకుంటే ఎవరొద్దన్నారు? నేనేమైనా యీవిడను తాళ్ళేసి కట్టేశానా? తను కావాలనుకున్నది నేను ఏది కాదన్నాను? మరి, యీమాత్రందానికి, నేనేదో ఆవిడను జైల్లో పెట్టి బంధించినట్టూ, హౌస్ అరెస్ట్ చేసినట్టూ ఎందుకీ నర్మగర్భ, దుర్భర సంభాషణలు?!

నా కోపం పైకి కనబడనీయకుండా ఓ రోజున నిర్లిప్తంగా అన్నాను "అంత ఎక్కడికైనా వెళ్లాలనుంటే, వెళ్ళలేకపోయావా? యిక్కడుండి నువ్వు చేసేదేమిటి?" ఆ ఆఖరిమాట అని వెంటనే నాలిక్కొరుక్కున్నాను. ఈవిడ యింట్లో ఎంత పనిచేస్తుందో నాకు తెలుసు. కాని గాలిలో కదలిన మాట వెనక్కి తీసుకునే మార్గం లేక దీని పర్యవసానం ఎలా వుంటుందోనని ఆందోళనగా ఎదురు చూస్తున్నా.

"నేనుండి చేసేదేముందా?" ఆవిడ నన్ను మింగెయ్యాలన్నంత కోపంతో చూసింది. "అయితే ఉండండి మీ పని చెబుతాను. మా అక్కయ్య విజయవాడ రమ్మని ఉత్తరాలు రాసింది. నేను రేపే వెడతాను. ఏ హోటల్లో తింటారో, ఏం చేస్తారో చూసుకోండి" అని. నేనేమాత్రం చలించకపోడం చూసి యీసడింపుగా అంది "మళ్ళీ టెలిగ్రాములమీద టెలిగ్రాము

హాస్యకథల పోటీలో



తిస్తాడు. కబుర్లు చెప్పగానే సరికాదు!"

నా అహం దెబ్బతింది. ఒక్క తిండి కోసం ఆమెమీద, ఆవిడ వంటమీదా ఆధారపడి బతుకుతున్నాననుకుందా?

నాలుగు రోజులు ఏ హోటల్లోనో తింటాం. ఏమీ ఫరవాలేదు" అన్నాను

## ఎన్నికయిన కథ

నిర్లక్ష్యంగా.

ఆవిడ చర్రున లేచింది.

"ఆఁ తింటారు హోటల్లో! నేను హాస్పిటల్‌లో ఉన్నప్పుడు తిన్నారుగా! రెండు రోజులు తిని, డిసెంట్రీ పట్టుకుని మూడు వారాలు మంచమెక్కారు మరిచిపోయారులా ఉంది"

నేను మరచిపోలేదు. ఆ అనుభవం మరచిపోలేను కూడా. కానీ యిది నా ఆరోగ్యానికి సంబంధించిన విషయం కాదు. నా వ్యక్తిత్వానికి, నా స్వతంత్ర ప్రతిపత్తికి సంబంధించిన సమస్య.— "లేకపోతే మేమే యింత ఉడకేసుకు తింటాం. నువ్వు నిరభ్యంతరంగా విజయవాడ వెళ్ళిరా" అన్నాను కసిగా. 'మీకోసారి శాస్తి జరుగి కాని బుద్ధి రాదు!' అన్నట్టు ఆవిడ నాకేసి కొరకొరా చూసింది. ఆ చూపుకి నాకు షాక్ తిన్నట్టయింది.

ఏమిటి యీవిడ గర్వం? ఏమిటీ డబాయింపు? వంటంటే ఏమైనా ఏటమిక్ సైన్సా? దీనికి అమెరికానుంచి యురేనియం, రష్యానుంచి టెక్నికల్ నోహౌ, వరల్డ్ బ్యాంక్ నించి ధన సహాయం కావాలా? కావలసిందల్లా ఉప్పూ, ింత పండూ, కారం! యీమాత్రందానికి ఏదో తనకే భగవదనుగ్రహంవల్ల వంటవిద్య అబ్బినట్టూ, యింకెవరికి ఆ రహస్యం తెలితాదన్నట్టూ ఏమిటీ అహంకారం? అసలు యీవిడేనా, ఆడవాళ్ళంతా యిలా మిడిసిపడుతుంటారా? యిదేదో నేనుం తేల్చుకోదలిచాను.

ఆవిడ చూపును నేనేంతమాత్రం ఖాతరు చెయ్యలేదన్నట్టు సన్నగా విజిల్ పాట మొదలెట్టాను. ఆవిడ మరో క్షణం అలాగే చూసి, చేతిలో ఉన్న చీపురు వంటింట్లోకి విసిరి బెడ్‌రూమ్‌లోకెళ్ళి ఫళ్లున తలుపేసుకుంది. వంటింట్లోంచి ఆర్. డి. బర్మన్ ఆర్కెస్ట్రాలా ధ్వనులు వినిపించాయి. ఆవిడ విసిరిన చీపురు తిన్నెమీదున్న ఓ గిన్నెకు తగిలింది. చంచల స్థిరత్వస్థితిలో ఉన్న ఆ బోడి గిన్నె ఊగి, ఊగి కిందనున్న రెండు పింగాణీ ప్లేట్ల మీద పడింది. నవ నాగరికంగా పెరిగిన నాజూకు ప్లేట్లు కంచుగిన్నె మోటు సరసానికి మూడు ముక్కలై, ముక్కంటి మూడోనేత్రం లాంటి ఓ ముక్క నా కుర్చీకి తగిలి పరావర్తనం చెంది, నా చేతిని దూసుకుపోయి, గీసుకుంది. రక్తం చిమ్మింది. మా ఆవిడ చూపు ఎంత వాడిగా ఉందో నా కప్పుడు తెలిసింది!

యిద్దరం పాయింటు ఆఫ్ నో రిటర్న్‌కి చేరుకున్నాం. రాజీప్రసక్తి లేదు. నేను బయట కొచ్చి స్కూటర్ బర్ర్ మనిపించి క్లబ్‌కి పోయాను. సాయంత్రం యింటికి చేరే సరికి మా ఆవిడ సామాన్లు సర్దేసుకుంది. ఒక ట్రంక్, చిన్న బెడ్డింగ్, బుట్ట! నాకు కాళ్ళు వణికాయి. ఎంత పతనం! ధైర్యం తెచ్చుకుని గదిలోకి అడుగు పెట్టాను. 'నేను రేపుదయం వెళుతున్నాను' అంది ఆమె.

'మంచిది'—నేను.

'డబ్బు?'—ఆమె.

'బీరువా'-నేను.

'తాళాలు?'-ఆమె.

'టేబుల్ డ్రాయరు'-నేను.

'ఎంత?'-ఆమె.

'కావలసి నంత'-నేను.

భాష నింత పొదుపుగా వాడుకోవచ్చని యిద్దరం అప్పుడే గ్రహించాం. తర్వాత ఆ భాష కూడా అవసరంలేదు. ఆ రాత్రి యిద్దరం మౌనంగా గడిపాం. రాత్రి చేయి జాపినా తగలనంత దూరంగా పడుకున్నాం ఒకే పక్కమీద!

ఉదయమే స్టేషను దాకా సాగనంపి వచ్చాను. పళ్ళు బిగించి కళ్ళతోనే మాట్లాడుకున్నాం. రైలు కదులుతుంటే "వెళ్ళిపోతున్నావ్?" అన్నట్టు చూశాను. "మీరు వెళ్ళిపొమ్మన్నారు కదూ?" అన్నట్లు ఆవిడ చూసింది. ఆవిడ టా! టా! చెప్పలేదు. నేను బై! బై! చెప్పలేదు.




బరువు గుండెలతో యింటికి తిరిగొచ్చాను.

యింట్లోకి వెళ్ళబోతూంటే, మా పక్కింటావిడ గోడవతలనుంచి ఓ బాంబు పడేసింది-'మీ పాలవాడొచ్చి వెళ్ళిపోయాడండీ' అంటూ. నేను కొయ్యబారిపోయాను. స్టేషనుకు వెళుతూ, పిల్లలు యింకా లేవరు కదా అని బయట తాళం పెట్టి వెళ్లాను. దాని ఫలితం పాలు సున్నా. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. మా ఆవిడ రిక్షా ఎక్కుతూ 'పా........' అని వెంటనే మూతి బిగించుకుంది. 'పాపలిద్దరూ జాగ్రత్త' అని చెప్పబోయిందనుకున్నాను. యిప్పుడర్థమైంది. 'పాలవాడొస్తాడు' అని జ్ఞాపకం చెయ్యబోయి మానేసింది. నా మీద ఎంత కసి తీర్చుకుంది!

పొద్దుటే ఫిల్టరు కాఫీ పడితేగాని నా నరాలు చచ్చుబడిపోతాయి. అందుకని వెంటనే బయలుదేరి వీధులన్నీ గాలించి ఓ పాలవాణ్ణి లాక్కొచ్చాను. అప్పటికే పిల్లలిద్దరూ లేచి, బిక్క మొహాలు వేసుకుని కిటికి ఊచలు పట్టుకు వేళ్ళాడుతున్నారు. వాళ్ళని సముదాయించుకుని, కాచి ముందర వాళ్ళని సంతృప్తి పరిచాను. యింకా నా కాఫీ, నా నెర్వైన్ టానిక్ పడితే భీముడినై పోతాను. వస్తూనే ఫిల్టరులో యింత పొడి వేసి, వేన్నీళ్ళు పోసి ఉంచాను. కాని అర గంటైనా ఒక్క చుక్క దిగలేదు. ఫిల్టరులో నీటి మట్టం తగ్గలేదు. ఆశ్చర్యపోయాను. సిమెంటు, కంకర వేసి దట్టించిన యింటి స్లాబులే చినుకు పడితే చెమర్చి నీరు దిగిపోతున్నాయి. అలాంటిది రెండు చెంచాల కాఫీ పొడి నీటిని పూర్తిగా అటకాయించడం భౌతిక శాస్త్రానికే విరుద్ధమనిపించింది. యిళ్ళు కట్టించే వాళ్ళు సిమెంటుతో పాటు ఓ బస్తా కాఫీపొడి కూడా కలిపి స్లాబ్ వేస్తే యిక నీళ్ళు చచ్చినా కారవనిపించింది. కాఫీ ఆలస్యమై నాకు పిచ్చెత్తిపోతోంది. యింక ఓర్పు హరించి, ఓ అట్లకాడ పుచ్చుకుని, ఫిల్టరు పొట్టపడేలా యిటూ, అటూ బాదాను. ఎలాగో ఓ ఔన్సు దిగింది. కానీ మడ్డిమయం. మా ఆవిడ కాఫీ డికాక్షన్ తీస్తే ముఖం చూసుకునేంత స్వచ్ఛంగా ఉండేది. నా ఖర్మ! ఆ మడ్డి కాఫీయే రెండు గుక్కలు తాగి ముందు కార్యక్రమానికి ఉపక్రమించాను.

ఏడు గంటలే అయింది. స్థిమితంగా నా "ఆపరేషన్ కుకింగ్" ప్రారంభించవచ్చునను కుంటూ స్టోర్ రూమ్‌లో అడుగు

పెట్టాను. వెనకనే మా పెద్దమ్మాయి పన్నెండేళ్ళ శశివచ్చి "నాన్నా యివాళ మాకు స్లిప్ టెస్టుంది. తొమ్మిదికల్లా స్కూలు కెళ్ళాలి" అంది మా చిన్నాడు అరవిందు, "మా స్కూలుబస్ తొమ్మిదింటి కొచ్చేస్తుంది" అన్నాడు గొప్పగా. ఒక్కసారి దిగాలు పడిపోయాను. సావకాశంగా కానిద్దా మనుకున్న కార్య క్రమం ఒక్కసారి "ఎమర్జెన్సీ" గా మారి పోయింది. మొదటి రోజే పిల్లల "మొరాల్" దెబ్బ తింటే, ఆవిడ వచ్చేవరకు వీళ్ళని సముదాయించకం కష్టం. అందుకని లేని ఉత్సాహం తెచ్చుకొని, అరిచాను. "ఎస్! మీకు ఎనిమిదిన్నర కల్లా భోజనం తయార్! ఏం కావాలి మీకు?"

వాళ్లు వెంటనే కూటు, సాంబారు, గోంగూర పచ్చడి లాంటి హెవీ అయిటములు ఒకళ్ళ మీద ఒకరు పోటీలు పడుతూ కోరేసుకున్నారు.

"అవన్నీ సాయంత్రం! యీ పూటకి మీకు బ్రహ్మాండమైన వేపుడు. బ్రహ్మాండమైన చారూ...." అంటూ మొదలుపెట్టాను. నాటకీయతతో. వాళ్లు తినబోయే నా "బ్రహ్మాండాలకి" మురిసిపోయి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

అన్నిటికన్న సులభంగా అయ్యేది బెండకాయ వేపుడు అని గుర్తు చేసుకుని, బెండకాయలు తీసి తరగడం మొదలు పెట్టాను. నేను ఎప్పుడైనా వంట పనిలో సహాయపడతానంటే మా ఆవిడ "ఏదైనా చెయ్యండికాని, కత్తిపీట జోలికి మాత్రం రావద్దని" హెచ్చరించేది. అప్పట్లో అర్థరహితమైన ఆవిడ ఆందోళనకి నవ్వుకునే వాడిని. కాని ఆవిడ హెచ్చరికలో ఉన్న ఔచిత్యం యిప్పుడర్థమైంది. వేళ్ళు మూడుచోట్ల నరుక్కుపోయాయి! నా అరచేతిలో (దురదృష్ట) రేఖలు గుండా, రక్తం, గంగానదీ దాని ఉపనదుల రేఖాపటం గీసినట్టు పాకింది. వెంటనే వెళ్ళి ప్రథమ చికిత్స చేసి రక్తస్రావం అరికట్టి, యింత డెట్టాల్ పట్టించుకొచ్చి తరగడం పూర్తిచేశాను. ఆవేశం తప్ప ఆలోచన లేని యీపని ఫలితంగా తరిగిన ముక్కలు డెట్టాల్ వాసన గుప్పున కొడుతున్నాయి. అది గమనించి కంగారు పడి అదే ఆవేశం మైనస్ ఆలోచనతో గబగబా వెళ్ళి, ముక్కలన్నీ కుళాయి దగ్గర కడగడం ప్రారంభించాను. అంతే-ఒకటే జిగురు. కడిగిన కొద్దీ యింకా వస్తోంది. నేనొక పెద్ద జిగురు మాన్యుఫాక్చరింగ్ యూనిట్ ప్రారంభించి నట్టుంది దైవికంగా, పనిమనిషి అప్పలమ్మ చూసి "ఆ జిగురు కడిగితే పోదని, అలానే వేయించేయమని" సలహా యిచ్చింది.

ఆ ప్రకారం ముక్కలు తీసు కెళ్ళి మూకుడులో వేశాను. అంతకు ముందే కుక్కరులో కాసిని నీళ్ళుపోసి స్టౌమీద పెట్టాను. అందులో నీళ్ళు మరుగుపట్టాయి. ఓ గిన్నెలో పప్పు పెట్టాను. చారుకి మరో గిన్నెలో, నాకు ఉచితమని తోచినంత చింతపండూ, చిటికెడు పసుపూ, ఉసిరికాయంత బెల్లం, కందిపొడి అని రాసున్న బోర్నవిటా డబ్బాలో ఉన్న చారుపొడి రెండు చెంచాలు వేసి కుక్కరులో పెట్టాను. చారు చూస్తుంటే చాలా బాగా కుదురుతుందని నమ్మకం కలిగింది. "నాన్నా, అమ్మ చారుకన్న నీచారే చాలా బాగుందని," పిల్లలు నన్ను మెచ్చుకుంటున్న దృశ్యం కళ్ళకు కట్టి సంతృప్తిగా నవ్వుకున్నాను.

యిక అన్నం! బియ్యం ఉడికించి మెత్తగా చెయ్యడంకన్న అన్నం వండడంలో ఏమీ కాంప్లికేషన్లు లేవుకదా అనుకుంటూ ఉత్సాహంగా స్టోరు రూముకి వెళ్లి బియ్యం తేబోయాను. హఠాత్తుగా ఓ భయంకరమైన ప్రశ్న ఎదురైంది. ఎంత, లేక ఎన్ని బియ్యం? సోలెడా? తవ్వెడా? ... కుంచెడా? ఎంత? ఎంత? ఆ ప్రశ్న నన్ను వేధించేసింది. యిన్ని సంవత్సరాలనుండి అన్నం తింటూ మనిషికి సగటున ఎన్ని బియ్యం కావాలో తెలుసుకోని నా అజ్ఞానానికి, మూర్ఖత్వానికి నన్ను నేను

నిందించుకున్నాను. ఓమూల ప్రెషర్ కుక్కరు రైలింజనులా ఆవిరి చిమ్ముతోంది. బియ్యం డబ్బాదగ్గిర విమూఢ దైన్య మూర్తిలా నుంచున్న నా మెదడులో ఒక్క మెరుపు మెరిసింది! ఒకసారి మా ఆవిడ మాటల సందర్భంలో అంది 'మనకు నెలకు ఆరు కుంచాల బియ్యం ఉండాలండీ' అని. యింకేముంది, సమస్య పరిష్కారమై పోయింది.

నలుగురు మనుష్యులకి అరవై పూట్లకి ఆరు కుంచాలైతే, ముగ్గురు మనుష్యులకి ఒక పూటకి ఎంత? కాలము-పని లెక్క! వెంటనే కాయితం కలం తీసుకుని లెక్క కట్టి ఆ ప్రకారం బియ్యం కొలిచి గిన్నెలో పోశాను. ఆ సమయంలో నా సమయ స్ఫూర్తికి, గణిత ప్రావీణ్యానికి నన్ను అభినందించుకున్నాను. ఆడవాళ్ళు పదేళ్ళ అనుభవంతో నేర్చుకున్నది నేను నా మేధస్సుతో ఒక్క క్షణంలో గ్రహించాను. యిది మగజాతికే గర్వకారణ మనిపించింది. స్వోత్కర్షతో, ఆనందంతో పెదవులపైన విరియబోయిన నవ్వు మొగ్గలోనే రాలి పోయింది. కారణం? యింతకన్న భయం కరమైన ప్రశ్న ఎదురైంది. యీ బియ్యా నికి ఎన్ని నీళ్ళు పొయ్యాలి? పైగా కుక్క రుతో వ్యవహారం! మధ్య, మధ్య చేర్పులకీ, మార్పులకీ సావకాశం లేదు. శశిని సంప్ర దించాను. అది వట్టి బడుద్ధాయి. దానికేమీ తెలియదు. నోరు ఆవులించింది అప్పలమ్మ వెళ్ళిపోయింది. నాకు సలహా యిచ్చేవాళ్ళు లేరు. మళ్ళీ నా మెదడునే నమ్ముకున్నాను. నన్ను 'మేల్ షావనిస్ట్ పిగ్' అన్నా ఫరవా లేదు. మెదడు మొగాడి సొమ్ము. నా కో బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. నేనే ఆర్కిమెడిస్ నైతే 'యురేకా!' అని అరచి ఉండేవాడిని. నా సమస్యా పరిష్కారానికి ఓ చిన్న ప్రయోగం చేశాను.

"క్రితం రాత్రి వండిన అన్నములో నుండి ఒక మెతుకు తీసుకున్నాను. దానిని శుభ్రముగా తుడిచిన ఒక ప్లేటులో ఉంచాను. దానికి దగ్గరగా, ఉడకవలసిన బియ్యంనుండి ఒక గింజ ఉంచినాను. పార లాక్సు దోషము లేకుండా లంబకోణము నుండి రెండూ పరిశీలించాను. ఉడికిన మెతుకు, ఉడకని గింజకు ఎన్ని రెట్లుండెనో సాధ్యమైన దశాంశ భిన్నమువరకు ఊహించి సవరించినాను." యీ ప్రయోగ ఫలితముగా బియ్యపుగింజకన్న మెతుకు నాలుగురెట్లు పెద్దదిగా గ్రహించి, బియ్యపు గింజ తన పరిమాణమునకు నాలుగు రెట్లు నీటిని గ్రహించినట్లు నేను గ్రహించి, బియ్యం పరిమాణమునకు నాలుగురెట్లు నీరు పోసి కుక్కరులో ఉంచాను.

యింత శాస్త్రీయంగా, పరిశోధనా ఫలితంగా తయారవబోతున్న అన్నం మల్లెపువ్వులా విరిసిపోతుందని పూర్తిగా విశ్వసించాను. ఆ సమయంలో, 'నిత్య జీవి తంలో భౌతిక శాస్త్రము–దాని ఉపయోగ ములూ' అని ఓ పుస్తకం రాయాలన్నంత ఉత్సాహమొచ్చింది.

బెండకాయ వేపుడైతే నా వంట పూర్తయినట్టే. యింతలో నా మిత్రుడొక డొచ్చాడు. శశిని పిలిచి, ఓ గరిట చేతికిచ్చి, ముక్కలుకదుపుతూ ఉండమని వెళ్ళి మిత్రు డితో మాట్లాడుతున్నాను. మరో అయిదు నిముషాలకి శశి నన్ను లోపలికి పిలిచి 'నాన్నా, ముక్కలు వేయిస్తుంటే దారా లొస్తున్నాయి!' అంది బిక్క మొహంతో. మళ్ళీ నా మెదడు గిర్రున తిప్పేశాను. అర్థ మైంది! ద్రవరూపంలో ఉన్న బెండకాయ జిగురు వేడికి ఘనీభవించే సందర్భంలో తీగె, లేక దారం రూపందాల్చింది, అంతే! అమ్మా యికి ధైర్యం చెప్పి పంపాను. మళ్ళీ కబు ర్లలో పడ్డాను మరో నిముషానికే శశి కంగారుగా పిలిచింది. వెళ్లాను. 'నాన్నా బాగా దారాలొచ్చేస్తున్నాయి!' అని కొన్ని చూపించింది. అది జిగురు కాదు. దారాలు సూమల్లా ఉన్నాయి. గుండె గుభేల్ మంది. ఒక్క దుముకులో వంటింట్లోకెళ్ళి మూకుడు పరిశీలించాను. శశికి కలపడానికిచ్చిన గరిట

నగం కరిగిపోయింది. పొరపాటర్థమైంది. అది ప్లాస్టిక్ గరిట!

వళ్లు మండిపోయి, ముక్కలన్నీ బయట గుమ్మరించి వచ్చాను. తలవని తలంపుగా జరిగిన యీ దుర్ఘటనకి పిల్లలిద్దరూ నాకు తీవ్రమైన సానుభూతి చూపించి 'కూరలేకుండా తినడానికి' దయతో అంగీకరించారు.

గడియారం నా నెత్తిమీద తొమ్మిది గంటలుకొట్టింది మిత్రుణ్ణి కంపేశాను. పిల్లలప్పుడే బిల, బిల మంటూ డైనింగ్ టేబిల్ దగ్గర చేరి కంచాలు, గ్లాసులూ పెట్టేసుకుని 'అన్నం,అన్నం'అని గోల ప్రారంభించారు. నాకు కాళ్ళలోంచి వణుకు ప్రారంభమైంది. గబ, గబా వెళ్ళి కుక్కరు మూతతీశాను. ఆవిరి గుప్పున చేతికి కొట్టింది. వేళ్ళు మాడిపోయాయి. అంత బాధా ఓర్చుకుని గిన్నెలు బయటకు తీశాను. పప్పు! నీళ్ళలో గుండ్రని ప్లాస్టిక్ ముక్కలు వేసినట్లున్నాయి-కంది బద్దలు! నీళ్లు వంచేసి అవే తీసుకెళ్ళి యిద్దరి కంచాల్లో వడ్డించాను

"ఛీ! ఛీ! పప్పు యిలా ఉందేమిటి?" అంటూ యిద్దరూ ఏకగ్రీవంగా అసహ్యించుకున్నారు. "ఏడిశాదు. కలుపుకుంటే మెత్తబడతాయి" అని దబాయించి, అన్నం గిన్నె తెచ్చాను. అన్నం పైకి పువ్వులా కనిపించినా, గరిటె పెట్టగానే, నీళ్ళుగారిపోయి, జావలా ఉంది. ఒక్కసారి నీరసపడిపోయాను - నా గణితం ఎక్కడో తప్పింది! నా లెక్కలు నన్ను మోసం చేశాయి. ఇప్పుడు విచారించి లాభంలేదు. యిప్పుడు తక్షణ కర్తవ్యం, యించుమించు ద్రవరూపంలో ఉన్న అన్నం ఘనీభవింప చేయాలి. దానికి ఒకటే మార్గం అది బాష్పీకరణం. బాష్పీకరణం బాగా జరగాలంటే ఉపరితలం పెంచాలి. దీనికి అనువైన గృహోపకరణం చాట అని గుర్తించి వెంటనే చాట తీసుకొచ్చి అన్నం అంతా అందులో గుమ్మరించాను. ఫ్యాన్ ఫుల్ స్పీడ్ లో పెట్టాను. కిటికీ తలుపులు తెరిచాను

"యిప్పుడు, చాట చిల్లుల ద్వారా ఎక్కువ శాతము నీరు క్రిందికి వడగొట్టుట, అన్నం పరిచి ఉపతలము పెంచుట, తీవ్ర వాయు సంచలనము కలిగించుట మొదలైన మూడు విధముల నీటిని హరించుమార్గము ఒకేసారి ఉపయోగించుటచే," అన్నం అయిదు నిమిషాల్లో గట్టి పడుతుందని అంచనా వేసుకున్నాను.

కాని ఫలితం ఆశించినట్టుగా లేదు. ఆఖరికి ఆ చిముడు ముద్దలే వాళ్ళ కంచాల్లో వడ్డించాను. వాళ్లు గతిలేక అదే మింగడం మొదలెట్టారు. చారు కలుపుకుని "తూ! తూ!" అని ఉమ్ములు మొదలుపెట్టారు. కూర, అన్నం, పప్పు ఫెయిలయిపోయినా యివాళ చారు ఫస్ట్ మార్కు కొట్టేస్తుందనుకున్నాను. వీళ్ళ అసహ్యానికి కారణమేమై యుంటుందా అని కాస్త వేడిచారు నోట్లో పోసుకున్నాను. నాలిక్కాలిపోయింది ఉప్పు లేదు! చారు, ఫేసి దీనంగా చూస్తూ 'యూ టూ బ్రూట్!' అనుకున్నాను మనసులో, నమ్మిన బంటనుకున్న బ్రూటస్ కత్తిపోటుకి సీజర్ విలపించినట్టు. నిస్సహాయంగా యిద్దరి కంచాల్లో కాస్త ఉప్పువేసి 'తినండి!' అని గదిమాను. వాళ్ళు తిన్నారు....ఏకస్తూ. ఎలాగో భోజనాలయాయనిపించి యిద్దరినీ స్కూలుకి సాగనంపాను.

పిల్లలిని అర్థాకలితో పంపినందుకు ప్రాణంఉసూరుమంది వంటిల్లంతా చిందరవందరగా, యుద్ధ భూమిలాగుంది. బయట పారేసిన బెండకాయ ముక్కలూ, ప్లాస్టిక్ దారాలు, నేను లెక్కలు కట్టిన కాగితాలు నా పరాజయాన్ని గుర్తుచేసి వెక్కిరిస్తున్నాయి.

నా ప్రయోగాలతో పిల్లలను ఆకలితో మాడ్చే సాహసం నాకు లేదు. స్నానంచేసి బట్టలు వేసుకుని తిన్నగా పోస్టాఫీసుకి వెళ్ళాను, శశి పేరుతో టెలిగ్రాంపంపాను, 'ఫాదర్ అన్ వెల్. స్టార్ట్ యిమిడియట్ లీ!'*

# ముట్టడి

మూలం: కర్ట్ కుసెన్‌బర్గ్ • స్వేచ్ఛానుసరణ: ఎమ్. పార్థసారథి

తప్పం కట్టడం అలవాటైందనే నెపంతో అజయగఢ దుర్గం మీద దాడిచేశాయి చక్రవర్తి సైన్యాలు. వేగులవాళ్ళ ద్వారా ఈ విషయం పసిగట్టిన అజయగఢ రాజు దీర్ఘకాల యుద్ధానికి సమాయత్తమై, అందుకు సరిపడిన ఆహార ధాన్యాలను కోటలోపలికి చేరవేసుకని, కోట తలుపులు మూయించేశాడు.

చక్రవర్తి సైన్యాలు కోట చుట్టూ బారులు తీరాయి. నలువైపులా సేనలు వెలిశాయి. వాటి ముందరి నల్లని ఫిరంగులు అజయగఢ దుర్గం మెడలో హారంలా అందంగా కన్పించాయి.

ఒక నెల రోజులు తలుపులు తెరుచుకుంటాయేమోనని నిరీక్షించారు. ఈలోగా ఎట్లాగూ వాళ్ళ ఆహార నిలువలు క్షీణించి వుంటాయని వూహించి సైన్యాధిపతి దాడి ప్రారంభించాడు. మూడు రోజులు ఎడతెరిపి లేకుండా ఫిరంగుళ్ళు గర్జించాయి. ఆ ధ్వనికి దిక్కులు పిక్కటిల్లేయి. అజయగఢ దుర్గపు బలమైన గోడలు వణికాయి. కాని ఎక్కడా ఒక్క పగులు కూడా కనిపించలేదు. నాలుగో రోజు పదయాన సైనికులు మరింత ముందుకు వెళ్ళి కోటగోడలకు నిచ్చెనలు వేశారు. కాని అజయగఢ దుర్గపు రక్షక సైన్యాలు ఆ నిచ్చెనలను కూలగొట్టడానికి ఎంతోసేపు పట్టలేదు. కోటనుంచి పడిన సలసల కాగే నీరు చక్రవర్తి సైన్యాలకు శవస్నానమైంది. ఆ తర్వాత శత్రువులకు జరిగిన ఈ పరాభవం సరిపోదేమోనన్నట్లుగా లోపల పడిన ఫిరంగి గుళ్ళన్నీ తిరిగి ఈవలికి విసిరేశారు చక్రవర్తి సేనల ఆట సాగలేదు.

"సరే. మరికొన్నాళ్ళు నిరీక్షిస్తాను. కాలం గడుస్తుంటే వాళ్ళ ఆహార నిల్వలు పూర్తిగా క్షీణిస్తే అప్పుడు వాళ్ళే కాళ్ళ బేరానికొస్తారు" అనుకున్నాడు సైన్యాధిపతి. అలా దీర్ఘ నిరీక్షణ ప్రారంభమైంది. కాని అలాగే శత్రుసైన్యాలకు విసుగెత్తించే నిరంతర నిరీక్షణ కూడా మొదలైంది. సైన్యాలు శిబిరాలు వదలకూడదు. యూనిఫారాలు విడవకూడదు. ఎప్పుడూ డ్యూటీలో నించోవాలి. అంతే. అలా రోజులతరబడి ఆ దుర్గంవైపు చూస్తూ నిలుచోవాలి. ఆ నిర్విరామ నిరీక్షణతో వారికి దుర్గం అంటేనే అసహ్యం పుట్టింది. ఎంతసేపని అలా చూడటం? ఒకరోజు కాదు. ఒక వారం కాదు. ఒక నెల కాదు. శాశ్వతంగా! క్రమంగా సైన్యాలలో క్రమశిక్షణ తగ్గింది ఆటకారితనం వచ్చేసింది. ఇప్పుడది యుద్ధంలాగాక వినోదంగా తయారైంది. కాలం గడపటంకోసం వాళ్ళు కొత్త ఆటలు, పనులు అలవాటు చేసుకున్నారు. కొందరు జంతువుల్లాగా అరవటం, ఎప్పుడు పడితే అప్పుడు త్రేన్పులు తియ్యటం, తుమ్మటం, ధ్వన్యనుకరణ అలవాటు చేసుకున్నారు. శిబిరాల్లో దొంగతనాలు చేసి ఎవరు 'గజదొంగ' బిరుదు గెలుచుకుంటారోనని పోటీలు పెట్టుకున్నారు మరికొందరు ఆశువుగా కథలు, కవిత్వం చెప్పటం, సమస్యాపూరణం అలవాటు చేసుకున్నారు. దేశాలకు, జంతువులకు, చెట్లకూ మనుషుల పేర్లు పెట్టుకుని పిలుచుకున్నారు.

అలా విసుగే కాకుండా, కష్టాలూ, కడ

గండ్లూ కూడా మొదలైనాయి సైనికులకు. వెంట తెచ్చుకున్న మద్యం ఎప్పుడో ఐపోయింది. ఆహార నిల్వలు నిండుకున్నాయి. జీతాలు రావటంలేదు. చక్రవర్తి వీళ్ళకు అత్యవసర వస్తువులు కూడా సరఫరా చెయ్యటం మానేశాడు.

అజయగఢ పౌరుల్ని మాడ్చి చంపాలనుకున్న సైన్యాలు యిప్పుడు మాడుతున్నాయి.

రోగాని యింకా పడీ, చప్పుడూ లేదు. బైట ప్రపంచమే లేనట్లుగా వాళ్ళు లోపల హాయిగా బతుకుతున్నారు!

పరిస్థితి తెలుసుకున్న అజయగఢ పౌరులు వీళ్ళను ఏడ్పించటం మొదలెట్టారు. కోట గోడలెక్కి మరీ [illegible] తినిపించేవారు విందులు చేసుకుంటూ పాడేవారు. ఇదీ సరిపోక, వాళ్ళు ప్రతిరాత్రీ విందుల తర్వాత, 'దండెత్తి వచ్చిన సైన్యాధిపతికి అజయగఢ పౌరుల





"మీరు ఆహారాది అత్యవసర సరఫరాలను కూడా నిలిపేస్తే ముట్టడి సాగటం అసాధ్యం" అని సైన్యాధికారి చక్రవర్తికి అర్జీ పంపుకున్నాడు.

"ఎప్పుడో ఓసారి మెరుపుదాడి చేసి దుర్గాన్ని చేజిక్కించుకోవచ్చునేమోనని ఫర్లని పుల్గా మేపటానికి యిక్కడ డబ్బులేదు" అని చక్రవర్తినుండి శ్రీముఖం వచ్చింది.

సైన్యాధికారికి ఏం చెయ్యాలో పాలుపోలేదు. తలుపులు మూసుకొని కూర్చున్న ఈ దుర్గాన్ని ఎలా పట్టుకోవటం? పైగా ఎన్ని నెలల ఆహార నిల్వలు దాచుకున్నా

ప్రేమ కానుక' అంటూ వాళ్ళు తినగా మిగిలిన పదార్థాలు మూటగట్టి విసిరేసే వాళ్ళు. ఏ ఒక్క మూటా తప్పకోవాలి. సైనికులు నిద్రపోతున్నప్పుడు అర్ధరాత్రి వేళ సైన్యాధిపతి రహస్యంగా ఈ మూట విప్పుకొని కాలే కడుపుకు అవే ఆహారంగా చేసేవాడు. అలా మూట విప్పుకొని తింటున్నప్పుడు సైన్యాధిపతికి కోపం రాలేదనీ కాదు. అవమానం [illegible] ప్రాను అనుకునేవాడు. కానీ ఏం చెయ్యాలో తెలియనప్పుడు అతను మాత్రం ఏం చెయ్యగలడు చెప్పండి.

## అనిర్వచనం

నిజం తెలుసు
నీకూ, నాకూ—
రాత్రి బరువు మోయలేని గుండె
ఒంటరి నక్షత్రపు
కాంతి కిరణం వెనుక దాక్కుంది
కన్నీటి బరువుకు
కరిగిపోతున్న కాలం ముందు
జీవితం ఓ ధూళి పేటిక
తెరచినా మూసినా ఒకటే—
కాలానికీ కవికి మధ్య యుద్ధంలో
నువ్వో రణోన్మత్త రాగ భేరివి
అందుకే
నిజం నీకూ నాకూ తెలుసు
కలల తుపాకులతో నిలచిన
కళ్ళ సైన్యానికీ తెలుసు—
అధర సుధారస స్పర్శతో
అదరి ఆదమరచిన
అంతరంగపు అంతర్వాహినికీతెలుసు
నిజం ఒక్కటే నిజం
మౌనానికీ ధ్యానానికీ తెలుసు—
కాళ్ళను కౌగిలించుకున్న
వెన్నెల అలలకూ తెలుసు—
దవ్వును దగ్గరచేసి
నవ్వుతూ పోయిన మల్లెగాలికీతెలుసు
విశ్వపు కాగితంమీద
అనశ్వర భావాక్షయ అక్షరంగా
నిలచిన
అమృతాన్ని అరచేతిలో నిలిపిన
నిజం నీకూ తెలుసు—
నీకూ నాకు మధ్య నిజం
ఎప్పుడూ అనిర్వచనం

**శైలకుమార్**

ఒక రాత్రి అతడు మూట విప్పి, అందులోవున్న లడ్డు చిదిపితే అందులో ఒకచీటీ కన్పించింది. అవి దుర్గపు కొత్వాల్ రాసిన లేఖ. రహస్యంగా ఎక్కడైనా కలుసుకొని యిరువైపులకూ లాభసాటిగా వుండే విషయాలు మాట్లాడుకోవాలని దాని సారాంశం. చక్రవర్తి మౌనంకన్నా శత్రువుల అహ్వానం కొంతలో కొంత మెరుగనుకున్నాడేమో-అలా, సైన్యాలకు తెలియకుండా ఓ రహస్య స్థలంలో సమావేశం జరిపి కొన్ని నిర్ణయాలకు ఒప్పుకున్నాడు సైన్యాధిపతి. ఆ ఒప్పందంలో మొదటిది – ముట్టడి యిప్పుడున్నట్టుగా నిరంతరంగా, యింత తీవ్రంగా వుండక్కర్లేదు. రెండోది; సైన్యాలు యిరుగు పొరుగుల్లో కావరం చెయ్యొచ్చు. అలా ఒప్పుకున్న పక్షంలో, సైన్యాలకు, చక్రవర్తి బాకీవున్న జీతం అజయగఢే చెల్లిస్తుంది. ఐతే సైనికులు కూడా వూరికే అలా తిని కూర్చోకుండా అజయగఢ అధిపతులు చెప్పినపనులన్నీ చెయ్యాలి. అజయగఢయే వాళ్ళకక్కావలసిన యూనిఫారాలు అవీ సప్లయి చేస్తుంది. (వీటి ఖరీదు వాళ్ళ జీతంలో కోస్తారు) ఈ ఒప్పందం సైన్యాధిపతికి లాభసాటిగానే కనిపించింది. సైనికులకు జీతాలొస్తున్నాయని తెలియగానే, దూర ప్రాంతాలనుండి వర్తకులు వచ్చి అక్కడే దుకాణాలు వేసుకున్నారు. భుక్తి కోసంసైన్యం అజయగఢలోకెళ్ళి పనిచెయ్యడం మొదలెట్టారు. అలాగే, అజయగఢ పౌరులుకూడా శిబిరాల్లోకొచ్చి చిన్నాచితకా పనులుచేసి డబ్బులు చేసుకునే వారు. పనిపాటలకూ, వంట చెయ్యటానికీ, బట్టలుతకడానికీ అజయగఢ స్త్రీలుకూడా కొందరు శిబిరాల్లో కొచ్చి వెళుతుండే వాళ్ళని ప్రచారంలోకి వచ్చింది. ఈ రాకపోకల్తో ఆ సైనికులకు, స్త్రీలకు పెళ్ళిళ్ళు కూడా స్థిరపడ్డాయంటే ఆశ్చర్యంలేదు. ఆక్రమణ, ఆక్రమిత జనాభాల కలయికలో యిప్పుడు కోపంలేదు. సరదావుంది. సంతోషంవుంది. వేడుకవుంది.







చక్రవర్తికీ 'శుభ' వర్తమానం తెలియటానికి ఎంతో కాలంపట్టలేదు. తన సైన్యాలు అజయగఢ దుర్గంలోకి ప్రవేశించినందుకు చక్రవర్తి సంతోషపడే వాడేగాని అందుకోసం వాళ్ళే ఆయుధాలు ప్రయోగించారో అతడి కంతు పట్టలేదు ఇంకా విశదంగా వార్తలు సేకరించుకురమ్మని చక్రవర్తి ఒక్క రాయబారిని పంపాడు. అతడు ఒక అజయగఢ సుందరిని పెళ్ళి చేసుకొని అక్కడే స్థిరపడిపోయాడు. ఆ తర్వాత వచ్చిన రెండవ, మూడవ రాయబారులు కూడా యిలాంటిపనే ఏదో చేశారు. చివరికి నాల్గోవాడొకడు తిరిగి వెళ్ళి చక్రవర్తికి అసలు సంగతి విశదపరచాడు.

ఇన్నాళ్ళు నిరీక్షించిన చక్రవర్తికి ఓపిక లేదని అతని శత్రువులు కూడా అనలేదు. కాని ఎంతటి సహనానికైనా హద్దుంటుంది. చక్రవర్తి హుటాహుటిగా కొత్త సైన్యాధిపతిని యుద్ధానికి పంపించాడు. మొదటివాడికి కాస్త గడ్డి పెట్టమని. ఈలోగా మొదటి సైన్యాధిపతి అజయగఢపు కొత్వాల్‌గా నూతన పదవీ బాధ్యతలు, స్వీకరించాడు. కొత్త సైన్యాధిపతి ఆధిపత్యంతో సైన్యాలు బాగా సమీకరించాయి. కాని వాళ్లు పేలుస్తున్న ఫిరంగి గుళ్ళలో దాగి ప్రేమలేఖలూ, తినుబండారాలూ వున్నాయని అతడికి తెలియదు. అందువల్ల దుర్గం యింకా లొంగకపోవటం చూసి మరోసారి ఆశ్చర్యపడ్డాడు. (సైనికులు ఈ పని చెయ్యటానికి కారణం వుంది. ఇప్పుడు వాళ్ళకు రెండు జీతాలు వస్తున్నాయి)

ఒక మూడు నెలల నిరీక్షణ తర్వాత సైన్యాలు ముట్టడి విజృంభించాయి. మరోసారి నిచ్చెనలు వేసాయి. సైనికులు ధీర గంభీరంగా పైకెక్కారు. కోట లోపలి నుండి ఏ రకమైనా ప్రతిఘటనా లేక పోవటం చూసి సైన్యాధిపతికి ఆశ్చర్యం కలిగింది. ఐతే, ఈ సైనికులు పైకెక్కి, తమ యూనిఫారాలు, కవచాలూ తీసేసి లోపల వైపున నిరీక్షిస్తున్న తమ వాళ్ళను కౌగిలించుకున్నారు.

ఈ స్నేహ సౌభ్రాతృత్వానికి విస్తుబోయిన సైన్యాధిపతి చక్రవర్తికి ఈ విషయం స్వయంగా విన్నవించటానికి పయనమయ్యాడు. ★

ఈ చర్చ ఇంతలో తేలదని గ్రహించి నావంక చూశాడు జీవనమూర్తి — నా కథ చెప్పమని. నేను ఎన్నో కథలు విన్నాను ఎన్నో కథలు చదివాను. ఏ కథ చెప్పాలి? ఏది చెప్పినా మరిన్ని మంచి కథలకు అన్యాయం జరుగుతుంది. ఇంతలో తళుక్కున మెరిసింది గుంటూర్లో నా కథానుభవం.

అత్యల్పం. కానీ శిల్పంలో మాత్రం ఆ కథ అనల్పమని నాకనిపించింది.

ఆ రాత్రి నాకా కథ చెప్పిన కథకుడి వయస్సు పాతికేళ్ళు.

గుంటూరు పనిమీద వెళ్ళాను. రెండ్రోజులు ఉన్నాను. రెండు పగళ్ళూ, రెండు రాత్రుళ్ళు — మా బంధువులింట్లో. నేను




అదే చెప్పాను.

o o o

దాదాపు ఎనిమిదేళ్ళ కిందట, ఓ రాత్రి పూట భోజనం చేసి పడుకోబోయేముందు నేనో చిన్న కథ విన్నాను. అది నన్నెంతో ఆశ్చర్యపరచిన కథ ప్రపంచ ప్రసిద్ధమైన ఏ కథకూ అది తీసిపోదని నాకప్పుడే అనిపించింది. ఆ కథ చెప్పడానికి తీసుకునే సమయం, రాస్తే కాగితంపై పట్టే స్థలం

గుంటూరొచ్చి మరెక్కడున్నా దీంతో నన్ను తన్నింట పడేసే దూరపు బంధువు ఒకాయనున్నాడు అక్కడ. మేం బంధువులుగా కలుసుకున్నాం, స్నేహితులుగా ఎక్కువగా కలిసిపోయాం, అభిప్రాయాల దృష్ట్యా. మరెక్కడున్నా గానీ, బజార్లో పట్టుబడిపోతే సంజాయిషీ ఇచ్చుకోడం, నానా అవస్థా పడి తిరిగి మా[illegible]న ఇంటి వా[illegible]డం, యీ గొడవంతా ఉసికిసి తిన్నగా ఉన్న

దిగి ఆయనింటికే వెళ్ళిపోయాను.

ఆయనా, ఆయన భార్యా చాలా ఆపేక్ష మనుషులు. వాళ్ళకో మూడేళ్ళ బాబు, నెలల పాప. ఈ మూడేళ్ళవాడే మనకథా రచయిత. వాళ్ళు గాక ఆ గృహస్థునికున్న ముసలి తల్లి, ముసలి తండ్రి (ఆయన దగ్గరు) వెరసి నాలుగు నిండు, రెండు అరటిక్కెట్ల సంసారం. రెండు గదులనిపించుకునే గదులు, గృహిణి మాత్రమే పట్టే వంటిల్లు. ముసలి దంపతులు మాట్లాడుకుంటూ పడుకోడానికి వీలుగావున్న వరండా—మూల బాయిలరు, ఒక గదిలో ఉయ్యాల మంచం, పనికొచ్చీ పనికిరాని అనేక సామాన్లు (మధ్య తరగతి కొంపల్లో పనికొచ్చే సామాను కంటె పనికిరానిసామానే ఎక్కువ వుంటుంది గదా) మరో గదిలో గోడకు ఆన్చిన రెండు మంచాలూ, మూల స్టూలుపై ఒద్దికగా పేర్చిన పక్క బట్టలు, రెండు చాపలూ, గోడలకి దేవుళ్ల కేలండర్లూ, వాటి పక్కనే ఫోటోల్లోంచి నుంచునీ, కూచునీ బుద్ధిగా చూస్తున్న తలపాగలూ, కోట్లూ, బేసర్లూ వడ్డాణాలూ - ఆ ఫోటోల్లోని మనుషులు ఆ ఇంట్లోనే వుంటూ ఏదోపని మీద పొరుగూరు వెళ్ళినట్లుగా వుంది తప్ప వాళ్ళంతా శాశ్వతంగా వెళ్ళిపోయినట్లుగా లేదా వాతావరణం.

మొదటి రాత్రి ఎటువంటి సంఘటనా లేకుండానే గడిచిపోయింది. ఇంట్లో అటూ యిటూ బంతిలా తిరిగే ఆ మూడేళ్ళ బాబుని దగ్గరికి తీద్దామంటే వాడు పడనివ్వలేదు. నేను ఎంత గోముగా పిలిచినా, నన్ను విలన్లా చూస్తున్నాడు.

రెండో రోజు రాత్రి మేం అంతకుముందు లాగే మంచాల గదిలోనే భోంచేశాం. తండ్రి పక్కనే బుద్ధిగా కూచుని భోం చేశాడా కుర్రాడు. చేతులు తుడుచుకుని కిళ్ళీకి, సిగరెట్లకి బయటికి వెళ్ళాం కబుర్లు చెప్పుకుంటూ. ఇంటికి తిరిగొచ్చేప్పటికి మంచాలు వాల్చి, పక్కలు వేసి సిద్ధంగా వున్నాయి. ఒక చిన్న మంచం, మరోటి కాస్త పెద్దది. అదినాకు, నేను అతిథిని గదా. మంచాల మీదే కూచుని కబుర్లు కొనసాగించాం నేనూ, మా బంధువూ. అతను గుంటూరు రాజకీయ జాగ్రఫీ చెబుతున్నాడు. ఇంతలో వంటింట్లో, గిన్నెల చప్పుళ్లు దాటి మాటలు కాస్త పెద్దవైనై. కుర్రాడూ, వాళ్ళమ్మా, ఆ కుర్రాడింకా పడుకోనందుకి తల్లి విసుక్కుంటోంది. ఆ విసుగు మా మాటలవరకూ రావడంతో, తండ్రి ఆ కుర్రాణ్ణి కొట్టడానికో, కోప్పడ్డానికో కోపంగా లేచాడు. నేనతన్ని వారించి, పక్క గది గుమ్మం దగ్గరికి వెళ్ళి, "బాబూ ఇలా రా" అని పిలిచాను, కుర్రాడు—తలెత్తి నావంక చూశాడు గాని ఒక్క అంగుళం కదల్లేదు. వాళ్ళమ్మ లేచి, "చూడండన్నయ్యా. కథ చెబితే గాని పడుకోడు, రోజూ యిదే వరస" అని టూకీగా చెప్పేసింది అసలు గొడవేమిటో. "నే కథ చెబుతా రా బాబూ" అన్నాను. కుర్రాడు అపనమ్మకంగా నా వంక చూశాడు. "వెళ్లు నాన్నా, మామయ్య గారికి బోలెడు కథలొచ్చు, చెబుతారు వెళ్లు" అంది వాళ్ళమ్మ.

కుర్రాడిలో కాస్త కదలిక వచ్చింది. ఈ లోగా నేను చేతితోనూ, తలతోనూ రమ్మని సైగ చేస్తూ నమ్మించడానికి ప్రయత్నించాను. నెమ్మదిగా కుర్రాడు కదిలొచ్చాడు. అతని చెయ్యి నా చేతుల్లోకి తీసుకుని, నా మంచం వరకూ నడిపించుకొచ్చి, నా మంచంమీద పడుకుంటేనే కథ చెబుతానన్నాను. పట్టీని అనుకుని పక్కన చేరాడు. నేను దగ్గరకి లాగి, దుప్పటి యిద్దరికీ గుండెలవరకి కప్పి-నీపేరేమిటి బాబూ? అన్నాను, ఎలా మొదలెట్టాలో తెలీక.

"కిరణ్" అన్నాడు గట్టిగా.

"కిరణ్ నాకు చాలా కథలొచ్చు. అయితే నువ్వు ముందు నాకో కథ చెబితే ఆ తర్వాత నేనో కథ నీకు చెబుతా" అని

## ఊహలు

ఊహల రెక్కలు కట్టి
ఉత్సాహంతో పైకెగిరితే
వాస్తవాలు తుపాకులై
కోపంగా నేలకూల్చాయి

పద్మ

పంతు పెట్టాను.

"ముందు నువ్వు చెప్పు" అన్నాడు.

"నువ్వు కాదు, మీరు—అనాలి వెధవా" అన్నాడు వాళ్ళ నాయన

"నువ్వా? మీరుకో" అని అతన్ని వారించి "నేనే ముందు చెబుతాలే, అయితే ఆ తర్వాత నువ్వు తప్పకుండా చెప్పాలి, సరేనా, అందుకు ఒప్పుకుంటేనే చెబుతా" అన్నాను.

"ఊఁ" అన్నాడు కిరణ్ నెమ్మదిగా.

రాజుగారు, ఏడుగురు కొడుకులూ వేటకెళ్ళడం కథ మొదలెట్టాను.

"ఈ కథ నాకు తెలుసు—, ఇంకోటి చెప్పు" అన్నాడు కిరణ్, దొంగని పట్టుకున్నట్టు

"[illegible]గా ఎగ. నీకు తెలిసిన కథలో ఒక చేప ఎండదు ఇందులో ఏడు చేపలూ ఎండవు" అని తిరిగి మొదలు పెట్టి, అతనికి అర్థమయ్యేలా చెప్పడానికి ఎన్నో కష్టాలు పడి—పదాల్తో, శబ్దాల్తో, సైగల్తో, యాక్షన్‌తో నీటిలోని చేపల మధ్య చేపల్లా సి.ఐ.ఎ., కె.జి.బి.లు ఆయా దేశ రాజకీయాల్లో ప్రవేశించి ఎలా నిజమైన చేపల్ని నీటి బయట పడేస్తాయో, నీళ్ళు ఎండిపోయేలా చేస్తాయో అన్వయించి చెప్పాను. కిరణ్ మధ్య మధ్య చిన్న చిన్న ప్రశ్నలు వేస్తూ చెప్పిస్తోనే కాదు, ఆసక్తితో కూడా చాలా శ్రద్ధగా కథ విన్నాడు.

ఎప్పుడు నిద్రలో కెళ్ళాడో—మా బంధువు పెట్టే గురక బాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌గా మారిపోయింది.

"ఊఁ. ఇంక నువ్వు కథ చెప్పు" అన్నాను.

కాసేపు ఆలోచించాడు. కథ చెప్పనా అని మళ్ళీ నేను అనడంతో— 'ఇంతి కథ' అన్నాడు చిటికంత అన్నట్లు రెండు వేళ్ళు దగ్గరగా అదిమి చూపిస్తూ. 'పర్వాలేదు ఎంత కథైనా సరే, చెప్పు' అన్నాను. 'చాలా బుల్లి కథ' అన్నాడు తిరిగి—తర్వాత నేనెక్కడ అభ్యంతరం లేవదీస్తానో అనే అనుమానంతో.

"ఫర్వాలేదు. చెప్పు" అన్నాను.

కిరణ్ తన బుల్లి కథ చెప్పాడు.

"అనగనగా ఒక ఊళ్ళోనేమో ఒక బిస్కట్ల డబ్బా వుంది... ఒక పాపాయేమో డబ్బా దగ్గర కెళ్ళి - "డబ్బా డబ్బా, నాకో బిస్కత్తు యివ్వవా" అని అడిగింది. డబ్బాయేమో మూత తీసి, ఒక్క బిస్కత్తు యిచ్చింది. పాపాయేమో బిస్కత్తు తింటూ ఇంటికెళ్ళిపోయింది"

నేను ఆశ్చర్యంగా యింకా చూస్తూ వుంటే 'అయిపోయింది' అన్నాడు కిరణ్ నవ్వుతూ.

డబ్బాని ఒక పాత్రగా సూటిగా ప్రవేశ పెట్టడం, ఆ వయసులో చిరుతిండిపై వుండే కోర్కెను ఆశలో కథా వస్తువుగా తీసుకోవడం, సంఘటనతో కూడి ప్రయోజనాన్ని సాధించిన పద్ధతి—ఇదంతా నాలో కొత్త రచనా రహస్యాలను ఆవిష్కరించినట్లనిపించింది.

○ ○ ○

నాయరు కూడా మా వెనక నుంచుని వింటున్నాడు.

"ఇది నిజంగా గొప్ప కథ. పిచ్చివాళ్ళూ, పసి పిల్లలు మాత్రమే చెప్పగల కథ. మహోత్కృష్టమైన కళావిర్భావం కూడా ఉన్మాద స్థితిలోనే జరుగుతుంది. ప్రయోజనాన్నీ, నిరాడంబరత్వాన్ని బలమైన శైలిగా మలచడం, అనేక కోణాలు కలిగి వుండడం, కనబడని చేతుల్తో కొత్త కిటికీలు తెరవ గలగడమే శిల్ప రహస్యం" అంటూ లేచాడు జీవనమూర్తి.



ప్రియంవద ఓ స్త్రీ. స్త్రీ అంటే నేటి స్త్రీ కాదు. కొన్ని వందల ఏండ్ల నాటి స్త్రీ. బ్రాందీ విస్కీలు .. బీర్లు, బార్లు. బ్రోతల్ హౌస్‌లు... దొంగవోట్లూ.......దాపరికపు చూపులూ ....సామ్యవాదాలూ...ప్రజాస్వామ్యాలూ....విప్లవాలూ ..ఎలక్షన్లూ...ఓట్లూ... వచ్చనోట్లూ... వగైరాలు ఏమీ తెలియని నాటి కాల. స్త్రీ

ప్రియంవద నర్తకి; డాన్సర్ - అంటే కాబరే డాన్సరు కాదు. కథకళీ నర్తకి కాదు. సింహాలలాంటి రాజుగారి ముందు నక్కలూ, తోడేళ్ళూ, గద్దగూబలూ వంటి ఆయన "సభ్యుల" ముందు నాట్యం చేసి రంజింపచేసే విశాల నయనాల జింకలాంటి నర్తకి. మరిచిలాంటి మిసను. మిసను లాంటి మగువ.

రాజనర్తకి. 'రాజ'- ఆ పదాన్ని ముందు తగిలిస్తే ఎంత చెత్తకైనా గొప్ప విలువ రాజనర్తకి....రాజగురువు. రాజవైద్యుడు.. రాజవోరుకు ...రాజ పతిత ...

ప్రియంవద కళ్ళు మూసుకొని పడు కుంది. పడుకున్నట్లు కళ్లు మూసుకుం ఆలోచిస్తోంది గుర్రాల మలమూత్రాలతో కంపు కొడుతూన్న సైనికుల అశ్వశాలల్లో మూగిన ఈగల్లా....ఆమె మదిలో ఆలోచనలు మెరుస్తున్నాయి. "ఛీ' ఛీ' ఏమిటీ బ్రతుకు? పాడు బ్రతుకు! రోత పుట్టు

# తరం తరం నిరంతరం!

సి.హెచ్.జె. సత్యానందకుమార్

తోంది."

"ఏ ? నీకేం తక్కువ చెప్పు? కోరిన వెంటనే అన్నీ సమకూర్చే మహారాజులవా రున్నారు నీకేం కొదవ?" శవంలోని బేతాళుక లా ఆమెలోంచి మరో ఆమె ప్రశ్న.

"ఫో! పో! ఛీ! ఛీ! నువ్వెప్పుడూ ఇంతే. కోరినవన్నీ యిస్తారా? ఏంటిస్తారు? నగలూ గట్రా....తి.డీ, గిండీ....చీరెలు... ఏదీ ఇవ్వమను. ఓ పసుపుతాడు, ఓ తాళి బొట్టు... ఓ నిండు మనసు....??

రాజుగారెందుకిస్తారు? నేను రాజన ర్త కిని. ఆయన రాజశేఖరుడు. పోనీ, ఇంకే వెధవచేతనైనా కట్టించుతారా? రాజుగారు తలచుకుంటే ఏదైనా....ఛీ! ఛీ! అలా అయితే ఎలా? ఆయనముందు నే నాట్యం మాడాలి....అది నా విధి. నా పొందులో ఆయన కరిగిపోవాలి. అది ఆయన హక్కు.

నేను నర్తకిని. వేశ్యను....అందచందా లను, ఒంపుసొంపులను రాజులకు, మారాజు లకు అంకితం చెయ్యడానికే పుట్టుకొచ్చిన ప్రియంవదను"

చిన్నప్పుడు... పధ్నాలుగేళ్ళు వయ సేమో!....రాజుగారి శయనాగారంలో అలంకరించడానికి చిత్రకారుడు రూపులు దిద్దుతున్న నగ్నసుందరి చిత్రంలా, వయ సులో, సొగసులో జోరుగా మార్పు లొస్తున్న తరుణం.

ఇంటికి రోజూ ఎందరెందరో వస్తూండే వారు. మంత్రులూ, దళవాయిలూ, వ్యాపారులూ....రత్నాల వర్తకులూ, ఉన్నతోద్యోగులూ....

"అమ్మా ఎవరే వీళ్ళంతా? ఎందుకే వస్తున్నారు?"—ప్రియంవద అమాయకపు ప్రశ్న. "కొన్నాళ్లు పోతే నీకే తెలుస్తుంది" అనేది తల్లి. కానీ వాళ్ళే మన నాధులు.... మన పోషకులు- పోషించే కుబేరులు....అని చెప్పేది కాదు. రానురాను కూతురే తెలుసు కోగలదని తెలుసామెకు.

"అమ్మా! నా స్నేహితులంతా వాళ్ళ నాన్నల గూర్చి చెపుతూంటారే? మరి మా నాన్నెవరే?" మరీ చిన్న వయసులో ప్రియంవద తల్లిని అడిగిన ప్రశ్న.

"పిచ్చి ముండా! మనకు నాన్న లుండరు. దిక్కులేని వాళ్ళకు దేవుడే తండ్రి. నాట్య కత్తెలయిన కళాకారులకు కళాపోషకులే తండ్రులు తెలుసునా?"

"తెలుసు....తెలుసు...నా కొక్క నాన్నే మిటి? అందరూ నాన్నలే! అందరూ నాధులే!" పద్దెనిమిదేళ్ళ పడుచు ప్రాయం. సంగీతం గురువుగారు సంగీత పాఠాలు నేర్పటం, నాట్యాచార్యుల వారు నాట్య రీతులు బోధించడం పరిపాటే - ఆ రెండు వాళ్ళకు పెట్టుబడులు.

"వీధిలో కోలాహలం ఏమిటి?" గవాక్షం దగ్గరకు వెళ్ళి చూసింది ప్రియంవద. బాజాలు.. భజంత్రీలు....పల్లకీ..బోయీలు. పల్లకీలో నవ దంపతులు - అరె ఆ పెళ్ళి కూతురు మాలిని లాగుందే! అవునవును. మాలినియే! నా చిన్ననాటి స్నేహితురాలు మాలిని—పెళ్ళై వెళ్ళిపోతోంది. భర్త పెద్ద రత్నాల వర్తకుడు.

పెళ్ళి......చిన్ననాటి నెచ్చెలి పెళ్ళి చూసేందుకు మనిషిగా తనకు నిషేధం. పెళ్ళి పందిట్లో తాను ప్రవేశింప కూడదు. పవిత్ర కార్యం మయిల పడిపోతుంది. తను నర్తకి....వేశ్య. వేశ్య కూతురు. వేశ్య మనుమరాలు. వేశ్య ముని మనుమరాలు... వేశ్య... వేశ్య ...వేశ్య....తరతరాలుగా...

పెళ్ళి తరువాత పెద్దసభ. ఆహ్వానితులకు మహోల్లాసం, ఆహ్లాదం కలిగించడానికి నాట్య ప్రదర్శన. అందుకు నేను కావాలి. సభికుల్ని రంజింప జేయటానికి నాట్యకత్తె కావాలి. వేశ్యకావాలి. అప్పుడు పెళ్ళి మైల పడిపోదు... ఛి! ఛీ!

నాకూ ఓ తాళిబొట్టు........ఓ పసుపు తాడు....నాకూ నా వాడంటూ ఒక భర్త, కొందరు పిల్లలు....నాకూ నాదంటూ ఓ యిల్లూ....ఓ సంసారం!

ఛీ! ఛీ!....నీకెందుకే మొగుడు! మంటి గడ్డ! నీకెందుకు సంసారం? సంసారం



ఉన్నతి




సాగరం. ఇలా హాయిగా....ఏ దిగులూ, ఏ బాధ్యత లేకుండా....సుఖంగా......అమర భోగాలు అనుభవిస్తూ .. బ్రతకలేవూ?" మళ్ళీ ప్రశ్నించింది తనలోని ఆమె-శవంలోని భేతాళునిలా!

రాజుగారి గాఢాలింగనంలో... కరిగిపోతుంటే...ఎన్నాళ్ళు? ఎంత కాలం? కలకాలం కాదే? భోగం దాని భోగాల? దాని అందం ఉన్నంత వరకే! రాజుగారి మోజు తీరినంతవరకే! తరువాత మరో ప్రియంవద. మరో పారిజాతం.

మరి నేనో! రాజుగారి నుండి మంత్రిగారికి, మంత్రిగారినుండి సేనాపతి గారికి, ఆయనగారినుండి మరో—గారికి ఆ మరో ....గారి నుండి ద్వారపాలకునికి ఆ తరవాత వీధిలోకి....కుక్కలు చింపిన విస్తరిలా....చివరికి కాటిలోనికి....!

రాజనర్తకి నుండి ...వీధి వేశ్యగా..... ఊరకుక్కగా...

ఆకాశం నుండి....పాతాళానికి!.....ఛీ! ఛీ! ఏం వ్యవస్థ? ఏమి బ్రతుకు?

పరువుగా బ్రతుకుదామన్న ఆశ.... కానీ తీరదు....నీతిగా ఉందామన్న కోరిక. కాని తీరదు....ఈ సమాజం ఓ సాలెగూడు. తప్పించుకోవటం అసాధ్యం.

కరవాలం లాంటి రాజుగారి కరకు చేతులు ...చురకత్తుల్లాంటి మంత్రిగారి కోరిక నిండిన కళ్ళు...బాకుల్లాంటి సభికుల కక్కుర్తి చూపులు...బాణాల్లాంటి లోకుల సూటీ పోటీ మాటలు...ఇవన్నీ మారవు వీటినుంచి తప్పించుకోలేను. ఈ వ్యవస్థ మారాలి!

మహారాజులూ ... మంత్రులూ.... రాజుగారి ఉపపత్నులు... ఉంపుడు కత్తెలు.... నర్తనశాలలూ... అన్నీ....అంతాపోవాలి. చచ్చిపోవాలి. గాలిలో కొట్టుకుపోవాలి. ధూళిలో కలిసిపోవాలి అగ్నిలో మండిపోవాలి.

అంతవరకూ.... నాకూ.... నాలాంటి ప్రియంవదలకు స్వేచ్ఛలేదు. కటకటాల్లోని బందిఖానాలాగ ఈ అందాల భవనాల నుంచి... పాతాళానికి కొనిపోయే మల్లెపూల పాన్పుల నుంచి....బంగారు పంజరాల నుంచి .. బురద గుంటలనుంచి....కులవ్యవస్థల నుంచి....కుళ్ళు సాంప్రదాయాల నుంచి....విముక్తి లేదు....స్వేచ్ఛలేదు.

మారాలి!మారాలి! ఈ వ్యవస్థ మారాలి. ప్రియంవద ఆలోచిస్తూనే కాలగర్భంలో

చెయ్యడానికి గానీ - మా నవుల తో, కాపురాలు చెయ్యొచ్చా? అప చారం! పూజారి గారి అండ, చాటు ఉంది కాబట్టి సరిపోయింది. కాకపోతే ఊరిలో పెద్ద రైతు ...గ్రామపెద్ద .కొత్వాలు..... వీళ్ళంతా పెద్దపులుల్లా, తోడేళ్ళలా మీద పడి వుండేవారు చిన్నప్పట్నుంచి అనుకునే దాన్ని-నాకెందుకు పెళ్ళవదూ? నీ వెందుకు పెళ్ళాడ కూడదూ? నాకెందుకు తండ్రి లేడూ? నాకెందుకు ఇల్లు, సంసారం, పిల్లలూ....ఉండకూడదూ? అని, నన్నెవరు ఆదరిస్తారు? నన్నెవరు పెళ్ళాడుతారు? మా కులాన్ని ఏర్పర్చింది ఎవరు?-అని.

ఇవన్నీ నాకు జవాబు దొరకని ప్రశ్నలు. కాని పెద్దలకవే ప్రశ్నల్లేని జవాబులు. అందుకే నాకందకుండా దాచేశారు జవాబులను. నన్ను ప్రేమిస్తారు. నన్ను కామిస్తారు. కాని నన్నెవరూ పెళ్ళి చేసికోరు. ఛీ! ఛీ! ఛీ! పోవాలి పోవాలి! ఈ దేవుళ్లు దేవదాసీలూ...దేవాలయాలు పూజారులూ...ప్రత్యక్ష దైవాలు... నగ్న శిల్పాలు...బూతుబొమ్మలు పోవాలి! ఎగిరి పోవాలి. చచ్చి పోవాలి గాలిలో కొట్టుకు పోవాలి. అగ్నిలో మండి పోవాలి.

పంకజం ఆలోచిస్తూనే కాల గర్భంలో కలసి పోయింది. కరిగి పోయే కాలం-పరుగులు తీస్తూనే ఉంది.

○ ○ ○

పరిమళ నేటి సమాజంలో ఓ స్త్రీ. అందరిలా సంసారం చేసుకునే స్త్రీకాదు. నలుగురిలా మొగుడితో సినిమాకి వెళ్ళి బాల్కనీలో మొగుడి ప్రక్కన కూర్చొని తానే హీరోయిన్లా ఫీలయ్యే స్త్రీ కాదు. డాక్టరు మొగుణ్ణి డబ్బైవేల రూపాయలతో కొనుక్కున్న లక్షాధికారి కూతురు కానేకాదు. భర్త స్కూటరు కొనుక్కోటానికి నాలుగువేలు పంపమని-సగటుమనిషి, సాధారణగుమాస్తా అయిన తండ్రికి రాయలేక ఉత్తరాలు రాసే ఆడకూతురు అసలే కాదు.

ఆధునిక సమాజపు నిఘంటువు ప్రకారం పరిమళ వేశ్య....కులట.....పతిత.....చెడి పోయిన ఆడది .. సమాజానికి చీడపురుగు.. ప్రగతికి ప్రతిబింబం.

పరిమళ పడుకుంది కానీ నిద్ర రావటం లేదు. మున్సిపాలిటీ కాలువల్లోని దోమ ల్లాగ, పూర్ణా మార్కెట్లో కుళ్ళుకొడ్తున్న చేపలమీద ముసురుతున్న ఈగల్లాగ, ఆమె మనసులో, మెదడులో ఆలోచనలు రేగు తున్నాయి. ఆమె హాయిగా నిద్రపోవటం లేదు సాయంత్రంనుంచీ తెల్ల వారుజాము వరకూ "డ్యూటీ" చేసి.

మల్లె పూవులు... ముసిముసి నవ్వులు.... కనుసైగలూ .. ..పైట రెపరెపలూ........ బేరాలూ....చీకటి గదులూ... దిలే ఆకా రాలూ... పంటి గాట్లూ... బూతుకబుర్లూ, సారా కంపులూ.....పోలీసుల బీట్లూ..... విటులూ... బీటు పోలీసుల మామూళ్ళూ, పేరు తెలియని ప్రియులు...పికానో కైయిం టింగ్స్లా కదిలే నీడలూ....అర్ధరాత్రి రోడ్ల మీద వడిగ పులూ.... సెకెండ్ షో జనాలూ.. పళ్లి కిలింపులు, సకిలింపులు....మళ్ళీ విటులు.. పల్చబడ్డ బేరాలు... ఆయాసంతో తేలి పోతూన్న శరీరం—చికాకుగా బరువెక్కు తున్న మనస్సు—!! ఈ రొటీన్ అనంతరం మరి బేరాల్లేక ఎక్కడో కోడి కూయగా, ఆయాసంతో, అలసటతో, మేనువాల్చి నిద్ర పోవటానికి ప్రయత్నిస్తుంటే-రాని నిద్ర, పిలవని పేరంటంలాగా ఆలోచనలు, మన సంతా ఆలోచనలు...

ఛీ! ఛీ! ఏం బతుకులు, ఇలా బతికే కన్నా చచ్చినా బాగణ్ణు బతికి ఏం బావుంటుంది తర్కించిది ఆమెలోని నిరాశా వాది.

"కొందరు పుడ్తూనే చేతిలో దొంగ నోట్లతో పుడ్తారు. మరికొందరు పుడ్తూనే వ్యభిచారిణిగా పుట్ట లేదే! మంచీ మర్యాదా పరువూ, ప్రతిష్టా ఉన్న కుటుంబంలోనే పుట్టానే-సెలాఖరి రోజులలో పేదవాడి యిల్లు గాలించితే మచ్చుకైనా ఒక్క

బియ్యపు గింజ ఎలా దొరకదో అలాగే.... అటు పది తరాలు-ఇటు పది తరాలు త్రిప్పి చూచినా మా కుటుంబంలో చెడ్డ పేరనే మచ్చ దొరకదే!!

నాన్న, పెద్దయ్యగారి కారు డ్రైవరు. పెద్దయ్యగారు "పెద్దయ్యగారు" కాబట్టి పట్నంలో, గ్రామంలో, పెద్ద మొత్తం మీదే ఆయనకు ఆస్తి పాసులుండేవి. ఆయనకు ఓ కొడుకు. పేరు ఆఁ! జగన్మోహన్ అమ్మకు క్షయవ్యాధి. హాస్పిటల్ లో జీవితం. నన్నెలాగో పదో క్లాసు వరకు చదివించారు నాన్న తరువాత నేనే మానేసాను ఇంట్లో పని చూసుకునే వాళ్ళు లేక.

వెంకటరావు ఎక్కడనుంచి వచ్చాడో.. చిన్న దుకాణం తెరిచాడు-మా వీధిలో అందరితో కలుపుగోలుగా ఉండేవాడు. వెంకటరావు మంచివాడు. మా ఇద్దరికీ, పరిచయం యింది. అది ప్రేమగా మారింది.

ఇంతలో ఏక్సిడెంట్ అయి చనిపోయాడన్నారు ఒంటరిదాన్నైపోయాను. ఎన్నాళ్ళనుంచి కన్నేసి ఉన్నాడో-అదను చూచి జగన్మోహన్ బాబు నన్ను కాటేసాడు. నా శరీరం మలినమయిపోయింది నా శీలం పోయింది. వెంకట్రావ్ తో చెప్పి బావురుమన్నాను వెంకట్రావు నవ్వాడు. నన్ను దగ్గరకు తీసుకున్నాడు. జరిగిన దానితో ప్రమేయం లేకుండా నన్ను పెళ్ళాడతానన్నాడు పెళ్ళాడాక-పట్నానికి కాపురం మార్చేసాము. చిలకా గోరింకల్లా చిన్న గదిలో కాపురం. వెంకట్రావు ఏదో పనిచేస్తూండేవాడు. ఉదయం వెళ్ళి రాత్రికి వస్తూండేవాడు. ఏం పని చేస్తున్నాడో నే నడగలేదు. అసలు ఆ విషయం నేనెప్పుడు ఆలోచించలేదు.

ఓ రోజు....వెంకట్రావ్ ఎక్కడికో వెళ్ళి చాల సేపయింది. అంతలో తలుపు తట్టిన చప్పుడు. వెళ్ళి తలుపుతీశాను. ఎదురుగా ఓ పఠాణి మగాడు. చప్పున లోపలికొచ్చి తలుపులు మూసేశాడు. నేను వణికిపోయాను. బలవంతంగా నన్ను..నన్ను....

.. కొట్టాను... తిట్టాను. .చివరకు బతిమలాడాను వెంకట్రావు.... నా మొగుడు, వస్తే నిన్ను నరికిపోగులు పెడ్తాడన్నాను.

"ఆడు' ఆఁ! నీ మొగుడటే? ఆడి కెన్నో పెళ్ళానివి? బో....బో... బోకరోడికి ఊరికిద్దరు పెళ్ళాలు. వాళ్ళందర్నీ పట్నం తెచ్చి యాపారం చేస్తాడే ఆ వెంకట్రావుగాడు. నీతో 'సుకం' కోసం....ఆడికి అరవై రూపాయలు, అరకోడి....అరకాయ దక్షిణ యిచ్చాను ఆడు... ఆడు యిప్పుడు మస్తుగా తాగి....ఎక్కడో తందనా లాడుతుంటాడు."

"ఆతని నోటినుండి భరించరాని సారా కంపు.

సారా తాగిన పులిలా వాడు... పులికి చిక్కిన లేడిలా నేను వాడి కబంధ హస్తాల్లో .... నలిగిపోయాను

అలా .... నేను

జగన్మోహన్ చేతిలో—

వెంకట్రావ్ చేతిలో....

సారా కంపు గాడి చేతుల్లో ....

లెక్కలేనన్ని చేతుల్లో... నలిగి, నలిగి కులటగా మారిపోయాను." పరిమళ గతాన్ని నెమరువేసుకుంటోంది.

ఆమె... వాళ్ళు చేసిన క్షుద్ర యజ్ఞానికి ... ఓ సమిధ.

ఆమె .... వాళ్ళు పన్నిన దుర్మార్గపు వ్యూహానికి ఒక పావు.

పావు .... సమిధ....పరిమళ... పతిత.... ఆమె మనసు ఘోరుగా ఆలోచిస్తోంది. నీకు విముక్తి లేదా? నువ్వు తప్పించుకు పారిపోలేవా? లేదు....లేదు...అసాధ్యం.

ఆమె కళ్ళముందు తనలాంటి పతితలు

## అద్దం

నిర్మొహమాటంగా
ఉన్నది ఉన్నట్టుగా
చూపడమే నా నైజం
అది చూసి
భరించలేక
పిచ్చెక్కి
ఎవరైనా నన్ను పగులగొడ్తే
ప్రతి ముక్కలోను
క్రీస్తులా జీవిస్తా
నిప్పులాంటి నా శీలంపై
బురద నీళ్లు జల్లే
ఘరానా పెద్ద మనుషుల ఎదల్లో
వజ్రాన్నై ప్రేలాడుతా
కలకత్తా కాళినై
భూనభోంతరాలు
ఏకమయ్యేటట్టు
నాట్యమాడుతా

సి. ఎమ్. మోహన్‌రావు

మెదిలారు....

పార్వతి....కనకం .... సుబ్బలక్ష్మి .... వసంత....

అందరివీ దగాపడ్డ జీవితాలే.

జరిగిపోయినవి జరిగిపోయాయి. భవిష్యత్తును గురించి ఆలోచించు....ఆలోచించు

కాలం కరిగిపోతుంది.....

దూరం చెరిగి పోతుంది.

మేలుకో నేస్తం... మేలుకో....ఎక్కడో చదివిన మాటలు పరిమళ మదిలో మార్మోగుతున్నాయి. "ఏమిటి మేలుకోవడం? ఎవర్ని వేడుకోవటం? ఎక్కడికి చేరుకోవడం? ఏమిటి చెయ్యటం? ఎలా బ్రతకటం?

ఛీ! ఛీ! ఏమిటో యీ బ్రతుకులు ఎక్కడికో దూరంగా పారిపోయి బ్రతుకుదామంటే....నీడలా వెంటపడి పరిహసించే ప్రపంచం .... బ్రతకనివ్వని పోలీసులు .... బ్రతకనివ్వని పాత ప్రియులు....బ్రతకనివ్వని కొత్త చూపులు....

ఎక్కడైనా మర్యాదగా బ్రతుకుదామంటే కనిపించరే ఆదరించే నాథులు... కనికరించే ప్రభువులు....

ఈ వ్యవస్థ మారాలి. వ్యభిచారం నశించాలి!

వ్యభిచార గృహాలను ఎత్తివేయాలి. వ్యభిచారులను జైల్లో పెట్టి చెయ్యి దులుపుకునే చట్టం మారాలి! న్యాయం మారాలి. వెంకట్రావ్‌లూ .... జగన్ మోహన్‌లూ ... బ్రోతల్ హౌస్‌లూ .... లాడ్జింగ్‌లూ .... రైడింగ్‌లూ వగైరాలు పోవాలి, గాలిలో ఎగిరిపోవాలి. ధూళిలో కలిసి పోవాలి .... మంటల్లో మాడి మసై పోవాలి.

ప్రియంవద ఎలుగెత్తి అరచింది. .... వ్యవస్థ మారాలని. మారింది. రాజులూ రాజ్యాలూ .... రాజవర్తకులు .... ప్రియంవదలు చరిత్ర పుటలలో చెరగని మరకల్లా శాశ్వతంగా మిగిలిపోయారు.

పంకజం పుట్టింది.

పంకజం ఎలుగెత్తింది .... వ్యవస్థ మారాలని .... మారింది. పూజారులనూ దేవదాసీలను .... కాలం దూరంగా విసిరి వేసింది.

పరిమళ పుట్టింది.

పరిమళ ఎలుగెత్తింది....వ్యవస్థ మారాలని ... మారొచ్చు ... మారకపోవచ్చు ఈ సమాజం .... ఈ వ్యభిచార గృహాలు ఈ వ్యవస్థ .... ఈ వికృత నీడలు ... ఈ అసహాయులైన వేశ్యలు ... ఈ చేదు నిజాలు....






# అర్నాద్ కథలు

ప్రచురణ :
కాళీపట్నం రామారావు
రామ్‌నగర్, విశాఖపట్నం-530021
1/8 క్రౌన్ - పేజీలు 118.
వెల రు. 10-00

మొత్తం పన్నెండు కథలున్న సంపుటి యిది. 1972 జ్యోతిలోని అన్యాయం నుంచి 1981 ఆంధ్రజ్యోతి కథల పోటీలో బహుమతి పొందిన "రిక్షా ప్రయాణం" వరకు ఉన్నాయి. ఏళ్ళు గడుస్తున్న కొద్దీ రచయిత ఎదగాలి. కథనీ, అది ప్రచురించబడిన సంవత్సరాన్ని పరికించి యీ సంపుటిలోని కథల్ని చూస్తే అర్నాద్ రచయితగా ఎదిగారన్నది స్పష్టంగా కనిపిస్తుంది. తొలి రోజుల్లోని విషాదం, కుసుమహృదయంలాంటి కథలలో కనిపించే వైయక్తిక ప్రాముఖ్యం, ఆ తర్వాత కథలైన రైలు, ఇచ్చట సైపు చేయబడును, హక్కు లాంటి కథలైన సాంఘిక పరమైన ఉమ్మడి సమస్యల స్థాయికి ఎదిగింది.

ముఖ్యంగా యీ కథలలోని సంఘటనలు, వాతావరణం మెజారిటీ జనానికి పరిచయమున్నది. అందువల్ల మన చుట్టూ ఉన్న జీవితాన్ని గూర్చిన మరంత సమాచారం అందచెయ్యటానికి బాగా ఉపకరించాయి.

జనంలోని మూఢనమ్మకాల గోడ్రె దాటు మనస్తత్వాన్ని చూపించే "గోడ్రెలు" గ్రామీణ వాతావరణం ఆధారంగా సాగిన "హక్కు" నగరం నాగరికతలో కలిసిపోతున్న పసి పనివాళ్ళ జీవితాన్ని చూపించిన "గాటి" పోలీసు అధికార స్థాయిని చిత్రించిన - "ఇచ్చట సైపు చేయబడును"—యిలా యీ సంపుటిలోని కథల్లో వైవిధ్యం వుంది. యీ సంపుటిలో గాటీ, ఇచ్చట సైపు చేయబడును, రిక్షా ప్రయాణం, హక్కు, గోడ్రెలు, రైలు, దేవుడు దయామయుడు సంతృప్తినిచ్చే కథలు. అన్ని రకాలుగా 'పాతయుగాలు' యీ సంపుటిలో యిమడని కథ.

ఒక రచయిత కథల్ని సంపుటిగా చదివినప్పుడు అతని యీ కథల్లో యీ గుణాలు కూడా వుంటే బావుణ్ణనిపిస్తుంది. ఈ సంపుటికి సంబంధించినంత వరకూ అలా అనిపించిన కొన్ని విషయాలు....

విషాదం, కుసుమ హృదయం, పాత యుగాలు, దేవుడు దయామయుడు కథలు




కొద్దిగానైనా నిడివి తగ్గితే బావుండునని పించాయి.

చాలా గ్రామాల్లో కరణాలకి వుండేది అధికార బలం; గ్రామాలలోని ఎక్కువ మంది జనానికి తెలియని, అందుబాట్లో లేని యంత్రాంగపు చట్టాలు, వాటి లొసుగుల బలం, వాటి ఆధారంగా కరణాలు చాలా వరకు తెరచాటునే వుండి లౌక్యంగా వ్యవహారం నడిపిస్తారు. సాధారణంగా పది మంది ముందూ బలప్రయోగానికి దిగరు. అలాగే హక్కు కథలోని కరణం తాలూకు తెరమరుగు రాజకీయ విధానం చిత్రించి వుంటే బావుణ్ణుననిపించింది.

గొర్రెలు కథలో సీతమ్మ గురించి రాస్తూ (పేజీ 10, 11) ఆమె పిచ్చిదో జడ్డిదో అయ్యుండాలి. ఆమె తల్లి ఆమెని దాచి వుండాలి. అంటూ సందిగ్ధంగా చెప్పటం కన్నా నిర్దుష్టంగా చెబితే కథకి మరింత బలం వచ్చి వుండేది అనిపించేది.

ఇక పోతే 'రిక్షాప్రయాణం' గురించి....

పరిస్థితి, వాతావరణం, పాత్రలు, సహజ గుణానుగుణమైన వాటి ప్రవర్తన నిండుగా వున్న కథ. చాలా చోట్ల చాలా రకాలుగా డబ్బు జీవితాన్ని బంధిస్తోంది.. నిర్దేశిస్తోంది. మానవత్వపు సహజ గుణాన్ని అదిమి పెడుతోంది. ఆ బంధనాల్నుంచి మనిషిని కాస్సేపైనా కొన్ని సంఘటనల్లోనైనా వెలికి తీసుకొచ్చే శక్తి యింకా జీవితంలో వుందని, తోటివాడి పట్ల ఆర్ద్రతలో వున్న తృప్తి చాలావాటి కన్నా గొప్పదని తెలియచెప్పిన కథయిది. సమాజంలో వర్గాలున్నాయి, వర్గ స్వభావం వుంది. అలా అని ప్రతి వ్యక్తి వర్గస్వభావానుగుణంగానే అస్తమానం ప్రవర్తించటం జరగదు. మానవ సహజమైన అనురాగ, ఆవేశకావేశాలకి అనుగుణంగా ప్రయోజకపు పరిధిని దాటి ప్రవర్తించే క్షణాలు కూడా వుంటాయి. జీవిత సంఘర్షణని, సామరస్యాన్ని కలగలపి చూపించిన కథ 'రిక్షాప్రయాణం'.

ప్రగతి వేపు నడుస్తున్న కథా రచయితగా అర్నాద్‌ని తెలుసుకోటానికి వుపయోగపడే సంపుటి యిది.

—వి. రాజారామమోహనరావు

మనసులో చోటుచేసుకున్న కొన్ని రూపాలను మరిచిపోలేం! కొన్ని సంఘటనల ప్రభావం అలా ఉంటూనే ఉంటుంది!

జీవితంలో మనం చూసిన వ్యక్తులు, వారితో గడపిన క్షణాలు, వారు విడిపోయేక మనసులోంచి పోతున్నాయను కోడం మనసు చేసే మోళీ! వారెక్కడికీ పోరు—మనతోనే ఉంటారు. ఈ మనసు ఎన్నో రూపాలలో వెళ్ళినవారి గురించి ఊహించుకుంటూనే ఉంటుంది.

మనం ఇష్టపడ్డ వ్యక్తులని, మన మనసు గదులలో దాచేసి గడియ పెట్టేస్తాం! తీరిక సమయంలో వారిని గదుల లోంచి బయటకు తీసి వారితో సంభాషణలు జరుపుతాం. వారిని ప్రేమిస్తాం, ద్వేషిస్తాం, కినోరిస్తాం, లేదా కాముక చర్యలు జరుపుతాం. ఆ వ్యక్తులు శారీరకంగా పోయినా, వారి రూపం మనసులో ఉండి, వారి కాలగమనాన్ని ఆపుతుంది. పదిహేనేళ్ళ క్రితం చూసిన అమ్మాయి ఇంకా అదే రూపంతో, వయసుతో, చేష్టలతో మనసులో ఉండిపోతుంది.

నేనప్పుడు ఇంటర్ చదువుతున్నాను. మేం అద్దెకుంటున్న ఇల్లు ఆరు వాటాలలో ఒక వాటా! చిన్న వరండా, కొట్టు, మధ్య గది, వంటిల్లు, పెరడు... వర్షాకాలంలో విషాద నాయకిలా ఆ ఇల్లు అదేపనిగా వర్షం కన్నీరు కార్చేది! మా ఇంటి ఎదురుగా రోడ్డు—సన్నగా, ఇరుకుగా....

ఆ రోడ్డుకి అవతలవేపున్న ఒక ఇంట్లో ఉండేదామె! ఆ ఇంటికి నేనూ, శివుడూ సాంబడూ, అమరలింగం వెళ్ళి కేరమ్స్ ఆడే వాళ్ళం. సాయంత్రం ఐదుకి వెళ్ళి, రాత్రి ఎనిమిది వరకూ ఆడేవాళ్ళం.

ఆమె పేరు చంద్రిక. తల్లితో కలిసి ఉండేది. చంద్రిక వయస్సు పదహారూ, ఇరవై మధ్య ఎంతయినా అయి ఉండొచ్చు. ఆమె తల్లి వయసు నలభై కీ యాభై కీ మధ్యన ఉండేది.

మేం వెళ్ళగానే, "రండి!, రండి!" అని ఆహ్వానించేది ముసలావిడ ప్రేమగా.... ఆటలో పడేవాళ్ళం.

చంద్రిక చిరునవ్వుతో మమ్మల్ని పలకరించేది కాని మాతో మాట్లాడేదికాదు.

సాయంత్రం ఐదుకి మేం వెళ్ళేసరికి చంద్రిక అందంగా అలంకరించుకొని వీధిలోకి వెళ్ళేది.

చంద్రిక వేషం చిత్రంగా ఉండేది. కొబ్బరినూనె బాగా పట్టించి పక్కపాపిడిగా దువ్విన జుత్తు, జిగజిగా మెరుస్తూ ఉండేది, సాపుగా నల్లగా ఉండేది. ఆ జుత్తుకి పాపిడి పిన్నులు రెండు - సీతాకోక చిలక ఆకారంలో, మధ్యని పొళ్ళతో, ఎరుపు, నీలం, ఆకుపచ్చ రంగులతో, జుత్తుని ఒక కుచ్చులా క్రిందకి వదలి రంగు రంగుల రిబ్బనులు కట్టేది.

ఆమెకి గులాబి రంగు ఎక్కువ ఇష్టం. గులాబీ రంగు చీరలు కట్టేది. ఆ రంగు రిబ్బన్లు జడకి ముడివేసేది. అటువంటి గాజులు వేసుకొనేది.

ముఖానికి స్నో పట్టించి, దానిమీద చెమ్కీల పౌడరు అద్దుకొనేది. దీపం కాంతిలో ముఖం జిగజిగా మెరిసేది. నుదుట చీర రంగుకి మేచింగా బొట్టు పెట్టుకొనేది. చీరలు ఆనాడువచ్చే వలచటి నకిలీ సిల్కువి, పెద్ద పెద్ద పువ్వులు.. రుమాలు మొలదగ్గర దోపుకొనేది.

చంద్రిక పెదవులు ఎప్పుడూ ఎర్రగా ఉండేవి. కాసు రాసిన మిఠాకిళ్ళీ ఎప్పుడూ నములుతూ ఉండేది.

చంద్రిక నా కళ్ళ కెపుడూ గుండ్రగా బంతిలా కనిపించేది. ముఖం గుండ్రం, ఒళ్ళు గుండ్రం.

"నే వెళ్తున్నానే అమ్మా!" అని కేక వేసి, వయ్యారంగా ఒళ్లు తిప్పుకుంటూ నడచుకు వెళ్ళిపోయేది. ఎక్కడికి వెళ్ళేదో తెలిసేది కాదు మాకు. ఏ అర్ధ రాత్రికో తిరిగి వచ్చేది.

ఆమె గురించి గుసగుసలు వినిపించినా పట్టించుకొనే వాళ్ళంకాము. మగాళ్ళెవరూ



ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ



ముఖ్యమంత్రి శ్రీ టి అంజయ

# పంచాయతీరాజ్ సంస్థలు-గ్రామస్వరాజ్యం

పల్లె ప్రజల భాగో, న్నతికి పంచాయతీ రాజ్య సంస్థలు వివిధ కార్యక్రమాల ద్వారా, బాపూజీ, టాగూరు, నెహ్రూ, ప్రకాశం వంటి నాయకులు కలలుగన్న గ్రామరాజ్య స్థాపనకై అంకితమై కృషి చేస్తున్నాయి

## పంచాయతీ రాజ్ ఆధ్వర్యంలో అభ్యుదయ పథకాలు :

### జాతీయ గ్రామీణ ఉపాధి కార్యక్రమం

ఈ కార్యక్రమం క్రింద 1980-81 వరకు స్కూలు బిల్డింగులు, బలహీన వర్గాల ఇళ్ళు, రోడ్లు మరియు చిన్నతరహా నీటిపారుదలకు రు ·0-55 కోట్లు వెచ్చించడమైనది 6వ పంచవర్ష ప్రణాళిక కాలంలో 200 కోట్లు ఈ కార్యక్రమం క్రింద ఖర్చు చేయడానికి గ్రామీణ ఉపాధి కల్పనకు నిర్దేశించడమైనది

### గ్రామాలకు మంచినీటి సరఫరా

గ్రామాలలో మంచినీటి సరఫరా సౌకర్యాలు కల్పించడానికి గత ప్రణాళికలలో రు 68 కోట్లను ప్రభుత్వం ఖర్చు చేసింది 1980-81 లో తీవ్రమైన కరువు పరిస్థితులు నెలకొన్న 14 జిల్లాలలో 17 717 బోరింగ్ బావులను త్రవ్వడానికి రు 12 2 కోట్లు ఖర్చు చేసారు 1981-82 సంవత్సరంలో బోరింగ్ బావుల కార్యక్రమం నిమిత్తం రు 8 కోట్లు, చిన్నపాటి, భారీ పి డబ్ల్యు డి పథకాల నిమిత్తం మరో 10 కోట్లు ఖర్చు చేయాలని ప్రతిపాదించారు

6 జిల్లాలలో నాగార్జున సాగర్ ద్వారా మంచినీటి సౌకర్యం కల్పించడానికి వీలుగా రు 11.55 కోట్ల ఖర్చుతో కూడిన కార్యక్రమాన్ని మంజూరు చేసారు 1982 మార్చి ఆఖరునాటికి ఈ పథకం ఒమ్మా పూర్తవుతుంది తద్వారా 171 ఫ్లోరైడ్ బాధిత గ్రామాలకు మంచినీరు సరఫరా చేస్తారు

## గ్రామీణ వైద్య సహాయం

రాష్ట్రమంతటా 420 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 156 ఆయుర్వేద చికిత్సాలయాలు, 5 హోమియోపతి చికిత్సాలయాలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

## మధ్యాహ్న భోజన కార్యక్రమం

రాష్ట్రంలో సేవాసంస్థల సహాయంతో అధిక సంఖ్యలో పాఠశాల బాల బాలికలకు ఈ పథకం వర్తింపచేయాలని ప్రతిపాదించారు.

## గ్రామాభ్యుదయానికి నూతన వనరులు

అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించేందుకు వీలుగా 12 కోట్ల రూపాయలు ఇప్పటికే ప్రభుత్వ గ్రామ పంచాయతీలకు కేటాయించింది

## పంచాయతీరాజ్య సంస్థల ఎన్నికలు

యావద్భారతావనిలోనే తొలిసారిగా పంచాయతీ రాజ్య సంస్థలలో రిజర్వేషన్లు పదవులకు ప్రజలనుంచి నేరుగా ఎన్నుకునే పద్ధతిని సాధారణ ఎన్నిక మాదిరిగా ఎన్నికలు జరిపించడం జరిగింది. షెడ్యూలు కులాల వారికి, షెడ్యూలు తెగల వారికి, మహిళలకు రిజర్వేషన్లు 41.45% మేరకు సర్పంచ్ పదవులకు, సమితి స్థాయిలలో షెడ్యూల్డు కులాలకు 4, మరియు షెడ్యూల్డు తెగలకు, 3, జిల్లా పరిషత్ అధ్యక్ష పదవులకు 3, షెడ్యూలు కులాలకు, 1 షెడ్యూలు తెగకు కేటాయించడమైనది.

వయో పరిమితిని 21 సంవత్సరాల నుంచి 18 సంవత్సరాలకు తగ్గించుట ద్వారా 40 నుండి 45 లక్షల యువతీ యువకులకు అదనంగా ఓటుహక్కును వినియోగించుకొనే అవకాశం కల్పించబడింది.

ఏకగ్రీవ ఎన్నికలు బహుమతి పథకాన్ని ప్రవేశ పెట్టిన ఫలితంగా 6360 గ్రామ పంచాయతీలు, 12 సమితులు, ఏకగ్రీవంగా అధ్యక్షులను ఎన్నుకొన్నాయి. దీనివల్ల బహుమతులకు ప్రభుత్వం 8 కోట్ల 25 లక్షల రూపాయలను ఖర్చు చేస్తున్నది.

ప్రశాంతంగా, క్రమశిక్షణతో నడుపబడిన ఈ ఎన్నికలు ఎంతో హర్షింపదగినవి.

## పాలన వ్యవస్థ

పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల అధీనలోకి అనేక అభివృద్ధి శాఖలను తేవడంద్వారా కొత్తగా ఎన్నికైన ఈ సంస్థల కార్యపరిధిని విస్తరింపజేస్తారు. ప్రధాన మంత్రి 20 సూత్రాల కార్యక్రమం, కీ. శే. శ్రీ సంజయ్ గాంధీ 5 సూత్రాల కార్యక్రమాలను పటిష్టంగా అమలు జరపడానికి వీలుగా జిల్లా స్థాయిలో ఈ శాఖలకు ఈ సంస్థల సలహాలు, ఆదేశాలు లభిస్తాయి.

బలహీన వర్గాల ప్రజల అభ్యున్నతికై సాంఘిక సంక్షేమ పథకాలను అమలు చేయడంలో పంచాయతీ రాజ్య సంస్థలు సహకరిస్తున్న ప్రజా సంక్షేమమే పంచాయతీ రాజ్య సంస్థల పవిత్ర లక్ష్యం. ఆ లక్ష్య సాధనకు ప్రభుత్వం తన సంపూర్ణ సహకారాన్ని అందిస్తున్నది. పంచాయతీరాజ్య సంస్థలు, ప్రభుత్వం పూర్ణ స్వరాజ్య స్థాపనకై నిరంతరంగా కృషి చేస్తున్నాయి. ప్రజల సహకారం వీటికి కొండంత బలం.

సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము
నెం. 39

ఆఇంటికి ఆమె కోసం రావడం మేం చూడ లేదు. అందువల్ల మా సంసారాల మర్యాదకీ, వీధి సభ్యతకీ భంగం వచ్చేది కాదు. జరిగేదేదో ఎక్కడో జరుగుతోంది........ ఆక్కడ లేదు కదా? అన్న ఉష్ట్రపక్షి మన స్తత్వం మా సంసారాలది!

చంద్రికలో నాకు ఏ మార్పు కనిపించేది కాదు. చెక్కు చెదర కుండా ఉండేది

ఆ వీధిలో, వీధిలోని ఇళ్ళలో కాపురం ఉంటున్న మనుష్యులలోని భాగంగా ఉండేది. చంద్రికతో మాటాడాలని ఉండేది. కాని జంకు! తక్కువ తనం అనుభవించే వారని కాని, ఎందువల్లో కాని చంద్రికని చూస్తే నాలో ఏ సంచలనమూ రేగేది కాదు. ఆమె నాకు పెద్దక్కలా అగుపడేది. ఆమె మగాళ్ళని ఆకర్షించ గలుగుతోందని విన్నప్పుడు ఆశ్చర్యం వేసేది! ఈమెలో ఏముంది అనిపించేది.

ఆ రోజుల్లో మిలటరి ప్లాటూ నొకటి వచ్చి ఊరవతల మకాం వేసేరు మా ఊళ్లో. రోజుల తరబడి చంద్రిక కనిపించేది కాదు. ఆమె గురించి ఎన్నో పుకార్లు పుట్టేయి. సిపాయిల నందరినీ గుత్తకి తీసుకుందనే వారు. రెండు చేతులా డబ్బు ఆర్జిస్తోందన్నారు.

చంద్రిక, శశి అన్న మరో అమ్మాయితో కలిసి తిరిగేది. శశి సన్నగా పొడగ్గా ఉండేది కోలముఖం, సోగ కన్నులు, చిన్న నోరు, నాజూకుగా నడిచేది. ఎప్పుడూ కలల ప్రపంచంలో ఉన్నట్టుండేది.

అప్పుడప్పుడు శశి వచ్చేది, చంద్రికని పిలవడానికి. ఇద్దరూ నవ్వుతూ ఏవేవో మాట్లాడు కొనేవారు.

మాకు శలవరోజులపుడు కేరమ్సు ఆడుకుందుకి ఉదయమే ఆ ఇంటికి చేరేవాళ్ళం. పన్నెండు వరకూ ఆడి, భోజనంచేసి మళ్లా కూర్చునే వాళ్ళం. చంద్రిక, శశి అప్పుడప్పుడు తామూ ఆడ్డానికి కూర్చొనేవారు. అప్పుడు నన్ను లేచిపొమ్మనేవారు, నేనంత మంచి ఆటగాడ్ని కాను కాబట్టి! ఆటమీద శ్రద్ధ చూపేవారు కాదు చంద్రిక, శశి— ఓడినా గెలిచినా ఒకటే అన్నట్టు ఆడేవారు. మధ్య మధ్య అందరితో పరాచికా లాడేవారు. కాని నేను దూరంగా ఉన్నట్టే ఉండేవాణ్ణి వాళ్ళతో–ప్రత్యేకంగా మాట లాడేందుకు మాటలుండేవి కావు.

నేను బి.ఏలో చేరేక క్యారమ్సు ఆటలో ఆసక్తి పోయింది. ఇల్లుకూడా మారేం. అందువల్ల చంద్రికనీ, శశినీ చూడటం ఎప్పుడో జరిగేది.

వారిద్దరి గురించి అందరూ చెడ్డగా అనుకోటం వినేవాడ్ని. ఎప్పుడన్నా వాళ్ళు అగుపడ్డప్పుడు వాళ్ళని నిలవేసి, "మీగురించి అందరూ అనుకుంటున్నది నిజమేనా?" అని అడగాలనిపించేది. "నిజంకాదు! పచ్చి అబద్ధం!" అని వారంటారని నా నమ్మకం! అలా వారనేసేక నా మనసు తేలిక పడును కాని అడగలేక పోయేవాడిని-చంద్రికని చూడడం పడ్డప్పుడు ఆమెలో ఏ మార్పు అగుపడేది కాదు! శరీరం ఎప్పటిలానే ఆరోగ్యంగా అగుపడేది.

ఐతే ఈ మిస్టరీ అట్టేకాలం నిలవలేదు.

నా వయసూ పెరిగింది - మనసూ పెరిగింది - మానవ స్వభావం అర్థమవుతూ వచ్చింది. నేను నా మిత్ర బృందంలో తిరిగే వేళల్లో చంద్రికా, శశి వీధిలో ఎదురు పడేవారు. నన్ను గుర్తుపట్టేవారు కారు- గుర్తు పట్టినా తెలీనట్టే ఊరుకొనే వారు. నా మిత్రులేవో మాటలనేవారు వారి గురించి తక్కువగా, హేళనగా! నాకెంతో కష్టమనిపించినా, వారి తరఫున వకాల్తా పుచ్చుకుందుకి ధైర్యం లేక ఊరుకొనే వాడిని!

చంద్రిక, శశి, కాస్త చీకటి పడుతున్న వేళకి వారి ఇళ్ళనించి బయల్దేరేవారు. మెల్లిగా నడుచుకుంటూ, సందులూ గొందులూదాటి మెయిన్‌రోడ్డు ఎక్కేవారు. మనుష్యులని గమనిస్తూ నడిచేవారు. సినిమాహాల్సు దగ్గర తచ్చాడేవారు. తమ అవసరమున్న మనుష్యులు లేక పోతే




బెంచీ టిక్కెట్టు కొనుక్కొని సినిమాకి పోయేవారు.

నేనూ నా స్నేహితులూ మొత్తం ఐదు మందిమి రాత్రి భోజనాలయ్యేక చక్కర్లు కొట్టేవాళ్ళం. అప్పటికి నేను బి.ఏ పాసయి ఒక చిన్న ఉద్యోగం సంపాదించడం జరిగింది. నా మిత్రబృందం మారిపోయింది. అందరూ నా కన్న పెద్ద సంసార సాగరంలో తేలుతున్న వాళ్ళు.

మేం ప్రపంచంలో ఎన్నో సంగతుల గురించి చర్చించేవాళ్ళం. సినిమాలగురించీ, సాహిత్యం గురించీ, రాజకీయాలగురించీ, మా ధోరణులు చిత్రంగా ఉండేవి - మా భావి గురించి ఎన్నో కలలు కనేవాళ్ళం.

మా అడ్రసు కేరాఫ్ మెయిన్‌రోడ్. అలా నడుస్తూ వెళ్ళి వెళ్ళి సినిమాహాలు పక్కనున్న నాయర్ హోటల్ చేరుకునే సరికి రాత్రి తొమ్మిదయ్యేది. అక్కడ రాత్రి పదకొండు వరకూ గడిపే వాళ్ళం.

నాయర్ హోటలు 'పక్కా'ది కాదు. సినిమాహాలు ముందటి గోడమీంచి గడ్డి చూరు దించి, అక్కడ పారే మురికి కాలవ మీద బల్ల చెక్కలువేసి, నాలుగు అడుగుల వెడల్పు, ఇరవై అడుగుల పొడవూ కలది. కర్ర బెంచీలు, ఊగే కర్ర టేబిళ్ళు.

నాయర్ అప్పటి కప్పుడు ఇడ్లీలు చేసి ఇచ్చేడు. అవి తిని టీ తాగడానికి ఒక గంట పట్టేది. హోటల్‌కు చేరుకున్న అరగంట వరకూ మేం ఏమీ ఆర్డర్ ఇచ్చేవాళ్ళం కాము నాయర్ అడిగేవాడు కాదు! మా కబుర్లలో పడి కాలాన్నే మరచి పోయే వాళ్ళం. ఆర్డర్ ఇచ్చేక అరగంటకి కాని మాకు కావల్సినవి దొరికేవి కావు.

పది గంటలకల్లా మొదటి ఆట సినిమా వదిలేసేవారు. సినిమాహాలు మీద నున్న లౌడ్ స్పీకర్ లోంచి పాటలు ప్రారంభమయ్యేవి సినిమా వదిలినందుకు సూచనగా.

అప్పుడు చంద్రం, శశి మొదటి ఆట సినిమా నించి బయటపడేవారు. హోటల్ ముందు ఆగేవారు. విద్యుద్దీపం కాంతిలో ప్రాముఖ్యంగా కనిపిద్దామని, వెలుగులో నిలబడేవారు బతుకులు చీకటివైనా

సాయంత్రం ముఖానికి రాసుకున్న పౌడరు హోటలులో గడిచిన మూడుగంటల కాలంలో పట్టిన చెమటకి చెరిగిపోయేవి. ముఖాలు అలుక్కుపోయిన పాత ఫోటోల్లా ఉండేది.

వాళ్ళని చూడగానే నాయర్ అడిగే వాడు తెలుగులో... "ఏం శశీ! చంద్రీ! టీ ఏనా? ఏమన్నా తింటారా?"

"టీనే! మరేమీవద్దు!" అనేది చంద్రిక.

చంద్రిక నన్ను పోలిక పట్టడం ఏనాడో మానేసింది! నేను వయసులోనే కాక, చదువులోనూ పెద్దవాడినయి, ఉద్యోగస్థుడి నయ్యాక 'బాబు'ల స్థాయికి చేరుకున్న వాడి నయ్యాననీ, నన్ను పోలిక పట్టడం అమర్యాదనీ, నా పెద్దమనిషి తనానికి భంగం కలిగిస్తుందనీ చంద్రికకి తెలుసు. అలనాడు వాళ్ళ ఇంట కేరమ్స్ ఆడేట ప్పుడు ఆమె మాటకోసం, చూపుకోసం, దర్శనంకోసం మనసు ఎంత ఉవ్విళ్ళూ రేదో, ఆమెతో ఎంత కలుపు గోలుగా మాట్లాడాలని కోరుకొనే వాడినో, ఆ సంగతి నేను ఏనాడో మరచిపోయేను! చంద్రిక ఎదురైతే అందరిముందు ఎక్కడ పలకరించేస్తుందో నన్న భయంతో ముఖం తిప్పుకునేవాడిని ఆదిలో. కాని ఆ అవసరం లేక పోయింది. నన్ను చూడనట్టే ప్రవర్తిం చేది!

నాయర్ హోటల్లో వారి గ్లాసులు వేరేగా ఉండేవి. వాళ్ళకి మాకిచ్చే గ్లాసు లలో టీ ఇచ్చేవాడు కాదు.... వాళ్ళకి ఏవన్నా రోగాలుంటే అవి గ్లాసులకి అంటు కుంటాయని నాయరు భయం! ఎందరో వందలమంది రోజూ తాగే గ్లాసులలో మాకు టీ ఇస్తాడు ఈ వందలమందికీ రోగాలు ఉండవా? పాపం! చంద్రికా, శశీ వంటి ఆడవాళ్లుతాగే గ్లాసులకే రోగాలు అంటుకుంటాయా?

నాయర్ అందించిన టీని చంద్రికా, శశీ తాపీగా తాగేవాళ్ళు. వాళ్ళని అప్పుడు పరిశీలనగా చూసేవాడిని. వారిలో నాకేమీ ఆకర్షణ అగుపడేవి కాదు.

మగాళ్ళని ఆకర్షిద్దామని వాళ్ళు చేసే ప్రయత్నం గమనించి జాలివేసేది.

టీ తాగుతున్నారే కాని, వాళ్లు అంద రినీ గమనించేవారు.

ఆ సమయానికి ఆ ఇద్దరూ నాయర్ టీ దుకాణం ముందుంటారని అందరికీ తెలుసు! లారీ డ్రయివర్లు, బస్సు డ్రయి వర్లు, క్లీనర్లు వారివెంట పడేవాళ్ళు! సినిమాహాలు చుట్టుపక్కల ఉన్న సందుల్లో రాత్రికి లారీలని ఉంచేవారు, తిండి తిని నాటు సారాతాగి ఆడదానికోసం వేటలో పడే వారు.

కొందరయితే చంద్రినీ, శశినీ ముందు నించీ సినిమా టిక్కెట్‌తో సహా బుక్ చేసుకొనే వారు. వారికి సినిమాకీ, టీకి డబ్బులు ముందే ఇచ్చేవారు. కొందరు మొదటి ఆట సినిమా అవగానే వీరిని తీసుక పోతే, కొందరు రెండో ఆట సినిమా అయ్యాక పోయేవారు.

మా స్నేహితులలో మాష్టారు నాకన్న ఇరవై ఏళ్లు పెద్ద. ఆయన్ని ఓసారి అడిగేను

"మాష్టారూ! నా చిన్ననాటి నించీ చంద్రిని చూస్తూ వచ్చేను, అప్పుడెలా నాకు కనిపించేదో ఇపుడూ అలానే కనిపిస్తోంది. వీళ్ళకి ముసలి తనం లేదా?"

మాష్టారు లంక పొగాకు చుట్ట ముట్టించి చిరునవ్వునవ్వి, జవాబిచ్చేవారు "వాళ్ళలో మీకు ఏ మార్పు ఎందుకు కనిపించటం లేదంటే వాళ్ళ నెపుడూ కొనే దృష్టితో మీరు చూడలేదు కనక! అమ్మనీ, చెల్లినీ, అక్కనీ మనం రోజూ ఇంట్లో చూస్తూ ఉంటాం. వాళ్ళలో ఏ మార్పూ మనకి కనిపించదుకదా? చిన్ననాడు మన కళ్ళకి ఎలా అగుపడేవాళ్లో ఇప్పుడూ అలాగే కనిపి స్తారు! అది మీ మనస్సుమీద ఆధారపడి ఉంది!"

నాకు ఆ ఊరినించి బదిలీ అయిపో యింది-మరో ఊరు వెళ్ళి పోయేను-పెళ్ళి చేసుకున్నాను—పిల్లల్ని కన్నాను-అందరూ పడ్డట్టే సంసార సాగరంలో పడ్డాను-ఎన్ని

రోజూ పూజ చేసేవాడు ఈరోజెందుకో చెయ్యలేదు: కొంపదీసి మతం మార్చుకోలేదు కదా నా భక్తుడు!!




కబుర్లు చెప్పినా ఎంత మహనీయుడైనా చేసేది అంతే-రోజూ తిండి తినడం, సంగమించటం, పిల్లల్ని కని పెంచడం, ముసలాడవటం, చావడం-రాజకీయాలు, సుఖాలు, కష్టాలు, ఇవన్నీ ఈ కార్యక్రమం కోసమే ఉన్నాయి-

ఐదేళ్లు గడిచి పోయేయి-

ఆ ఊరు ఆఫీస్ పనిమీద వెళ్ళడం పడింది. వెళ్ళేను కాని, మునుపటి సంతోషం లేదు ఆ ఊరుని చూడగానే-ఎందుకంటే ఏ ఊరన్నా సన్నిహితత్వం ఆ ఊరిలోని మిత్రులని ఒట్టి ఉంటుంది-నా స్నేహితులంతా చెట్టుకొకరూ, పుట్టకొకరూ వెళ్ళిపోయేరు-మాష్టారు కేన్సర్ వచ్చి చచ్చిపోయేరు-ఇంకెవరున్నారు కనక?

పాత స్థలాలూ, పాత జ్ఞాపకాలూ మాత్రం మనసులో పదిలంగా ఉండిపోతాయి! అందు వల్ల ఆ రాత్రి తొమ్మిది గంటలకి నాయర్ హోటల్కి టీ తాగే మిషలో వెళ్లేను, అక్కడ కూర్చొని నా మిత్రులతో గడపిన మధుర క్షణాలు గుర్తు చేసుకుందామని!

ఇడ్లీ చెప్పేను-అంత వరకూ టీ చప్పరిస్తూ కూర్చున్నాను-

మొదటి ఆట సినిమా వదిలేరు.

నా కళ్లు చంద్రిక కోసం వెతికేయి!

టీ తాగడానికి ఇద్దరు స్త్రీలు వచ్చేరు... కాని....వాళ్ళు చంద్రికా, శశికారు! కొత్త వాళ్ళు!

నాయర్ వాళ్ళని అడిగేడు......."టీ తాగుతారా? ఇడ్లీ కూడానా?"

ఇద్దరిలో సన్నటి మనిషి అంది...."టీ ఇయ్యి! చాలు'"

వారి గురించి వేరేగా ఉంచిన గ్లాసులలో టీ పోసి ఇచ్చేడు నాయరు.

నేను నాయర్ని అడిగేను, సిగ్గు విడిచి పెట్టి ..."ఏం నాయర్! ఇక్కడికి చంద్రిక

అన్న అమ్మాయి వచ్చేది ఇదివరకు! ఇప్పుడు రావటం లేదా?

నాయర్ నాకేసి ఆశ్చర్యంగా చూసేడు "అదెప్పటి సంగతి తమరు చెప్తున్నారు బాబూ? చంద్రి చచ్చిపోయింది! దాని ఒళ్లు పాడయింది. ఎవరూ చూసే దిక్కు-లేక, ఒక పూరిపాకలో ఊరవతల దిక్కు-మాలిన చావు చచ్చింది! చందాలు పోగు చేసి శవాన్ని కాల్చేం!"

నా మనస్సుకు అనకోని అఘాతం తగిలింది!

చంద్రిక చచ్చిపోయిందా? దిక్కు-మాలిన దానిగా చచ్చిపోయిందా!? రోగాలతో బాధపడి బాధపడి మరణించిందా?!

నా మనస్సుని అంతులేని విచారం ఆవహించింది! ఎవరో అతి దగ్గరి, సన్నిహిత బంధువు, ఆప్తురాలు మరణించినట్టు అనిపించింది. కళ్ళంట నీళ్ళు వచ్చేయి! ఎందుకింతగా అనుభూతి? చంద్రికకూ నాకూ ఉన్న బాంధవ్యమేమిటి? సంబంధమేమిటి?

ఆలోచిస్తే ఎన్నో కారణాలు కనిపిస్తాయి-.

చంద్రిక నాకు చిరపరిచితురాలైన వ్యక్తి! నా చిన్నతనంతో ముడిపడి ఉన్న రూపం! చిన్ననాటి రోజులంటే ఆ వ్యక్తులంటే ఎవరికి ప్రేమ ఉండదుకనక?

చంద్రిక ఎన్నో చిత్రమైన అనుభూతులను రేపేది నా ఎదలో? జాలి, విచారం, తోటి మానవుడిమీద ఓర్పు, పైవారి కష్టాలకి సానుభూతి, బతుకంటే సహనం, బాధలంటే ఓర్పు, శాంతం, ఇవన్నీ మనిషి కుండాలని చంద్రిక నాకు చెప్పకుండానే చెప్పింది! తన బతుకుతో ఒక ఉదాహరణ చూపింది!

డబ్బుకే అయినా, మగాడిలో ఆనందాన్ని కలిగించాలన్న ఆమె తపన, ఎందరో విభిన్న మనస్తత్వంగల పురుషులు రోజూ ఎదురయ్యే ఆమె జీవితంలో చీత్కారాలనీ, అవమానాలనీ, హింసనీ, మూర్ఖత్వాన్ని, కరుకుదనాన్నీ ఆ వ్యక్తులనుంచి స్వీకరిస్తూ, వారిపట్ల సహనం వహించి, వారికి సంతోషం కలిగించిచూడడం, మనసు రక్తం కారుస్తున్నా పైకి నవ్వుతూనే ఉండడం ఆమె ప్రత్యేకత!

నాకు జీవితంలో ఎన్నో సార్లు చిన్న చిన్న విషయాలకే ఆత్మహత్య చేసుకోవాలని బుద్ధి పుట్టేది-డబ్బు, హోదా, కీర్తి ఇవి లేని జీవితం వ్యర్థం అనిపించేది

అటువంటి క్షణాలలో చంద్రిక నా మనసులోని ఎన్నో గదులలోని ఒక గది లోంచి తలుపు తీసుకు వచ్చేది—నా ఎదురుగా చిరు నవ్వుతో నిలిచేది—ఆమె ఏ హోదా ఆశించింది? ఆమె రోజూ ఒళ్ళు వెలకి పెట్టి సంపాదించే ఐదూ పదీ రూకలతో ఏ మేడలు కట్టింది? ఏ కవులు వాటిని గానంచేసేరు? ఆమె ఎందువల్ల ఆత్మహత్య చేసుకు చచ్చిపోలేదు?

"తమ్ముడూ! బతుకు బతకడానికే ఉంది! బతుకు నూరేళ్లు!" అంటాయామె కళ్లు ఆప్యాయతతో నాకేసి చూస్తూ!

చంద్రిక ఎప్పుడూ నా మట్టుకి చచ్చిపోలేదు! ముసలి దవలేదు! ఆమె మట్టుకు నా మనసులో కాలం ఆగింది! 



కళా భారతి దశమ వార్షికోత్సవ సందర్భంలో శ్రీ ఎస్, వి, ప్రసాద్
శ్రీ ఎన్. టి ఆర్ శ్రీ దాసరి

ఇటీవల బోంబే డయింగ్ షోరూమ్ ప్రారంభిస్తున్న నటి జయచిత్ర





"చట్టానికి కళ్ళు లేవు"–విరంజీవి

Edited & Published by V Leelavathy Raghavaiah, at 1-8-4/1/1
Chikkadpalli, Hyderabad-20 & Printed by P. Ramakrishna at
Raghava Printers 1-8-4/1/4 Chikkadpalli Hyderabad-500 020



# 20 ఏళ్ల సాహితీ చరిత్ర

మా జ్యోతి '82 ఫిబ్రవరిలో 20వ సంవత్సరంలోకి అడుగు పెడుతోంది. ఉత్తమ సాహితీ ఆభరణాలు ధరించి కథావీధిలో నడుస్తున్నది జ్యోతి. 20వ యేడు సందర్భంగా మేము మీకు అందించే ప్రత్యేక కానుక ప్రత్యేక సంకలనం: జ్యోతి ఆరంభ సంచిక మొదలు ఇంతవరకూ ప్రచురింపబడ్డ మా జ్యోతి 'ఉత్తమ కథా గుచ్ఛాలని' పొందుపరుస్తున్నాము.

మీ ఉన్నత అభిరుచుల మేరకు మా ఉత్తమ సంకలనం: మంచి పేపరు, బైండులతో, సదా మీతో వుండేలా 12 రూ॥లకే నలభై కథల తేనెపట్టు। ఫిబ్రవరి మొదటి తారీఖుకే వెలువడే ఈ సంచిక కాపీకై త్వరపడండి.

ఏజెంట్లు, చందాదారులు, పాఠకులు తమ కాపీల కోసం డిసెంబరు 15వ తారీఖు లోపల ఆర్డరు పంప గోరుతాం.

సంస్థాపకులు
కీ॥.శే॥ వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సంపుటి 19 | డిశంబర్ 1981 | సంచిక 11

# ఇదీ వరస...


| | | |
|---|---|---|
| ఆరుద్ర బాతాఖానీ | 16 | ఆరుద్ర |
| డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు (సీరియల్) | 17 | యండమూరి వీరేంద్రనాథ్ |
| స్వీట్ సిక్స్టీన్ | 33 | "పాప" |
| బొద్దింకలు | 42 | వసుంధర |
| కాకులు (మిని) | 49 | పోలాప్రగడ జనార్ధనరావు |
| అన్నదానం | 51 | ప్రసన్న కుమార్ సర్రాజు |
| సిరి గోరింట | 5[illegible] | నాయని కృష్ణకుమారి |
| ఎముకలు | 64 | అల్లం రాజయ్య |
| సౌభాగ్యలత (సీరియల్) | 79 | కౌసల్యాదేవి రామశాస్త్రి |
| ఆపరేషన్ కిచెన్ | 90 | డి. జి. రామారావు |
| ముట్టడి | 9 | ఎమ్. పార్థసారధి |
| ఈ మాసం మీ కోసం | 102 | నగ్నముని |
| తరం తరం నిరంతరం | 107 | సి. హెచ్. జె. సత్యానంద కుమార్ |
| కొత్త పుస్తకంతో కొంత సేపు | 113 | వి. రాజారామ మోహన్ రావు |
| కాలం ఆగింది | 118 | మంథా వెంకట రమణరావు |

ఈనెల అనుబంధాలు...

## దారిలేని శారద (నవల)
ప్రతాప రవిశంకర్

## 'గదికి తాళం' (నాటిక)
'మ్యానస'


ముఖచిత్రం : సాయిచంద్; వెనుక : ప్రభ

జ్యోతి, పి. బి. నెం. 1824, హైదరాబాదు-20

కృష్ణంరాజు సమర్పించు

రాధాకృష్ణా మూవీస్

# గువ్వల జంట

కలర్

దర్శకత్వం: కె. వాసు

నిర్మాత: జి. సత్యనారాయణరాజు

అన్నపూర్ణ

# రాష్ట్ర రజతోత్సవాలు



# తొలిమాట

పండగవచ్చి నల్లధనం వారికీ, చిన్న పిల్లలకి సరదానిచ్చి మధ్యతరగతి వారికి చిరు దుఃఖాన్నిచ్చింది. వివిధ రాష్ట్రాలలో వివిధ నాయకులు బాహాటంగా సరదాగా కాలక్షేపం ప్రజల డబ్బుతో చేయడం— దాంతో ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితులు తారు మారవడం, సంక్షోభం కలగడం జరిగింది— ఇదంతా చూస్తూనే వున్నాం ... ఇప్పుడొచ్చాయి మన రాష్ట్రానికి రజతోత్సవపు పండగలు-నయాగరా జలపాతంలా రాష్ట్రం డబ్బుని ధార పట్టి అక్కడికి పండగల్లో లోపం లేకండానే జాగ్రత్తగా జరుపుతోంది.... ఎటొచ్చీ దుబారా చెయ్యకండా డబ్బు జాగ్రత్త చేసుకోడం విషయంలో ప్రజలు మాత్రం జాగ్రత్తగా వుంటే చాలు ... చాలు !

ప్రజల కమ్మటి నిద్రలో భవనాలేకాదు ఆర్థిక రాజకీయ, సామాజిక వ్యవస్థే బీటలు వారకుండా వుంటే చాలు.... చాలు -

కథల పోటీల వివరాలు లోపల పేజీలలో చూడండి - ....




జ్యోతి సంపాదకులకు,

జ్యోతి దీపావళి సంచికలో వాసిరెడ్డి సీతాదేవిగారి "గాలికథ" చదివాను. మామూలు రచయిత(్రు)లందరూ వీరేంద్రనాథ్‌ని చూసి ఈర్ష్యపడితే అర్థముంది గానీ ఒక సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత అదేస్థాయి రచయిత మీద వ్యక్తిగతంగా విరుచుకు పడటం బాగాలేదు. రచయితను తాగుబోతుగా రోడ్డు ప్రక్కన పడిపోయే వాడిగా చిత్రీకరించారు.

కొవ్వలి, జంపనల రచనలు కలకాలం చరిత్రలో నిలవ లేదన్నారు. గంజాయి వనం (తులసి దళం) అటువంటి కోవకు చెందిన దన్నారు. మరి అటువంటప్పుడు ఈమె కెందుకింత బాధ?

తెలుగు సాహిత్యాన్ని క్షుద్ర సాహిత్యపు పరిధి నుండి బయటకు తీసుకు రావడం కోసం ఈమె మరొక మట్టిమనిషి వంటి నవల వ్రాయొచ్చు గదా!

మాస పత్రికల వాళ్ళు, వార పత్రికల వాళ్ళు, ఈ రచయిత ముందు క్యూలో నిలబడుతున్నారుట. కాష్మోరా వీరేంద్రనాథ్ వ్రాయటం లేదు కనుక ప్రస్తుతం జ్యోతి ఒక్కటే ఆయన సీరియల్ ప్రచురిస్తున్నది. ఈ కథ ప్రచురించింది కూడా జ్యోతి కాబట్టి సీతాదేవి గారి అభిప్రాయంతో జ్యోతి ఏకీభవిస్తున్న దన్న మాట!

ఒక నవల యొక్క సాహితీ ప్రయోజనాన్ని చర్చించే హక్కు సీతాదేవి గారిక్కి ఎప్పుడూ వుంది కానీ, రచయిత డబ్బు కోసం వ్రాస్తున్నాడా? వగైరా, వగైరా Saterical గా ప్రశ్నలడిగే హక్కు ఆమెకు లేదు.

సీతాదేవి వంటి రచయిత్రి సాటి రచయితల మీద దుమ్మెత్తి పోయడం వంటి రచనలు మానేసి, సామాజిక ప్రయోజనం ఉండే రచనలు చేస్తారని ఆశిస్తున్నాను.

రామకృష్ణ
హైదరాబాదు.

కమలహాసన్ ముఖచిత్రంతో వెలువడిన నవంబరు "జ్యోతి" సంచిక చాలా బాగుంది.

నవలానుబంధంలో వెలువడిన మలి వెలుగు నవలలో సీత మామూలు స్త్రీ. తర తరాల బానిసత్వం, భారతీయ సంస్కృతి ఆమె నర నరాల్లో జీర్ణించుకొని ఉంది. కాబట్టే తన మాంగల్య రక్షణ కోసం, తనను నమ్మిన మురళిని జైలుకు పంపించటానికి కూడా ఆమె వెనకాడ లేదు. జీవిత సంగ్రామాన్ని మలి వెలుగుగా మలచిన రచయిత "కరుణారుణ" గారికి అభినందనలు. "కుట్ర" కథ కూడా బాగుంది. రచయిత కుప్పిరెడ్డి .. గారు చక్కగా మలిచారు, మీకు మా అభినందనలు.

కోలవెంటి దుర్గాప్రసాదు.
గొల్లపల్లి

నవంబరు నెల జ్యోతిలో "స్వీట్ సిక్స్టీన్" నరశింహంగారి కథలాగే జీవితంలో మరిచిపోలేని సంఘటనలు స్వీట్ సిక్స్టీన్ వయస్సులోనే జరుగుతాయి-అందుకే స్వీట్ సిక్స్టీన్‌కి అంత ప్రాముఖ్యతగా అందరి జీవితాల్లో పరిగణించవచ్చు. బంగారుబొమ్మ భానుమూర్తి నవ్వాడు, అవస్థ కథలుచాలా బాగున్నాయి, కార్టూన్స్ అన్నీ చక్కని హాస్యాన్ని అందించాయి – ప్రచురిస్తున్న చిన్న చిన్న కవితలు భావ గర్భితంగా వున్నాయి. సౌభాగ్యలత, డబ్బు సీరియల్ రెండూనై విధ్యం గల చక్కని నవలలు. చాలా ఆసక్తి కరంగా ముందుకు సాగుతున్నాయి.

వై. హేమ సుందర్ రావు, ప్రియ
సికింద్రా బాద్.

---

"ఈ మాసం మీ కోసం' శీర్షికలో అక్టోబరు సంచికలో మేము ప్రచురించిన "అక్యుపంక్చర్ వైద్య విధానం" చదివిన అనేక మంది "డాక్టర్ మిత్రా" గారి చిరునామా కోరుతున్నారు.

వారి చిరునామా ;

**డా. గురుకుల మిత్ర**
**3-5-198,**
**హిమాయత్‌నగర్,**
**హైదరాబాద్-29.**

---



శ్రీ సారథీ స్టూడియోస్

# రాధా కళ్యాణం

ఈస్ట్మన్ కలర్

దర్శకత్వం బాపు

నిర్మాతలు జి డి ప్రసాదరావు, పి శశిభూషణ్

ముళ్ళపూడి వెంకటరమణ భాగ్యరాజా బాబా ఆజ్మీ కె వి మహదేవన్

నవయుగ

VEEKAY—





సచిత్ర మాసపత్రిక



భాగ్యలక్ష్మి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లాటరీ

సంయుక్తంగా నిర్వహిస్తున్న

# సంక్రాంతి కథల పోటీ

మొట్టమొదటి సారిగా తెలుగు పత్రికా ప్రపంచంలో

అత్యంత ఆకర్షణీయమైన పోటీ

ఈ సంక్రాంతి కథల పోటీ బహుమతి

మొత్తం రూ. 7500/-

JYOTI



# మా బహుమతుల వివరాలు

ప్రథమ బహుమతి : రు. 2,000

ద్వితీయ బహుమతి : రు. 1,500

తృతీయ బహుమతి : రు. 1,000

పది కన్సొలేషన్ బహుమతులు : రు. 300 చొ॥

**మీ రచనలకోసం మేం ఎదురుచూసే ఆఖరుతేది డిసెంబరు 20**



## ఇక మీరు ఖచ్చితంగా పాటించాల్సిన నిబంధనలు

1. కవరుపై, రచనపై "జ్యోతి–భాగ్యలక్ష్మి ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీస్ కథల పోటీకి" అని రాయాలి.
2. 12 అరటావులకి మించకుండా ఒక ప్రక్కనే రాయాలి.
3. రిజిస్టర్ పోస్టులో వచ్చిన రచనలకే మేము బాధ్యులం.
4. పోటీ తుది నిర్ణయం సంపాదకులదే.
   ఏ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
5. స్వంత చిరునామాతో స్టాంపులు జతపరిచిన కవర్లు రచనలతో పంపాలి
6. రచనలో తమ కలం పేర్లు ఉపయోగించినా అసలు పేరు విధిగా రాయాలి. రచన మీద కాక విడిగా కాగితంపై పేరు, చిరునామా రాయాలి.
7. బహుమతి కంగీకరించ బడని కథలు మా సాధారణ సంచికలలో ప్రచురించే హక్కు వుంది మాకు.
8. రచనలు చేరవలసిన ఆఖరు తేది డిసెంబరు 20 తారీకు.
9. ఇది వృత్తాంతం లాటరీలకి సంబంధించినదిగా వుండనవసరంలేదు.
10. పోటీకి జ్యోతి మాసపత్రిక, ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీస్ కార్యాలయాలలో పనిచేయువారి రచనలు పరిశీలింప బడవు.



# ఒడ్డుకు చేరిన బల్లకట్టు....



మాధవపెద్ది గోఖలే మనకున్న బహు కొద్దిమంది మంచి రచయితలలో ఒకరు, మనకున్న చక్కని చిత్రకారులలో ఒకరు, వున్న కొద్దిమంది మంచి సినీ కళాదర్శకుల్లో ఒకరు. అలాంటి 'మా గోఖలే' వెళ్ళిపోయారు

భావ కవిత్వం, ఊహాలోకంలాంటి రంగుల కథలు తెలుగు దేశంలో రంగు లారక ముందే గోఖలేగారి కథలొచ్చాయి. వొచ్చి తెలుగు గ్రామీణ వాతావరణం.... అక్కడి మనుష్యుల్లోని 'పాలిటిక్స్‌ల బూచి'ని బయట పెట్టాయి - వివిధ పత్రికలలో ఆయన రాసిన కథలు కొన్ని గుజరాతీ, హిందీ, కన్నడ భాషల్లోకి తర్జుమా అయ్యాయి

ప్రమోద్ కుమార్ ఛటర్జీ, దేవీప్రసాద్ రాయ్ చౌదరివంటి హేమా హేమీల దగ్గర నేర్చిన చిత్రకళ ఆయనది ...ఆయన రచించిన చక్కని రంగుల చిత్రాలని కొన్ని "భారతి" వారు ప్రచురించారు తమ సంచికలలో

ఈ మధ్య సంవత్సరాలలో ఆయన రచనలని తెలుగువారికి మళ్ళీ చూపే అవ కాశం మాకు కలిగింది - పోయిన సంవ త్సరం దీపావళి సంచికలో "అపూర్వ సందర్భాలు" అన్న కథనీ, తరువాత "పుణ్యాత్ముడైన పాపి మృత్యువు" నీ ప్రచురించాము....ఈ సంవత్సరం దీపావళి సంచికకి కథ రాయవలసిందని కోరుతూ రాశాము - ఆయన కన్ను మూశారని విని విచారించాము - ఆయన కథ మాకు ఇక చేరదను కున్నాము....కానీ ఆయన కథ రాయటమూ జరిగింది — వారి కుటుంబ సభ్యులు తరువాత దానిని మాకు పంప టమూ జరిగింది. అలా వారి కథ ప్రచురించే అవకాశం కలిగింది.

"బల్లకట్టు పాపయ్య'ను ఆంధ్రసాహితీ తీరంలో విడిచిన బల్లకట్టు వెళ్ళిపోయింది..."

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





## మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన
నాలుగు నూనెల సమ్మేళనం—
హాపుషా (దేవదారు జాతి), సరళం. రెక్సోనాతో స్నానం
చెయ్యండి—అది మీ చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది,
మీరెంతో ఇష్టపడే
పరిమళాన్ని చర్మంపై
విలిపి గుబాళింపజేసే
రెక్సోనా మీ చర్మ
సంరక్షణ కోసం
సహజమైన సాధనం.




## రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి



ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ



ముఖ్యమంత్రి శ్రీ టి అంజయ్య

# ఆంధ్రప్రదేశ్ లో ఇతోధికంగా విద్యా సౌకర్యాలు

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత గత 25 సంవత్సరాల కాలంలో అత్యధిక సంఖ్యాక ప్రజలకు విస్తృత స్థాయిలో విద్యా సౌకర్యాలు కల్పించడంలో మన రాష్ట్రం అగ్రగామిగా ఉంది

## ❋ ఉన్నత విద్య :

1956–1957 సంవత్సరంలో మన రాష్ట్రంలో 57 డిగ్రీ కళాశాలలతో కేవలం మూడు విశ్వ విద్యాలయాలు మాత్రమే వుండగా, 1981-82 లో 277 డిగ్రీ కళాశాలలతో 6 విశ్వ విద్యాలయాలు 2 వృత్తిపరమైన విశ్వ విద్యాలయాలు పని చేస్తున్నాయి, 1969–70 సం।లో కేవలం 8 జూనియర్

కళాశాలలు మాత్రమే ఉండగా, ఈనాడు 577 జూనియర్ కళాశాలలు ఉన్నాయి. కళాశాలలో ప్రవేశాల సంఖ్య అమోఘంగా పెరిగి 3 50 లక్షలకు చేరుకుంది, ఉపాధ్యాయుల అమోఘమైన సేవలకు గుర్తింపుగా విశ్వ విద్యాలయ కళాశాల అధ్యాపకులకు రాష్ట్ర బహుమతులను ప్రవేశ పెట్టిన ప్రప్రథమ రాష్ట్రం మన ఆంధ్ర ప్రదేశ్.

## ✱ వయోజన విద్య :

రాష్ట్రంలో యిప్పుడు 23 వయోజన విద్యా ప్రాజెక్టులు పనిచేస్తున్నాయి. ప్రతి ప్రాజెక్టు క్రింద 300 వయోజన కేంద్రాలు ప్రతి కేంద్రంలో 30 మంది అభ్యర్థులు ఉన్నారు

## ✱ పాఠశాల విద్య

ప్రాథమిక విద్యా రంగంలో గమనార్హమైన అభివృద్ధి సాధించారు 1956లో 2.54 లక్షల మంది విద్యార్థులతో 29,876 పాఠశాలలు వుండగా, ఈనాడు 51.13 లక్షల మంది విద్యార్థులతో 39,955 పాఠశాలలు పనిచేస్తున్నాయి. అదే విధంగా ఉన్నత పాఠశాలల సంఖ్య 733 నుంచి 1979-80లో 3599 కి పెరిగాయి.

## ✱ సాంకేతిక విద్య :

1956-57 లో కేవలం మూడు పాలిటెక్నిక్ సంస్థలు మాత్రమే ఉండగా ఇప్పుడు 6 మహిళా పాలిటెక్నిక్‌లతో పాటు 35 పాలిటెక్నిక్‌లు పని చేస్తున్నా . దానికి తోడు 15 ఇంజనీరింగ్ కళాశాలలు పని చేయడం గాని అనుమతించ బడడం గాని జరుగుతున్నది.

అన్ని వర్గాల ప్రజలకు విద్యా సౌకర్యాలు కల్పించాలనే రాజ్యాంగ పరమైన బాధ్యతను ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం యీ విధంగా నిర్వర్తించ గలిగింది,

---

**డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.**

నెం 1



# ఆరుద్ర బాతాఖానీ

పానక మహాశనులారా ! ఈ మిధ్య మా పచ్చిలో మచ్చు తుప్పలు కోకల్లలుగా కరిపిస్తున్నాయి, ఆ వృత్త తప్పులు మేము వాంతించని తుద్రా రాక్షసాలు ఇవి కావాలని పచనము చేస్తున్నవి.

కృషితో నాస్తి దౌర్భాగ్యం

ఆశ లావు పీక సున్నం

కొంతమంది ఉద్యోగులు ఒకే లంచంలో తినే మిత్రులు.

వడగళ్ళ వాన పిల్లలకు హర్ష ఋతువు

దొంగ భక్తులు కామనామ స్మరణ చేస్తారు

అట్లు

బ్రూట్ లేబర్

(అయిదు సంవత్సరాల్లో యాభై లక్షలు సంపాదించి రామ్మోహనరావ్ కూతుర్ని పెళ్ళి చేసుకుంటానని గాంధీ పందెంకట్టాడు. ఒక ముసలి బిచ్చకత్తె పది పైసలు పెట్టుబడి పెడుతుంది. అయిదువేలు సంపాదించేక, ఆమె వాటా ఆమెకి ఇచ్చి వదిలించేసుకోవాలను కుంటాడు గాంధీ-స్నేహితురాలు లక్ష్మి తిరస్కరిస్తుంది)

## ఇక చదవండి

ఆమె అటుతిరిగి పడుకోగానే గదిలో నిశ్శబ్దం ఆవరించింది. అందులోంచి బైట వర్షపు చినుకుల శబ్దం మొదలై క్రమంగా ఎక్కువైంది.

బైట హోరుగాలి. గుండెల్లో అలజడి. చాలాసేపు అలానే కూర్చొని, వెలితి భరించలేక బైటకొచ్చేడు. చూరులోంచి ధారగా కారుతున్న వర్షపునీళ్ళని కన్నార్పకుండా చూసేడు. జల్లు మొహంమీదకు కొడ్తోంది. అయినా కదల్లేదు. రోడ్డు మీదనుంచి నీరు పాయ ట్టి పల్లంలోకి పారుతుంది.

బిచ్చగత్తెకి డబ్బులు లాభంతో సహా తిరిగి ఇచ్చేయటంలో తనేంతో నిజాయితీగా ప్రవర్తిస్తున్నాననుకున్నాడు. కానీ అట్నుంచి ఆలోచిస్తే లక్ష్మి వాదనే కరెక్టనిపిస్తూంది. దాదాపు గంట గడిచింది సమయం ఎంతయిందో తెలీదు.

అతడో నిర్ణయానికివచ్చాడు. ఆ నిర్ణయానికి రాగానే మనసంతా తేలికయినట్టు అనిపించింది. లోపలికి నడిచేడు. లక్ష్మి వత్తిగిల్లి నిద్రపోతూంది. మసక వెల్తురు నీడ చెంప మీద జీరాడుతూంది మోకాళ్ళమీద ఆమె పక్కగా కూర్చొని, కంపిస్తున్న గొంతుతో "లక్ష్మి" అన్నాడు ఆమె కళ్ళు విప్పింది "నేనూ.... నేనూ... ఐ యామ్ సారీ" అని ఏదో చెప్పబోయి, మాటరాక తడబడి, "మనం....అదే.... నేను... మన పార్టనర్ని మన తోనే వుంచుకుంటే—అంటే-ఐ మీన్ ... " అన్నాడు. అతను చెప్పదల్చుకున్నది ఆమెకి అర్థమయింది. నిద్రకళ్ళతో నవ్వి— స్నేహపురస్సరంగా నవ్వి అతడి చెయ్యి మీద చెయ్యి వేస్తూ "తప్పకుండా మనతోనే వుంచుకుందాం. రేపే తీసుకురా" అన్నది.

ఆ తరువాత అతడు నిశ్చింతగా నిద్రపోయేడు.

ఆరయింది.

సూర్యుడు మేఘాల మధ్యనుంచి కొద్దిగా తెరిపిచేసుకుంటూ పైకి వస్తున్నాడు. రాత్రి తాలూకు వర్షం నీళ్ళు ఇంకా ప్రవహిస్తూనే వున్నాయి. దేవాలయం ముందుకి ఒకరొక్కరే బిచ్చగాళ్ళు చేరుకుంటున్నారు. ప్రభాత సమయపు పక్షుల కిలకిలారవం లేత సూర్య కిరణానికి తోడై ప్రపంచాన్ని లేపటానికి సాయపడ్తోంది.

గాంధీ మట్ల మొదట్లో నిలబడి వున్నాడు. అక్కడికి వచ్చి చేరుతున్నవాళ్ళని పరిశీలిస్తున్నాడు. బిచ్చకత్తె రాలేదు.

ఆరున్నరయింది.

భక్తులు వస్తున్నారు. రద్దీ ఎక్కువైంది. సూర్యుడు బాగా పైకి వచ్చేసేడు. ఏడున్నరయింది.

గాంధీ కొద్దిగా కంగారు పడ్డాడు. గుడి మెట్లెక్కుతూ ప్రతీమెట్టు మీద చూసేడు. లేదు. గుడి వెనుకా, కోనేరు పక్క నిద్ర గన్నేర్ల చెట్టు వెనుకా చూసేడు. లేదు.

తోటి బిచ్చగాళ్ళని అడిగాడు. తెలీదన్నాడు. పోలికలన్నీ విని, ఒక ముసలివగ్గు మాత్రం "రాత్రిళ్ళు ఆ అవ్వ సత్రం పక్కనున్న రావిచెట్టు పక్కన పడుకుంటుందని"




చెప్పాడు.

వడివడిగా గాంధీ అక్కడికి వెళ్ళాడు. ఎక్కువ సేపు వెతక నవసరంలేకపోయింది. రావిచెట్టు క్రింద మున్సిపాలిటీ బండివుంది. శవాన్ని బండిలో పెట్టటానికి నలుగురు పాకీ వాళ్ళు ఏర్పాటు చేస్తున్నారు. అవ్వ శరీరం చెట్టు మొదట్లో నిశ్చలంగా పడివుంది.

అతడు స్థాణువయ్యాడు.

రాత్రి తాలూకు వర్షపు చినుకుల బాణాలు ఆవృద్ధురాలిని ఎంత బాధపెట్టినాయో ఆ శుష్క శరీరాన్ని ఆ చలి రాత్రి ఎంతలా వణికించిందో .... ప్రాణం కొట్టకొని కొట్టుకొని పోయినట్టుంది. శరీరం చలికట్టెలా మారింది. అయినా ఆమె ఇంకా అతడి ముందు నిలబడి మాట్లాడుతున్నట్టే వుంది.

"....రెండ్రోజుల్నుంచి నువ్వేమీ తినలేదని తెలుస్తానేవుంది బాబూ. ఆ మెట్ల మీద ఎంతసేపు కూసున్నా పావలారాల్లేదు. దరమ పెబువులే కరువయ్యారు ఈరోజుల్లో, ఈ పది పైసలు దీస్కో బాబూ. ఏదైనా దిను. ఏం దినకపోతే శోషొస్తది. ఏరు శనగ పప్పైనా దిను కొద్దిగా...."

ఒకమాట–ఒక స్పర్శ–స్నేహ పురస్సరంగా ఒక సానుభూతి–మనిషికీ మనిషికీ మధ్య ప్రేమా, ఆప్యాయతా–కంటినిండా చిప్పిల్లిన నీళ్ళూ-మనసునిండా సంతృప్తి.... విషాదానికి ఆనందానికి తేడా లేకపోవటం-ఇంతకన్నా ఏంకావాలి జీవితానికి? ....డబ్బు, పదవి, రికమెండేషన్లు, మెటీరియలిస్టిక్ దృక్పథం–రోజువారీ జీవితం–మనిషికీ మనిషికీ మధ్య వుండే బంధంతో పోల్చుకుంటే ఇవి ఏపాటివి?

మున్సిపాలిటీవాళ్ళు శవాన్ని ఎత్తుతున్నారు.

అతడు వారి దగ్గరగా వెళ్ళి "ఈ శవాన్ని నేను తీసుకెళ్తాను" అన్నాడు. వాళ్ళు అతడివైపు ఆశ్చర్యంగానూ అనుమానంతోనూ చూసేరు. అతడు నచ్చచెప్పి యాభై రూపాయలిచ్చాడు. వాళ్ళు వెళ్ళిపోయారు. లక్ష్మి వచ్చింది. ఇద్దరూ ఎక్కువగా మాట్లాడుకోలేదు. పెంచుకొంటే పెరిగేది మమత ఒక్కటే....పంచుకొంటే తరిగేది బాధ

ఒక్కటే. సాన్నిహిత్యం చాలు. మాటలక్కర్లేదు.

మధ్యాహ్నమయింది. బ్రాహ్మడొచ్చి మిగతా తంతు పూర్తి చేసేడు.

సాయంత్రమయింది. ఎర్రటి సూర్యుడు పశ్చిమాన కొండల్లో—ఎర్రటి మంటలు స్మశానపు నడిబొడ్డు....

చేతులు కట్టుకుని నిలబడ్డాడు అతడు. అతడి మొహం నిర్వికారంగా వుంది. కాపరి దగ్గిర కొచ్చాడు. "బక్షీస్ సాబ్...."

అతడు తలతిప్పి చూసేడు.

"శవాన్ని తిప్పాలి సాబ్. బాగా తిప్పితే బాగా కాల్తుంది. చెయ్యో కాలో సరిగ్గా కాలకపోతే ఆత్మ దుఃఖపడ్తుంది సాబ్. ఇక్కడ డబ్బు గురించి ఎవరూ చూసుకోరు సాబ్... ఎంతో వద్దు. అయిదు రూపాయ లిప్పించండి."

గాంధీ మాట్లాడలేదు.

"రాత్రిపూట నక్కలొస్తాయి సాబ్. మీ బంధువుల శరీరాన్ని లాక్కుపోతాయి. ఆ బాధ పరాయివాళ్ళకికూడా రాకూడదు సాబ్. అయిదు రూపాయ లిప్పించండి. అంతా బూడిద చేస్తాను."

గాంధీ అదే నిర్వికారమైన చూపుతో అతడివైపు చూసేడు. "రోజుకెన్ని శవాలు కాలుస్తావ్ నువ్వు?"

సంబంధం లేని ఈ ప్రశ్నకి కాపరి ఆశ్చర్యపోయి, "ఒన్నోనా-ఒకటి రెండు సాబ్. అంతే" అన్నాడు.

"చూడూ" అన్నాడు గాంధీ. "నీ పేరుమీద ఈరోజే అయిదు వేలు బ్యాంక్‌లో వేస్తున్నాను. రోజూ పది రూపాయలు చొప్పున నీకొచ్చే ఏర్పాటు చేస్తాను. ఈరోజునుంచీ స్మశానంలో ఏ శవమూ సరిగ్గా కాలకుండా వుండటానికి వీల్లేదు. నీకు డబ్బు ఇవ్వలేక—తమవాళ్ళు మరణించిన దుఃఖం ఒకవైపు—వారిని పైలోకాలకు సరిగ్గా పంపలేకపోయామే అన్న తపన మరోవైపు—ఎవరినీ ఇకనుంచి బాధపెట్టకూడదు. అర్థమయిందా?"

నోరు తెరుచుకొని విస్మయంగా చూస్తూన్న కాపరిని పట్టించుకోలేదు అతడు. చేతులు రెండూ జేబులో పెట్టుకొని మౌనంగా ఇంటివైపు సాగిపోయేడు. వెళుతూ మనసులో అనుకున్నాడు....

"....ఇంతకన్నా పెద్ద పని నేనేమీ చెయ్యలేకపోయేను అవ్వా. నాకున్నంతలో చేసేను. నేను చేసింది నీ ఆత్మకు శాంతి చేకూర్చుగాక."

తన దగ్గిరున్న అయిదువేలూ అలా ఖర్చు పెట్టటంతో అతడు-మొదటిరోజున ఎలా వున్నాడో అలా చేతిలో పైసా లేకుండా మిగిలిపోయేడు.

అయితే మనసునిండా సంతృప్తి మిగిలింది డబ్బుతో రానిది.

# 12

ఆ రాత్రి అతడు నిశ్చింతగా నిద్రపోయేడు. ఆ రోజు వరకూ సంపాదించినదంతా పోయింది. అయినా బాధలేదు. లక్ష్మి కళ్ళలో తన చర్యపట్ల కనపడిన అభినందన చాలు.

మొట్టమొదటి రోజు కట్టుబట్టలతో ఎలా వున్నాడో - ఈ రోజు అలాగే.... అందుకే ఏ బాధా లేకుండా నిద్రపోగల్గుతున్నాడు. అయితే రాత్రి పదకొండు అయ్యేక రామ్‌తీర్థ తాలూకు మనిషి వచ్చి లేపాడు. "మిమ్మల్ని అర్జెంటుగా రమ్మంటున్నారు" అని.

వెళ్ళేసరికి రామ్‌తీర్థ కొంచెం ఆందోళనగా కనుపించేడు. అప్పటికి శ్యాంతు

ఆరంభమయి రెండు రోజులైంది.

"ఏమిటి సంగతి" కూర్చుంటూ అడిగేడు గాంధీ. రామ్‌తీర్థ అన్నాడు "ఈ రోజు డిపాజిట్ అయిదువేలకన్నా ఎక్కువలేవు. మనం అనుకున్నంత రావటం లేదు. బహుశ మనం పొరపాటు చేసేమేమో. స్టేట్ బ్యాంక్ ఆఫ్ బెంగుళూరు అని పెట్టకుండా ఏదైనా పేరున్న బ్యాంకు పెట్టవలసింది".

"అది మరీ రిస్కు" అన్నాడు గాంధీ. కొంచెంసేపు మౌనంగావుండి రామ్‌తీర్థ అన్నాడు "మనం ఆఫ్యర్థులకోసం పెట్టిన ఖర్చు, ఈ బ్యాంకు అద్దె, ప్రకటనలకయిన ఖర్చు, చెక్కు, డ్రాఫ్టు ప్రింటింగ్ అయిన ఖర్చులన్నీ పోతే మనకి ఏమీ మిగలదను కుంటాను."

దూరంగా ఒంటి గంట కొట్టింది. గాంధీ కుర్చీలో ఇబ్బందిగా కదిలేడు. రామ్‌తీర్థకి ఈ ప్లాన్ చెప్పినందుకు తనకి అయిదు వేలు ఇచ్చాడు. అంతే కాకుండా ఒక బ్యాంకు ఓపెన్ చేసేటంత రిస్కు తీసుకున్నాడు. ఎంతలేదన్నా ఒక లక్ష లాభం వస్తుందనుకున్నాడు. కానీ ఇంత ఘోరంగా ఈ ప్లాన్ ఫెయిలయిందేమిటి ?

"పోనీ బ్యాంకుని ఒక నెల రెండు నెలలు నడిపిద్దామా ? ఎవరికీ అనుమానం రాలేదుగా" రామ్‌తీర్థ అడిగాడు.

"వద్దొద్దు" కంగారుగా అన్నాడు గాంధీ. "డ్రాఫ్టులూ - చెక్కులూ, క్లియరింగ్ హవుస్ గొడవలూ – వారంకన్నా ఎక్కువైతే అనుమానం వస్తుంది. మన చెక్కు ఇంకో బ్యాంకులో ఇచ్చినవాళ్ళు అది క్యాష్ అవకపోతే మన గురించి ఎంక్వయిరీ చేయటానికి వారంకన్నా ఎక్కువ పట్టదు."

"మరెలా"

"ఆ లొకాలిటీలో వున్న కన్నడుఁలు ఎక్కువగా రావటం లేదా ?"

"వాళ్ళందరూ ఆఫీసుల్లో పనిచేసేవాళ్ళు - ప్రతిరోజు మన బ్యాంక్ ప్రారంభం అయ్యే సమయానికే ఆఫీసుకి వెళ్ళిపోతున్నారు. ఒక ఆరేడు నెలలు ఇలా పారేస్తే నెమ్మదిగా ఆకర్షితులవుతారేమో కానీ ఇప్పట్లో మాత్రం రారు" అని ఆగి, "వారిని నమ్ముకొని మనం ఆ ప్రాంతంలో పెట్టడంలో తప్పు చేసేమేమో" అన్నాడు. గాంధీ మాట్లాడలేదు. అది ఓటమి. దాన్ని వప్పుకొని తీరాలి ! అతడు లేచాడు. రామ్‌తీర్థ కూడా లేస్తూ" ఏం బ్యాంకో, ప్రారంభించిన రోజు పదిపది హేను లక్షలు డిపాజిట్టులు వచ్చినయ్ అంటారు. మనకి రాకపోటానికి కారణం బహుశ పబ్లిసిటీ లేకపోవటమేమో అని, ఆగి, నెమ్మదిగా, "....రేపటితో మూసేద్దాం. ఎందుకు ఎక్కువ రోజులు పెట్టి రిస్కు తీసుకోవడం...." అన్నాడు. గాంధీ తల వంచుకొని బైటకొచ్చేసేడు.

డిప్రెషన్ !

చుట్టూ చీకటి. అతడు తల వంచుకొని నడుస్తున్నాడు. అర్ధరాత్రి దాటి మూడు గంటలయింది ప్రపంచం నిద్రపోతూంది. వీధి మధ్యగా, జేబుల్లో రెండు చేతులు పెట్టుకొని నడుస్తున్నాడు. ఇంటికి వెళ్ళబుద్ధి కాలేదు. చచ్చిపోయిన అవ్వ జ్ఞాపకం వచ్చింది. సంపాదించిందంతా పోవడం జ్ఞాపకం వచ్చింది. అది దుఃఖం కాదు. వేదన కూడా కాదు. స్తబ్దత. లక్ష్మి జ్ఞాపకం వచ్చింది. ఆమె మాటలు జ్ఞాపకం వచ్చాయి. "అన్నిటికన్నా పెద్ద ఓటమి మరణాన్ని కోరుకొనే స్థితి రావటం. అన్నిటి కన్నా పెద్ద గెలుపు అన్నీ సాధించేసేననుకోవటం. జాగ్రత్తగా ఆలోచిస్తే రెంటికీ తేడా లేదు. ఈ నిజాన్ని గ్రహిస్తే జీవితంలో డిప్రెషన్‌కి చోటులేదు "

ఆ మాటల్ని పదేపదే మననం చేసుకొన్నాడు. తెల్లవారుతోంది. దూరంగా




ఎక్కణ్ణుంచో సుప్రభాతం వినిపిస్తూంది. అతడికి చప్పున ఒక ఆలోచన వచ్చింది. అని స్ఫురించగానే గబుక్కున వెనుదిరిగాడు. పరుగెత్తటం మొదలుపెట్టాడు. రామ్‌తీర్థది చేరుకొనేసరికి అయిదవుతుంది. అతడిని నిద్రలేపి తన ప్లాన్ చెప్పాడు. రామ్‌తీర్థ అది విని విస్తుబోయేడు. "అసలది సాధ్యమేనా" అని అనుమానంగా అడిగాడు.... గాంధీ నమ్మకంగా నచ్చచెప్పాక, ఒక్కసారి దాని గురించి కన్విన్స్ అయ్యేసరికి రామ్‌తీర్థ మరి ఆలస్యం చేయడంలేదు, ఆరున్నర అయ్యేసరికి పాంప్లెట్లు ప్రింట్ చెయ్యబడ్డాయి. ఏడున్నర అయ్యేసరికి కాలనీలో పోస్టర్లు అంటించబడ్డాయి. ఇద్దరు ముగ్గురు మంగలి వాళ్ళకి బ్యాంకులో ఉద్యోగాలు ఇవ్వబడ్డాయి.

—సరిగ్గా పదిన్నర అవుతూవుండగా గాంధీ బ్యాంకు వీధిలోకి ప్రవేశించాడు. బ్యాంకు వైపు చూసి, తన కళ్ళని తానే నమ్మలేనట్టు ఆగిపోయాడు. జనం క్యూలో నిలబడి వున్నారు. అంతా హడావుడిగా వుంది.

భుజంమీద చెయ్యిపడటంతో వెనుదిరిగి చూసేడు. రామ్‌తీర్థ నవ్వుతూ "కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు. "మన పాంప్లెట్ బ్రహ్మాస్త్రంలా పనిచేసింది." అంటూ కాలనీలో పంపిణీ చేసిన కరపత్రాన్ని అందించేడు. అందులో ఇలా వుంది.

"స్టేట్ బ్యాంక్ అఫ్ బెంగళూరు.

ఖాతాదార్లకు మహదావకాశం

మా బ్యాంక్‌లో ఈరోజే ఖాతా తెరవండి అయిదు వందల రూపాయలు ఫిక్స్‌డ్ డిపాజిట్టు చేసిన వారికి మా బ్యాంక్‌లోనే శిరోముండనం చేయించి, ఆ జుట్టును స్వామి వారికి పంపుతాం. క్షురకర్మ పాత్రులైన మంగళ్ళచే చేయబడును. ఆ తరువాత మీ వెంట్రుకల్ని పవిత్ర జలంలో శుద్ధి చేసి, ఆ రోజే స్పెషల్‌గా పార్సిల్‌లో పంపిస్తాం. ఇక నుంచీ అంత దూరం వెళ్ళి మీరు జుట్టు సమర్పించనక్కర లేదు. భక్తుల సేవకై ఎల్లప్పుడూ పాటుబడే మీ బ్యాంక్ — బ్యాంక్ ఆఫ్ బెంగుళూర్."

మూడోరోజు....నాలుగోరోజు...అయిదోరోజు గడిచినయ్. జనం విరగబడి వస్తు

న్నారు. క్లర్కుల్ని ఇద్దర్ని తొలగించి మరో పదిమంది మంగళవాళ్ళని పనిలోకి తీసుకొన్నాడు రామ్‌తీర్థ. కౌంటర్‌ని కొద్దిగా వెనక్కి జరిపించి అక్కడకూడా క్షురకర్మ ప్రారంభింపచేసేడు. జుట్టు పాలిథిన్ సంచుల్లో భద్రపచ్చబడింది. జనం క్యూల్లో నిలబడి గుళ్ళు గీయించుకున్నారు.

శనివారం మధ్యాహ్నానికి వచ్చిన డిపాజిట్లు చూసుకొని తలమునకలయ్యేలా ఆశ్చర్య పోయారందరూ.

వసూలయిన డబ్బు ఇరవై ఎనిమిది లక్షల రూల్లర.

గాంధీ పెదవులమీద చిరునవ్వు కదిలింది. సెక్సూ, భక్తి – రెండూ మనిషిని ఆడించే ఆయుధాలు.

"నీ వాటా లక్షా నలభై వేలు. తీసుకో" అన్నాడు రామ్‌తీర్థ. గాంధీ అడ్డంగా తలూపేడు. "నాకు రావాల్సిన అయిదువేలు ముట్టినయ్. మిగతా దాంట్లో నేను భాగస్వామినికాను. నాకు వాటా అక్కర్లేదు. నేను సంపాదించాల్సిందంతా చట్టబద్ధంగానే సంపాదించాలనేది నా కోర్కె" అన్నాడు.

దాని గురించి చాలాసేపు వాదన జరిగింది గాంధీ ఒప్పుకోలేదు. రామ్‌తీర్థ తలూపుతూ "సరే అయితే. కానీ నీకు నా సహాయం ఎప్పుడు కావల్సి వచ్చినా అడుగు" అన్నాడు. గాంధీ వెళ్ళిపోయాడు.

—వారం గడచింది. పదిరోజులు గడచినయ్. పదిహేను రోజులు అయినయ్ ఎందుకో ఆ వీధివెంట వెళ్ళిన గాంధీ. బ్యాంకు ఇంకా తెరిచివుండటం చూసి ఆశ్చర్యంతో రామ్‌తీర్థను కలుసుకున్నాడు. రామ్‌తీర్థ నవ్వి" పోలీసుల భయం ఏమీ లేదు. లాభాలు విపరీతంగా వస్తున్నాయ్. ఎందుకు బ్యాంకు మూసెయ్యటం" అన్నాడు. "ఒకవేళ పోలీసులు దాడి చేసినా బ్యాంకులో ఏమీ దొరకదు."

గాంధీకి భయం వేసింది. బ్యాంకుని అంతకాలం కొనసాగించటం మంచిదికాదు. అయినా అతడేమీ సలహా ఇవ్వలేదు. 'రామ్‌తీర్థకి సలహా ఇచ్చేటంత గొప్పవాణ్ణి కాదు నేను' అనుకున్నాడు. అయితే అతడి భయం కొద్దిరోజుల్లోనే నిజమైంది. బ్యాంక్ ఆఫ్ బెంగుళూర్ చెక్కుని ఇంకో వూళ్ళో ప్రెజెంట్ చేసేడు ఒక కస్టమరు ఆ బ్యాంక్ ఈ వూరికి క్లియరెన్స్ కోసం పంపింది. క్లియరెన్స్ హౌస్‌లో అటువంటి బ్యాంక్ ఏదీ లేదని తెలిసింది. ఎల్.పి సి లో అనుమానం వచ్చింది. స్టేట్ బ్యాంక్ మానేజరు గట్టివాడు వెంటనే పోలీస్ రిపోర్టు ఇవ్వబడింది అయితే ఇన్‌స్పెక్టర్ అవినాష్ వెంటనే ఈ బ్యాంకు మీద దండెత్తలేదు. ఇంత తెలివిగా ఇట్లాంటి ప్లానెయ్యగలిగేది రామ్‌తీర్థ ఒక్కడే అని భావించాడు. ఆతడు ఆ పరిసరాల్లో వుండడనికూడా ఊహించాడు. అతడి ఆలోచన నిజమైంది ఆ సాయంత్రం డబ్బు తీసుకెళ్తున్న క్యాషియర్‌ని రహస్యంగా వెంటాడి రామ్‌తీర్థని పట్టుకోగలిగేరు పోలీసులు.

హడావుడి - రక్తపాతం లేకుండా లొంగిపోయాడు రామ్‌తీర్థ.

o o o o o

కొన్ని రోజుల తర్వాత అతడిని జైల్లో కలుసుకున్నాడు గాంధీ. ముందు ఎలా వున్నాడో అలాగే హుషారుగా నవ్వుతూ వున్నాడు. అతడు "... చూసేవా నువ్వు చెప్పిన సలహా పాటించలేదు అనుభవిస్తున్నాను" అన్నాడు నవ్వుతూ. గాంధీ నవ్వలేదు.

ఆందోళనగా "ఏమవుతుంది ఇప్పుడు" అని అడిగాడు. ఎన్నో సంవత్సరాల్నుంచి ఎంతో పకడ్బందీగా ప్లాన్లు వేస్తూ పోలీసులకి చిక్కకుండా వున్న రామ్‌తీర్థ - ఇంత చిన్న విషయంలో తప్పుచేసి దొరికిపోవటం అతడికి బాధగ వుంది. అంతేకాదు- పోలీసులు

అతడిని బాగా బాధపెట్టినట్టూ చర్మం అక్కడక్కడా కమిలి వుంది

"మొత్తం డబ్బంతా పోలీసులకి అప్పజెప్పేసేను." అన్నాడు రామ్‌తీర్థ "....ముప్పై లక్షలకి పైగా"

"అయితే వదిలేస్తారా" ఆశగా అడిగేడు గాంధి.

రామ్‌తీర్థ బిగ్గరగా నవ్వి, "వదిలివెయ్యటమా?" అన్నాడు. "నా మీద ఈ పోలీసులు పెట్టబోయే అన్ని కేసులకు కలిపి, తొంభై తొమ్మిది సంవత్సరాలకి పైగా శిక్ష పడొచ్చు" అన్నాడు.

"ఎందుకు—ఎందుకవుతుంది ఇలా? దేశంలో తెలివైన వాళ్ళంతా జైళ్ళల్లో మగ్గిపోతున్నారు?"

రామ్‌తీర్థ మొహంలో నవ్వు మాయమైంది. ...చాలాసేపు పైకప్పుకేసి ఒళ్ల అంచులకేసి చూస్తూ - "అవును, ఎందుకవుతుంది ఇలా" అని ఆగేడు.

"ఆకలి! ఆకలివల్ల అవుతుంది!! ఆకలి మనిషిని రెండు దార్లలో నడిపిస్తుంది, ఒకటి తిరగబడటం - రెండు మోసం చెయ్యటం' నేను రెండోదాన్ని కోరుకొన్నాను. అయితే నీలాగా దార్లలో చట్టబద్ధంగా అని రూలు పెట్టుకోలేదు.' ఒకడు హత్య చేస్తాడు. చెయ్యలేదని కోర్టులో నిరూపిస్తాడు. బైటపడ్తాడు. రెండోవాడు లక్షల్లో డబ్బు సంపాదిస్తాడు. ఇన్‌కంటాక్స్ రైడింగ్‌లో అది పట్టుబడుతుంది కానీ ఇన్ఫ్లుయెన్స్ వల్ల బైటపడ్తాడు ... ఈ ఇద్దరికీ ఏం తేడా వుంది? నా దృష్టిలో లేదు. నాకు తిండి పెట్టలేని ఈ వ్యవస్థని నేను మోసం చేయటంలో తప్పులేదని నేను అనుకుంటున్నాను అలాగే చేస్తూ వచ్చాను, అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన, విచారకరమైన విషయం

ఏమిటంటే నా పంథాలో నన్ను అనుసరించటానికి వందలాది యువకులు వచ్చి చేరారు, అందరూ ఇంజనీర్లు - డాక్టర్లు -పోస్టు గ్రాడ్యుయేట్లు !!! మరి ఇంత మందికీ న్యాయానికీ అన్యాయానికీ తేడా తెలీదా ? తెలిసీ ఎందుకు వచ్చి చేరేరు ? ఒకటే సమాధానం. ఆకలి న్యాయాన్యాయాల మధ్య తేడాని గుర్తించదు. అంతే.

జైల్లో పడినందుకు నేను సిగ్గుపడటంలేదు. నాలాటి లక్షలమంది జైల్లోకి వెళ్ళే పరిస్థితులు కల్పిస్తున్నందుకూ ఇంతమంది తెలివైన వాళ్ళని నిర్వీర్యులుగా, సినిక్‌లుగా తయారు చేస్తున్నందుకు ఈ ప్రభుత్వాన్ని జైల్లో పెట్టాలి" ఆవేశాన్ని అణుచుకుంటూ అన్నాడు రామ్‌తీర్థ.

సెంట్రీవచ్చి టైమ్ అయిపోయిందని చెప్పాడు. "ఒక్క నిముషం" అని అతడిని పంపి గాంధీవైపు తిరిగేడు. "ఎప్పటినుంచో నీకో విషయం చెబ్దామని అనుకొంటున్నాను. ఈ రోజు సమయం వచ్చింది... నా దగ్గిర యాభై మంది దాకా ఇంజనీర్లున్నారు గాంధీ ! వీళ్ళు రకరకాల ప్లాన్లు వేసి నా దగ్గిరకి తీసుకొచ్చేవారు. ప్రాణాపాయం లేకుండా రైలు లూటీ చేయడం దగ్గర్నుంచీ ఎలక్షన్లలో డబ్బు తీసుకొని ఎమ్మెల్యేగా గెలిపించటం దాకా. అయితే నేను గమనించింది ఏమిటంటే 'ఈ యువకులకి తెలివితేటలూ ఆవేశాలూ తప్ప ఒక ప్లాన్ ప్రకారం ఒకటిగా పనిచేయటం తెలీదు. వీళ్ళందర్నీ సమీకరించి ఒకటిగా చేయటమే నేను చేసింది. దానికి నాకు పదోవంతు వాటా వచ్చేది. ఈ రోజు వాళ్ళందరూ చెల్లా చెదురు అయిపోయే పరిస్థితి ఏర్పడింది. గాంధీ ఇప్పుడు చెప్పు. నువ్వు నా స్థానాన్ని ఆక్రమిస్తావా ?"

శ్రద్ధగా వింటూన్న గాంధీ ఉలిక్కిపడ్డాడు. అతడు దీన్ని అసలు వూహించలేదు. "....నేనా ? " అన్నాడు. "నేను మీ స్థానాన్ని తీసుకోవటమా ? నాకు .... నాకు ఏం అర్హత వుంది ?" అంటూ తడబడ్డాడు.

"ఇంకా ఎవరూ గుర్తించలేదు. కానీ నేను గుర్తించగలను. గాంధీ నీ కళ్ళల్లో ఒక రకమైన నిస్తేజతవుంది జీవితంలో కష్టపడి పైకి రాగలిగితే మనిషి కళ్ళల్లో కనపడే ప్రశాంతంతో కూడిన పట్టుదల ! అదింకా బైటకి రాలేదు. కానీ నేను నాకున్న అనుభవంతో గుర్తించగలను. అందుకే ఈ పదవికి నిన్ను ఎన్నుకున్నాను".

గాంధీ మాట్లాడలేదు. రామ్‌తీర్థ అతడికి నచ్చ చెబుతున్నట్టు అన్నాడు."—మాదొక గాంగ్ అన్నారు ఒక ముఠా అన్నారు అటువంటి ముఠాకి నాయకుడు అనగానే "నేనో గజ దొంగని" అయిపోతానేమో అన్న భయం నీకు అక్కర్లేదు. గాంధీ ! మారుతున్న కాలం గురించి నీకు నేను చెబ్తాను విను. పూర్వకాలంలో బలవంతుడు బలహీనుల్ని దోచుకునేవాడు. ఈ కాలంలో తెలివైనవాడు న్యాయం పరిధిలో తెలివి తక్కువ వాణ్ణి దోచుకొంటున్నాడు. భవిష్యత్తులో ఇక అన్యాయం అన్న పదంకూడా వుండదు. మన దేశపు భవిష్యత్తుని నేను చెబుతున్నాను విను, ప్రతి సంవత్సరం మన లాటి వాళ్ళు లక్షల మంది తయారవుతున్నారు ఫ్రస్ట్రేషన్ చెలియలి కట్ట దాటునుంది. ఇప్పుడు గానీ నువ్వు ఈ గుంపుకి నాయకుడివి అవుతే పది సంవత్సరాల్లో ఈ దేశపు ప్రెసిడెంట్‌వి అయినా ఆశ్చర్యపోనక్కర్లేదు. అంత గొప్ప భవిష్యత్తు ఈ తెలివైన యువకుల మోసగాళ్ళ ముఠాకి వస్తుందని ఊహిస్తున్నాను నేను. నా మాట కాదనకు"

ఈ లోపులోనే గాంధీ ఒక నిర్ణయానికి వచ్చేసేడు.

నవ్వి "....సారీ" అన్నాడు. "దేశం,. వ్యవస్థ ....మనిషి భవిష్యత్తు—వీటన్నిటి పట్లా మీ అభిప్రాయం నిజం కావచ్చు. కానీ వీటన్నిటికన్నా ముఖ్యమైనదీ, విలువైనదీ ఇంకొకటి వున్నదని నా వుద్దేశ్యం. అది మనసు. కాన్షస్! మీ ప్రభుత్వం అధికారంలోకి




వచ్చి అన్యాయాన్ని కూడా చట్టబద్ధం చేసేక, అప్పుడు మీరు చెప్పినట్టు డబ్బు సంపాదిస్తాను. అంతవరకూ చట్టబద్ధంగా సంపాదించనివ్వండి"

"వీళ్ళు సంపాదించిన డబ్బులో పదోవంతు నాకొస్తుందని చెప్పాను. జ్ఞాపకం వుందా! అయిదు సంవత్సరాల్లో అది ఎంతవుతుందో వూహించగలవా గాంధీ—యాభై అరవై లక్షలు! నీలాటి తెలివైనవాడు ఏ రిస్కూ లేకుండా సంపాదించగలిగే డబ్బు." యాభై లక్షలు పోటీక....పందెం....గెలుపు.

జైలు గంటలు అయిదుసార్లు మ్రోగినయ్. సెంట్రీ వచ్చి నిలబడ్డాడు. గాంధీ నెమ్మదిగా "సారీ" అన్నాడు. రామ్‌తీర్థ తలెత్తాడు ఇద్దరి కళ్ళూ కల్సుకున్నాయి. ఇద్దరివీ స్థిరమైన అభిప్రాయాలే!!

"ఇట్సాల్‌రైట్" లేచేడు అతడు. షేక్‌హాండ్ ఇస్తూ "మంచిది గాంధీ. నీకు గెలుపు సిద్ధించాలని ఆశిస్తున్నాను" అని ఆగి, "....నీ పంథాలో" అన్నాడు చివరి మాటగా.

ఆ తరువాత అతను కదిలి, జైలుగోడల నిశ్శబ్దపు చీకటిలో కలిసిపోయాడు.

o o o o o o

ఆ మరుసటి రోజు అతను జైలు కిటికీకి వురి వేసుకొని చనిపోయాడన్న వార్త పేపర్లో వచ్చింది. చివరి ప్రార్థనగా అతను వ్రాసేడు "ఈ దేశపు తెలివైన యువకుణ్ణి సినిసిజంనుంచి దేముడు రక్షించుగాక!"

# 13

రామ్‌తీర్థ మరణం గాంధీమీద అంతర్లీనంగా చాలా ప్రభావం చూపించింది. అంతకుముందు అతను కొంచెం కుర్రవాడిలా చైల్డిష్‌గా ప్రవర్తించేవాడు. చాలా చిన్న చిన్న సంఘటనలు వ్యక్తుల జీవితాలమీద గొప్ప ప్రభావాన్ని చూపిస్తాయి. రామ్‌తీర్థ గాంధీతో చివరిసారిగా మాట్లాడిన సంఘటన అలాటిదే. ఎంతోమంది తనవాళ్ళని కాదని, నాయకుడిగా తనని ఆహ్వానించినందుకు అతడికి ఆత్మవిశ్వాసం కల్గింది - అయితే అంత



ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ



ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య

# ఆంధ్రప్రదేశ్ రజతోత్సవం

# అభివృద్ధి శిఖరాల అంచుల్లోకి...

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ మార్గదర్శకత్వంలో శ్రీ టి. అంజయ్య చైతన్యపూరితమైన నాయకత్వంలో అభ్యుదయ కాముక ఆంధ్రప్రదేశ్ సత్వరాభివృద్ధి సాధిస్తూ ముందడుగు వేస్తోంది. ఈ రజతోత్సవ సంవత్సరంలో సృజనాత్మకమైన పథకాల నూతన కార్యక్రమాల అమలు ఫలితంగా మన రాష్ట్రం సర్వతోముఖాభివృద్ధి సాధించింది. ఆర్థిక పురోవృద్ధిలోను, ప్రజల సంక్షేమ రంగంలోను మన రాష్ట్రం అమోఘమైన రీతిలో పురోగమించింది.

శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల కార్యక్రమంతోపాటు, 5 సూత్రాల కార్యక్రమాన్ని కూడ పటిష్ఠంగా అమలు జరపటంతో మన రాష్ట్రం ప్రగతికి బాటలు వేస్తోంది.

**రైతులకు ప్రోత్సాహకాల పంట**

- 10 ఎకరాల వెట్టి లేదా 5 ఎకరాల మాగాణికన్నా తక్కువ భూమిగల కమతందార్లకు భూమిశిస్తు ఉండదు
- పంటల భీమా పథకం ప్రవేశ పెట్టారు

**వెలుగు జిలుగులు**

- స్థాపిత విద్యుదుత్పాదక శక్తి రికార్డు స్థాయిలో 2,293 మెగావాట్లకు చేరుకుంది

JYOTI

**పేదలకు గృహాలు—సమాజ సంక్షేమం ;**

- 1980-81 సంవత్సరంలో 1,50,478 కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూర్చారు. ఇందుకోసం 7,[illegible]68 ఎకరాల ప్రైవేటు భూములు సేకరించడంతో పాటు 4,161 ఎకరాల ప్రభుత్వ భూములు వినియోగించారు.
- ప్రస్తుత సంవత్సరంలో వెనుకబడిన కులాల అభ్యున్నతికి వీలుగా ప్రత్యేక అంశాల కార్యక్రమానికి రూ 54 కోట్లు కేటాయించారు. 1979-80 లో కేవలం రు 5.[illegible]5 కోట్లు మాత్రమే వినియోగించారు.
- వికలాంగులకు నెలకు రూ. 80/- ల చొప్పున నిరుద్యోగ భృతి కల్పిస్తారు.

**పరిశ్రమల ప్రగతి, కార్మికులకు ప్రోత్సాహం :**

- 1981 జులైలో సింగరేణి బొగ్గు గనులలో రికార్డు స్థాయిలో 1,00,000 టన్నుల బొగ్గు ఉత్పత్తి సాధించారు.
- ఆంధ్రప్రదేశ్ చేతి వృత్తుల అభివృద్ధి కార్పొరేషన్ ఏర్పాటు చేశారు

**మారుమూల ప్రాంతాలకు సేద్యపునీటి సౌకర్యం :**

- పోలవరం ప్రాజెక్టుకు శంకుస్థాపన జరిగింది.
- శ్రీశైలం కుడికాలువ నిర్మాణం చేపట్టారు
- బూరాల ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభమైంది.

**రామరాజ్య పథంలో.... గ్రామ స్వరాజ్ ;**

- దశాబ్దానికి పైగా తర్వాత గ్రామ పంచాయతీలు, సమితులకు ప్రత్యక్ష ఎన్నికలు ప్రశాంతంగా నిర్వహించారు.
- ప్రప్రథమంగా 18 సంవత్సరాల వయస్సు గలవారికి ఓటు హక్కు ఇవ్వబడింది.

**సహకార సంఘాలు :**

- 1980-81 సంవత్సరంలో రికార్డు స్థాయిలో రు 90.90 కోట్ల మేరకు స్వల్పకాలిక, మధ్యకాలిక రుణాలను మంజూరు చేశారు.
- కేంద్ర సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు రికార్డు స్థాయిలో రు. 48 కోట్ల మేరకు దీర్ఘకాలిక రుణాలను మంజూరు చేసింది.

**రేపటి పౌరులకు ఉత్తమ విద్య :**

- కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేశారు
- సమగ్ర విద్యా బిల్లు ఆమోదించారు.

**సమర్థత పెంపుదలకు సర్వీసుల క్రమబద్ధత :**

- పౌర పంపిణీ పద్ధతిని క్రమబద్ధం చేయడానికి అత్యవసర సరుకుల సరఫరా కార్పొరేషన్‌ను ఏర్పాటు చేశారు.
- 1980-81 లో రాష్ట్రం ఆదాయం రూ. 5,975.08 కోట్ల నుంచి రూ. 6,915.51 కోట్లకు 15.7 శాతం పెరిగింది.
- మునిసిపల్ ప్రాంతాలన్నిటిలో గుడిసెల అగ్నిప్రమాద భీమా పథకాన్ని ప్రవేశపెట్టారు.

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖ**

**డైరెక్టరుచే ప్రకటితము**

నెం. 50

కన్నా ముఖ్యమైనది ఇంకొకటి వున్నది. మాటల సందర్భంలో రామ్‌తీర్థ అన్నాడు- నీ కళ్ళలో ఒకరకమైన తీక్షణతో కూడిన నిస్తేజత వున్నదని. అతడే వుద్దేశ్యంతో అన్నాడో తెలియదు కానీ-గాంధీ మనసులో ఆ మాటలు బాగా నాటుకొనిపోయాయి. చిన్నపిల్లవాడిని పెద్దవాళ్లు అతడికున్న ఒక మంచి గుణం చెప్పి పొగిడినప్పుడు – ఆ గుణాన్ని పిల్లవాడు ఎలా పెంపొందించుకోవటానికి ప్రయత్నిస్తాడో, గాంధీకూడా దాన్ని అలాగే పట్టుకోగలిగేడు. అది అతడికి క్లుప్తంగా మాట్లాడటం నేర్పింది. మనసులో ఎన్నెన్ని భావాలున్నా-మొహంలో అవి కనపడకుండా వుండటం దానంతట అదే అల వాటయింది. ఆ తరువాత అతడు ఎంత పెద్దవాళ్ళతో మాట్లాడినా, ఎన్ని విషమ పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వచ్చినా తొణకలేదు - చాలా మామూలుగా, అది ఒక దినచర్యలో భాగంగా తీసుకొని నిర్వర్తిస్తూ వచ్చాడు. అతడి ఈ 'క్వాలిటీ'ని అతడి ప్రత్యర్థులు తమ ఓటమిలో కూడా, గొప్ప విశేషంగా భావించేవారు.

ఒక నలభై యేళ్ళ వయసున్న వ్యక్తి గాంధీని కలుసుకున్నాడు. అతడు రామ్‌తీర్థ తరపు మనిషి. రామ్‌తీర్థ మరణం తరువాత అతడి స్థానాన్ని ఆక్రమించినవాడు. "మీ తాలూకు డబ్బు నాదగ్గరొక లక్షదాకా వుంది" అన్నాడతడు. గాంధీ తల అడ్డంగా వూపుతూ, "నాది కాదది. నేను కమీషన్ తీసుకోను" అని,...."....దానికన్నా ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పండి. ఎప్పట్నుంచో అడుగుదామనుకుంటున్నది....రామ్‌తీర్థ ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడు?"

అతడు మామూలుగా, "ఇది అందరికీ తెలిసినదే కదా. అతడిమీద వున్న నేరాలన్నీ ఋజువైతే జీవితాంతం జైల్లో వుండాల్సిందే. రామ్‌తీర్థవంటి తెలివైనవాడికి అది అసాధ్యం. అందుకే చేసుకున్నాడు."

"నిజంగా అందుకేనా?"

ఈ ప్రశ్న ఊహించక ఆవ్యక్తి తెల్లబోయేడు. చెప్పాలా వద్దా అన్నట్టు కొద్దిగా కొట్టుమిట్టులాడి, ఒక నిర్ణయానికి వచ్చినట్టు అన్నాడు. "రామ్‌తీర్థ ఆత్మహత్యకి నిజమైన కారణం ఇంకొకటి కూడా ఉన్నదని నా అనుమానం గాంధీబాబూ. అయితే ఇది నా ఒక్కడి అనుమానం మాత్రమే. మరి మీకు అదే ఎలా కలిగిందో అర్థం కావటం లేదు. అయినా చెప్తాను వినండి. రామ్‌తీర్థ ముఖ్య అనుచరుల్లో నేనొకణ్ణి. చాలాకాలం క్రితంగా రామ్‌తీర్థ ఒకరకమైన మానసిక ఘర్షణతో బాధపడ్తున్నారేమోనని నేను అనుమాన పడ్తున్నాను. అయితే ఆ ఘర్షణ ఎందువల్లో నేను ఇప్పటికీ వూహించలేకపోతున్నాను."

"నేను ఊహించగలను-" అనుకొన్నాడు గాంధీ మనసులో. అతడి వూహ నిజమయింది. ఒక తెలివైనవాడు-ఆత్మని ఎంత సంతృప్తిపర్చుదామనుకున్నా-వాదనలతో అవతలివారిని ఎంత కన్విన్స్ చేయటానికి ప్రయత్నం చేసినా—తనకి తను సమాధానం చెప్పుకోలేడు. ఆ ఘర్షణని అతడి మొహంలో చూడగలిగేడు గాంధీ. చట్టబద్ధంగానే అనేక మోసాలద్వారా డబ్బు సంపాదించేవాళ్ళని చూసి రామ్‌తీర్థ తన స్వంతమంటూ ఒక దారిని ఏర్పర్చుకున్నాడు....తన తెలివితేటల ద్వారా (చట్ట విరుద్ధంగా) డబ్బు సంపాదించటం అనేది ఆ దారి! అతడి పంథాలో వందలాది యువకులు చేరేసరికి తన పంథా సరి అయినదే అన్న నమ్మకం కల్గింది. కానీ స్ప్లిట్ పర్సనాలిటీవల్ల ఘర్షణ ఎక్కువైంది. చట్ట విరుద్ధంగా డబ్బు సంపాదించటానికి ఎక్కువ తెలివితేటలు అక్కర్లేదు. ఉండకూడదు కూడా" అనుకున్నాడు గాంధీ. రామ్‌తీర్థమీద అతడికి జాలేసింది-అయితే గాంధీ ఆలోచనల్లో కూడా చిన్న తప్పుంది. చట్టబద్ధంగా సంపాదించటంలో కూడా

ఘర్షణ వుందన్న విషయం అతడికి అప్పుడు తెలియలేదు. తరువాత తెలిసిందా అన్నది కాలమే నిర్ణయించాలి.

"మీ అయిదు శాతం డబ్బు ఏం చెయ్యమంటారు?" అన్న ప్రశ్నతో ఈ లోకం లోకి వచ్చాడు గాంధీ

"మీదగ్గర ఎంతమంది ఇంజనీర్లున్నారు?"

"దాదాపు అరవై"

"ఇక్కడికి పంద మైళ్ళ దూరంలో రామాపురం అనే పల్లె వుంది" అన్నాడు గాంధీ ... "ఆవూర్లో అతి పురాతనమైన గుడి వుంది. దాన్ని ఈలతుతోనూ బాగుచేసి, ఆ ఫలితం అనుభవించ మనండి వాళ్ళని—"

"ఇంత చిన్న పనికి వాళ్ళు వప్పుకోరు"

"ఇది చిన్న పని కాదు." నవ్వేడు గాంధీ. "చాలా విచిత్రమైన దేవాలయం నిర్మింపబడాలి ఆలయం ముందు పీఠంలో గుగ్గిలం వేయగానే వాటంతట అవే తలుపులు తెరుచుకునే ఏర్పాటుతో నిర్మించాలి ప్రొద్దున్నే సుప్రభాత వేళ పూజార్లు భక్తుల సమక్షంలో దేవాలయం చేరుకుంటారు రాత్రి వేసిన తలుపులు ప్రొద్దున్న పీఠంలో మంట వెలిగించగానే నెమ్మదిగా తెరుచుకొంటుంటే భక్తులు విభ్రాంతితో, భక్తితో చూస్తారు. ముడుపులు చెల్లిస్తారు."

"కానీ . కానీ ఇదెలా సాధ్యం?"

"పూర్వకాలం ఈజిప్టులో ఇలాంటి దేవాలయాలు వుండేవి. హిస్టరీ రిపీట్స్. గ్రీకు గణిత శాస్త్రజ్ఞుడు హీరో దీన్ని నిర్మించేడంటారు. బైదిబై మీరు ఇంజనీరా?"

"కాదు"

"నేనూ ఇంజనీరుని కాదు. కానీ యాకోవ్ పెరుల్మాన్ అనే రచయిత దీనికి చాలా సూక్ష్మమైన వివరణ ఇచ్చాడు. ఆ పుస్తకంలోదే ఈ బొమ్మ—"



అతడు బొమ్మని చూస్తూ వుండగా గాంధీ వివరించేడు, "కుండీలో వేడికి గాలి వేడెక్కి బీకరులో నీటిని క్రింది బాల్చీలోకి పోస్తుంది బాల్చీ క్రిందకి దిగుతూవుంటే వాటికి కట్టిన తాడువల్ల తలుపులు తెరుచుకుంటాయి. అయితే ఇదంతా దైవ శక్తి వల్లేనని భక్తులు ప్రణమిల్లుతారు. శక్తి వంచన లేకుండా కానుకలు సమర్పించుకొంటారు."

ప్రజలు ఇంత మూర్ఖులా? భక్తి అన్నదానికి అర్థమేలేదా"

గాంధీ నవ్వేడు. భక్తి అన్నది లేదని నేననటంలేదు. మనం కాష్ చేసుకుంటున్నది పాపభీతి. వెంకటేశ్వరుని పేరు చెప్పి మంగతాయారు మెడలో పూజారి మంగళసూత్రం కడ్తూంటే వందల మంది జనం దానికి "కళ్యాణం" అన్న పేరు పెట్టి రోజుకి వెయ్యి రూపాయలు చొప్పున చెల్లిస్తున్నారు. చాలా చట్టబద్ధంగా భక్తి ఎన్ కాష్ కాబడ్తూంది అక్కడ. అటువంటప్పుడు మనం పల్లెటూరి ప్రజల్ని మనకున్న పరిధిలో మోసం చేయటంలో తప్పులేదు"

అతడి మొహం విప్పారింది. ఈప్లాన్ ఇచ్చినందుకు చాలా థాంక్స్" అన్నాడు. ....రామ్ తీర్థ స్థానలో నేనొచ్చాను. రాగానే ఈప్లాన్ .. ఇది గానీ సక్సెస్ అవుతే....అవుతే ఏమిటీ—అయి తీరుతుంది. చెప్పండి. దీనికి ప్రతిగా మేం మీకేం చెయ్యగలం?"

గాంధీ కొద్దిసేపు మౌనంగా వుండి, "నాకో చిన్న సాయంచేస్తారా?" అని అడిగేడు.

"దాకింతసేపు ఆలోచించటం దేనికి—చెప్పండి—"

"మీ ఇంజనీర్లు తమ పేర్లూ వగైరా బైటకి రావటానికి వప్పుకుంటారా"

"నిరభ్యంతరంగా—" అన్నాడతను. "వాళ్ళందరూ మామూలుగా సమాజంలో సభ్యులుగా చెలామణి అవుతున్న వాళ్ళే."

"నేనేం చెయ్యమన్నా వాళ్లు చెయ్యాలి. అయితే ప్రతీదీ చట్టబద్ధంగానే జరుగుతుంది కాబట్టి వాళ్ళకి ఏ విధమైన భయమూ అవసరంలేదు. నాకు వాళ్ళతో ఒక రెండ్రోజులు పని వుంటుందంతే. ఆ తరువాత మళ్ళీ ఓ సంవత్సరం తర్వాత మరో రెండ్రోజులు పని వుంటుంది." చెబ్తూవుండగానే గాంధీ మనసులో ఒక అద్భుతమైన ప్లాన్‌కి రూపకల్పన జరిగిపోయింది

మామూలు మనుషులు కలలోకూడా వూహించలేనటువంటి గొప్ప వ్యూహం అది. న్యాయబద్ధమైనది.

ఆ సాయంత్రం లక్ష్మి పనినుంచి వచ్చాక ఆమెతో మాట్లాడేను. ఎంతొస్తుంది లక్ష్మి నీకు నెలకు?"

అలసిపోయిన మొహంలో నవ్వు కనిపించింది. "ఎంతొస్తుందనుకుంటున్నావ్?"

"చెప్పకూడదా ఏమిటి?"

"నీలాగా ఒక్క రోజులో అయిదువేలు సంపాదించటం—మరుసటి రోజు పోగొట్టుకోవటం కాదు, నెలకి వందొస్తుంది"

"ఆ వుద్యోగం మానెయ్ లక్ష్మి నువ్వు" తాపీగా అన్నాడు గాంధీ లక్ష్మి ఉలిక్కిపడి, అతడేమన్నా తమాషా చేస్తున్నాడేమో అని చూసింది - కానీ అతడి మొహంలో అలాంటి భావమేమీ లేదు. అతను సీరియస్‌గానే అంటున్నాడని గమనించి, వచ్చి అతడి

---

పక్కన కూర్చొంటూ "నేను వుద్యోగం మానేసి, నువ్వేమో డబ్బుమీద ఎక్స్‌పెరిమెంట్లు చేస్తూ కూర్చొంటే మనకెలా గడుస్తుంది?" అన్నది.

"ప్రయోగాలు చేసే స్థితి దాటిపోయాం. ఇక అటో ఇటో తేల్చుకోవాల్సిన సమయం వచ్చింది." అతడి మాటల్లో కనపడిన నిర్ణయంతో ఆమె విచలితురాలై "ఏంచెయ్యమంటావ్ గాంధీ నన్ను" అన్నది.

"ఇప్పట్నుంచీ నాకు మరో చెయ్యి తోడుకావాలి లక్ష్మి. నీఅంత తెలివైన మరో వ్యక్తిని ఈ సమయంలో నేను పెట్టుకోలేను. నిన్నేదో పోగుడుతున్నాననుకోకు. నీ సమయం ఇలా నెలకు వందతో వృథా అవటం నాకిష్టంలేదు - ఆ వందా నేనే ఇస్తాను. నా కింద గుమస్తాగా పనిచెయ్యి."

"గుమస్తాగానా - అబ్బే - పేరు బావోలేదు బాబూ"

అతడు చప్పున తలతిప్పి ఆమెవైపు చూసి, ఆమె నవ్వు బిగపట్టటంచూసి, తన ప్రపోజల్‌కి ఆమె వొప్పుకున్నదని గ్రహించి, సంతోషంతో, "థాంక్స్-పేరులో ఏముంది నేనిచ్చేదీ నువ్వు పుచ్చుకొనేదీ కదా—కావాలంటే పి. యస్ తీసుకో."

"పి. యస్సా? అంటే"

"పెర్సనల్ సెక్రటరీ."

ఆమె ఇక నవ్వాపుకోలేక "గంతకుతగ్గ బొంత అన్న సామెత విన్నావా ఎప్పుడైనా" అన్నది. అతడి మొహం ఎర్రబడింది. "బాస్‌తో అలా మాట్లాడకూడదు" అన్నాడు.

"సర్లే-సర్లే-కానీ నావి రెండు షరతులు" అన్నది.

"ఏమిటి ?"

"ఒకటి. ప్రతినెలా ఫస్టు తారీఖు వచ్చేసరికి నా జీతం నాకిచ్చేయాలి - అదుగోమరి అలా కోపంగా చూడకు, నా జీతం నాకు ఇచ్చెయ్యాలి. ఈ నెల వ్యాపారంలో లాస్ వచ్చింది....వగైరా వగైరా అనకూడదూ"

"రెండో షరతు ఏమిటి?"

"నేనెపుడు కావాలంటే అపుడు మానెయ్యగలగాలి. ఒకనెల నోటీసులూ, రెండు నెలల నోటీసులూ కుదరవు."

"సరే" అన్నాడు అతడు. ఆ క్షణమే అగ్రిమెంటు కుదిరిపోయింది. ఆమెకి అతడు వెంటనే చెయ్యవలసిన పనిచెప్పాడు. ఆమె అతడు చెప్పిందంతా విని—"ఇదేం పని?" అని అడిగింది. విస్మయంతో.

"మరి పి. యస్ అంటే ఇలాటిపన్లే చెయ్యవలసి వుంటుంది" అన్నాడు. ఆమె ఏదో జ్ఞాపకం వచ్చిన దాన్లా-" ఇంకో షరతు మర్చిపోయాను" అంది. 'ఏమిటి' అని అడిగాడు. "మనంచేసే పన్లు ఏ మాత్రం ఇల్లీగల్ అనిపించినా నేను వెంటనే ఉద్యోగం మానేస్తాను. నువ్వు చెప్పే చట్టం-చట్ట విరుద్ధంలాటి వాదనలు విననుూ" అతడు దానికీ వప్పుకొన్నాడు.

"ఈ పని నేను ఎన్నాళ్ళల్లో పూర్తిచేయాలి" అని అడిగిందామె.

"నెలలో చేయగలవనుకుంటాను" అన్నాడు అతడు. "—అతడు మంత్రికాబట్టి అతడి గురించి వివరాలు సేకరించటం అంత కష్టం కాదనుకుంటాను."

# 14

నాగభూషణరావు అసలు పేరు నాగులు. అతడిది నెల్లూరు. పదిహేనో ఏడు వచ్చేసరికే పేటలో పెద్ద రౌడీగా మారేడు. తల్లీ తండ్రీలేరు. రాధా రాణి కేసు నిందితుల్లో




ఒకడు. అదృష్టవశాత్తు శిక్ష పడలేదు. ఇరవయ్యవఏట కొత్త బిజినెస్ మొదలు పెట్టేడు

మోటర్ సైకిల్ మీద ప్రొద్దున్నే మెయిన్ రోడ్డు పక్కనున్న కూరగాయల మార్కెట్‌కి వెళ్ళటం-ఫుట్‌పాత్ మీద కూరగాయలు అమ్ముకునేవాళ్ళకి తొంభై రూపాయలు అప్పు పెట్టటం-సాయంత్రం వెళ్ళి వంద రూపాయలు వసూలు చెయ్యటం. ఇలాంటి వ్యాపారం... తాగుడికి అలవాటు పడిన కూరగాయల వాళ్ళు ఇతడి వలలో చాలా సులభంగా చిక్కుకున్నారు. ఒకరిద్దరు ఎగగొట్టినవాళ్ళు కాళ్ళూ చేతులు విరగకొట్టుకున్నారు. మొత్తం వున్నది యాభై మందిదాకా కూరగాయలవాళ్లు - సాయంత్రానికల్లా అయిదు వందలు వచ్చేది. నెలకి పదిహేనువేలు. నాల్గు నెల్లో కారుకొన్నాడు. ఇంకో ఇద్దరు ముగ్గురు రౌడీలను చేరదీసేడు.

బాంకులు జాతీయం చేయబడ్డాక కూడా ఫుట్‌పాత్ గాళ్ళని పట్టించుకొన్న వాళ్లు లేరు. (ఇప్పటికీ ఈ వ్యాపారం ఇలానే సాగిపోతూంది)

సంవత్సరం తిరిగేసరికల్లా బిల్డింగ్ కట్టేడు. ఇతడి వ్యాపారాన్ని చూసి ఒకరిద్దరు పోటీకి రాబోయారు. కానీ డబ్బుతో వాళ్ళని కొనేసేడు. అదే సమయంలో ఇంగ్లీషు దేశంనుంచి కొత్త రికార్డులు వచ్చినయ్. "లవ్ ఓ బేబీ" - "సెక్స్ మ్యూజిక్" ఇలాంటివి. రకరకాల పడకటింటి మూలుగులూ వగైరా వాటిని తెలుగులో గ్రామ్‌ఫోన్ రికార్డులుగా విడుదల చేసేడు. లక్షల్లోలాభం వచ్చింది. హైద్రాబాద్ మకాం మార్చేడు. కాంట్రాక్టులు

చేపట్టాడు. విపరీతంగా డొనేషన్లు అవీ ఇచ్చి పేరు సంపాదించాడు. దాన్ని పెట్టుబడిగా పెట్టి ఎమ్మెల్యే అయ్యేడు. గవర్నమెంటు మారింది. కొత్తపార్టీ వచ్చింది. చాలామంది అందులో చేరి పోయారు. కానీ ఆ ప్రభుత్వం తాత్కాలికంగానే వుంటుందని గ్రహించి పూర్వం దానిలోనే వుండిపోయాడు. తిరిగి పూర్వపు ప్రభుత్వం అధికారంలోకి వచ్చేసరికి మంత్రి అయ్యాడు.

గాంధీ చదవటం పూర్తిచేసి లక్ష్మివంక అభినందన పూర్వకంగా చూసి, "చాలా సమాచారం సేకరించేవే" అన్నాడు. ఆమె తేలిగ్గా నవ్వి "మంత్రి కదా. సులభంగానే దొరికింది" అంది.

"మంత్రులు ఎంత హీన చరితులో చూసేవా"

"ప్రజాస్వామ్యం కదా"

ఇద్దరూ ఓ క్షణం మవునంగా వున్నారు. గాంధీ ఆ కాగితాన్ని జేబులో పెట్టుకుంటూ "ఇంకోపని చెయ్యాలి నువ్వు" అన్నాడు. ఏమిటంది.

"రాజా రామ్మోహనరావ్ తాలూకు వివరాలు కావాలి."

"అమ్మో" అంది లక్ష్మి ..."ఇతనంటే పబ్లిక్ మనిషి కాబట్టి వివరాలు తొందరగా దొరికేయి. ఆయన గురించి అయితే కష్టం"

"ఆయన గురించి ఇలాటి వివరాలు అనవసరం" అన్నాడు గాంధీ. "ఆయన డబ్బులో పుట్టి డబ్బులో పెరిగాడు. ఆ విషయం నాకు తెలుసు నాకు కావల్సిందల్లా ఆయన బిజినెస్సు వివరాలు—పేర్లు-ఎక్కడెక్కడ ఎంత వుంది-వగైరా"

"చాలా కష్టం"

"అందుకే గదా నిన్ను సెక్రటరీగా పెట్టుకున్నది"

"అయితే బాస్"

"....చెప్పు" అన్నాడు. ఆమె చాలా సీరియస్‌గా అంది "లక్ష్మి అనే అమ్మాయి, పని బాగా చేస్తున్నదని నా కనిపిస్తుంది. ఆమెకి ఓ పదిరూపాయలు ఇంక్రిమెంట్ ఇస్తే ఎలావుంటుంది? అహా-ఈ సలహా-ఓ పెర్సనల్ సెక్రటరీగా ఇస్తున్నాను"

"బానే వుంటుంది. అలానే ఇద్దాం. నేను గాంధీగా నీకు ఓ సలహా ఇద్దామనుకుంటున్నాను"

"ఏమిటి"

"ఎప్పుడూ మీ బాస్‌కి ఇలాటి సలహా లివ్వకు"

ఆమె నవ్వేసి అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. అతడి మొహంలో నవ్వు క్రమంగా మాయమైంది. జేబులో కాగితాన్ని తడిమి చూసుకున్నాడు, అతడి కళ్ళముందో దృశ్యం కదలాడింది. చెళ్ళుమన్న శబ్దంతో అతను వెళ్ళి పూలకుండీల పక్కన పడ్డాడు. రామ్మోహనరావ్ అతడివైపు కోపంగా చూస్తున్నాడు.

అదే దృశ్యం. మాటి మాటికీ.

తీర్చుకోవాలి .. స్వీట్ రివెంజి-

అల్లుడు కాబోయే ముందు-ఆ అల్లుడు ఎలాటివాడో రుచి చూపించి-అప్పుడవ్వాలి. రివెంజ్ అంటే మామూలు పగ కాదు. కోటీశ్వరుని స్థానం నుంచి కట్టు బట్టల్లోకి దింపి—అప్పుడు కన్యాశుల్కం కింద యాభై లక్షలు బహుమతి ఇవ్వాలి. గాంధీ లెవెల్లో పగ అంటే అలానే వుంటుంది మరి. (ఇంకా వుంది)





ఎవరి ప్రభావానికీ లొంగకుండా, ప్రతిదీ ఆలోచించి, మంచి చెడ్డలు నిర్ణయించుకో గలిగే పిల్లలు కొందరయితే, తల్లి దండ్రుల భయంతో కోరికలను అణుచుకుని గుట్టుగా చదువు పూర్తిచేసే పిల్లలు కొందరు తామేమిటో, తమ కర్తవ్యమేమిటో ఆలోచించ కుండా ప్రవర్తించి బాధపడేవాళ్ళు, కేవలం స్నేహితుల ప్రభావానికి లోనయ్యి ముందు వెనుకలు ఆలోచించకుండా బాధపడే వాళ్ళు కొందరు - అటువంటి వాళ్ళల్లో నేనూ ఒకర్తినని చెప్పుకోవచ్చును

మాది ఆడపిల్లల స్కూలు. స్కూలులో చేరగానే నేను క్లాసుకి వెళ్ళి జ్యోతి అనే అమ్మాయి పక్కన కూర్చున్నాను. జ్యోతి క్లాసందరిలో చాలా అందమయిన అమ్మాయి. భయమనేది లేకుండ టీచర్లందరితో ఎంతో ధైర్యంగా మాట్లాడేది. జ్యోతి పక్కన కూర్చున్న వేళా విశేషమేమిటో




కాని, నాలుగయిదు నెలలలోనే ప్రాణ స్నేహితులమయి పోయాము. సాయంత్రం స్కూలు అయిపోయాక నేను నడిచి, ఆమె బస్సులోనూ యింటికి వెళ్ళేవాళ్ళం.

మా స్కూలు బస్‌స్టాండ్‌కి ఫర్లాంగు దూరంలో వుండేది. ఒక రోజు బస్‌స్టాండ్‌కి వెళ్ళేటప్పుడు యిద్దరబ్బాయిలు తన వెంట పడుతున్నారని చెప్పింది. రోజూ వాళ్ళు అన్న మాటలన్నీ నాతో చెప్పేది. వినటానికి నాకూ ఎంతో సరదాగా వుండేది. ఒకనాడు ఆ అబ్బాయిలలో ఒక అబ్బాయి తనకి ఉత్తరం రాశాడనీ చూపించింది. ఆమె అందాన్ని పొగుడుతూ జ్యోతి వివరాలన్నీ తెలుపమని రాశాడు.

వెంటనే జ్యోతి తన పేరు క్లాసూ అన్నీ తెలియజేస్తూ తాను కూడా అతనిని ప్రేమిస్తున్నట్లు రాసింది. సాయంత్రం ఆ వుత్తరం అతనికి అందిచ్చింది. క్రమంగా జ్యోతి రోజూ అతని దగ్గరనుంచీ ఉత్తరాలూ, చిన్న చిన్న బహుమతులు అందుకోవడం మొదలు పెట్టింది.

అందరూ జ్యోతి చేసేది గొప్పపని అయినట్లు ఆమెకి సలహాలు యిస్తుంటే నేను కూడా ఆమె ప్రభావానికి లోనయ్యాను. అందుకే మర్నాడు జ్యోతి ఆ అబ్బాయికి ఉత్తరం రాస్తుంటే అతని స్నేహితుడికి నేను ఎంతో యిష్టపడుతున్నట్టుగా రాయమన్నాను. ఆ మరునాడు జ్యోతికి అతను రెండు ఉత్తరాలు అందిచ్చాడు. రెండో ఉత్తరం నాకు. ఆ అబ్బాయి పేరు ఆనంద్ అనీ తను కూడా నన్ను ప్రేమిస్తున్నాననీ రాశాడు. అలా మొదలయింది మా ప్రేమాయణం. క్రమంగా నేనుకూడా రోజూ అతని దగ్గరనుంచి ఉత్తరాలు అందుకోవడం వెంటనే జవాబు రాసి యివ్వడం మొదలుపెట్టాను. జ్యోతి మధ్య మధ్య స్కూలు ఎగ్గొట్టి ఆ అబ్బాయితో సినిమాలు షికార్లు మొదలుపెట్టింది.

నేను రోడ్డుమీద ఎవరితోనో మాట్లాడుతున్నట్టు మా అన్నయ్య ఒక రోజు స్వయంగా చూశాడు.

ఒక రోజు జ్యోతి స్కూలుకి రాలేదు.

'పాప'

## ద్వంద్వాలు

కళ్ళు గట్టిగా మూసుకో
మూసుకొని చూడు!
నీకు ఓ భూగోళం అగుపడుతుంది
వెన్నలాటి అంగాలకు
ఇంద్ర ధనుస్సుల చుట్టుకొని
కళ్ళు తెరూ,
సూర్యోదయానికి ఆకాశం
ఒళ్ళు విరుచుకొన్నట్టు
అపుడు చూడు
దృశ్యాల్ని కళ్ళ అంచుల్లోకి
చొప్పించి
నీకు రెండు భూగోళాలు
అగుపడతవి
ఒకటి
సంపెంగల పహారాలో
సరిగమల్ని మేస్తూ—
మరోటి
మంటలై లేచిన మట్టి పిడికిళ్ళమధ్య
మార్మోగే సవాళ్ళు విసురుతూ—

నమ్మి

ఆ సాయంత్రం మా యింటికి వచ్చింది. తనూ ఆ అబ్బాయీ సినిమా చూస్తుండగా వాళ్ళ నాన్నగారు చూశారనీ, యింక అతను యిల్లు విడిచి బయటకి అడుగుపెట్టడానికి వీల్లేదన్నారని చెప్పింది. అంతే. జ్యోతి నాకు మళ్ళీ కనిపించలేదు. కొన్ని రోజులకి ఆమెకి వాళ్ళ బావతో పెళ్ళయినట్టు తెలిసింది.

ఆరోజే అన్నయ్య నేను రోడ్డుమీద ఎవరితోనో మాట్లాడుతున్నట్లుగా అమ్మతో చెప్పాడు. ఆ రోజు రాత్రి అమ్మ అందరూ పడుకున్నాక నన్ను పైకి పిల్చి అన్నయ్య అన్న మాటలకి, నా సమాధాన మేమిటి అంది. తెల్లబోయిన నేను యిదంతా అబద్ధమనీ, నేను ఏ పాపమూ ఎరగననీ ఒట్టు పెట్టాను. అమ్మ ఆ రోజు మంచి ప్రవర్తన గురించి, నడవడి గురించీ ఎన్నో మంచి మాటలు చెప్పింది. ఆడవాళ్ళ విచ్చలవిడి ప్రవర్తన వల్ల కుటుంబానికి ఎంతో చెడ్డ పేరు వస్తుందో చెప్పింది. ఈ కుటుంబానికి చెడ్డపేరు తెచ్చే పని నీవు చేయవని నేను నమ్ముతున్నాను అని క్రిందకి వెళ్ళిపోయింది. జ్యోతిని ఆదర్శంగా అనుకుని ఉత్తరాలురాసిన నేను ఎటువంటి పరిస్థితులలో చిక్కుకున్నానో తెలుసుకున్నాను. అమ్మ మాటలతో, జ్యోతి నన్ను వదిలి వెళ్ళిపోవడంతో నేనేమిటో నాకు తెలిసి వచ్చింది. నా కర్తవ్యమేమిటో నాకు అర్థమయింది. ఉత్తరాలన్నీ చింపి పారేశాను. యింక ఆనంద్‌కి ఉత్తరాలు రాయకూడదని నిశ్చయించుకున్నాను.

జ్యోతి వెళ్ళిపోయాక క్లాసులో వాతావరణం మారింది. నా ప్రేమ లేఖల వ్యవహారం తెలిసిన పిల్లలంతా ఆనంద్ పేరుతో నన్ను అస్తమానము ఏడిపిస్తూ వుండేవారు. స్కూలు వదిలేసరికి ఆనంద్ అతని స్నేహితుడూ గేటుదగ్గర ప్రత్యక్షమై రకరకాల మాటలతో నన్ను బాధపెడుతూ జవాబు రాయమని వేధిస్తూ బస్‌స్టాండ్ వరకు వచ్చేవారు. వాళ్ళు అందిచ్చిన ఉత్తరాలు తీసుకునేదాన్ని కాదు. కోపంతో వాళ్ళు యిదివరకు రాసిన ఉత్తరాలలోని "డైలాగ్స్" అన్నీ చదువుతూ వెనకాలే వచ్చేవారు.

ఒక నెల రోజులు నిజంగా వాళ్ళతో చాలా బాధ పడ్డాను.

ఒక రోజు నేనూ చెల్లెళ్లు మార్కెట్టుకి వెడుతూండగా వాళ్ళు యిద్దరూ వచ్చి, మొదట ఉత్తరం రాసి హారంభి

మొదలుపెట్టినదానివి నీవు. యిప్పుడు జవాబెందుకు రాయవని నిలదీశారు. జవాబు రాయకపోతే నేను రాసిన ఉత్తరాలన్నీ నాన్నగారికి అందజేస్తామని బెదిరించారు. చిన్నవాళ్ళయిన చెల్లెళ్ళు నిన్నెందుకు అలా అంటున్నారని అడిగారు వాళ్ళేదో చెప్పి నచ్చచెప్పాను. ఈ సంగతి అమ్మతో అంటారేమో అని భయంతో చచ్చిపోయాను. కాని వాళ్ళు ఈ సంగతి మర్చిపోయారు.

ఆరాత్రి నేను కూర్చుని ఒక సుదీర్ఘమైన ఉత్తరం రాశాను. వాళ్ళిద్దరినీ అన్నయ్యలూ అంటూ సంబోధించి అన్ని సంగతులూ వివరంగా రాశాను—నా స్నేహితురాలు జ్యోతి గురించి, ఆమెలాగే నాకూ నలుగురిలో గుర్తింపు రావాలన్న కోరికతో కేవలం స్నేహితుల ముందు గొప్ప కోసం ఈ ఉత్తరాలు మొదలు పెట్టానని రాశాను. కాని నిజంగా వాళ్ళతో కలిసి తిరగాలన్న కోరిక నాకు లేదనీ, అసలు ప్రేమ గురించి నాకు ఏ విధమైన అభిప్రాయం లేదనీ రాశాను. కేవలం సరదాకి రాసిన ఆ ఉత్తరాలకి నన్ను క్షమించి నా జోలికి రావద్దని వేడుకున్నాను. నా తప్పుని అసాధారణంగా వాళ్ళు కావలిస్తే డబ్బు యిస్తానన్నాను — వాళ్ళు మళ్ళీ నా వెంటపడినా, ఒక్క మాట మాట్లాడినా, ఉత్తరాలు ఎవరికయినా అందజేసినా ఆత్మహత్య చేసుకుని చచ్చిపోతానని బెదిరించాను. మీ చెల్లెలు తెలియక యిలాంటి తప్పుచేస్తే క్షమించరా? అని ప్రశ్నించాను. ఆ మరునాడు ఉత్తరం వాళ్ళకి అందించాను. ఆ రోజు సాయంత్రం స్కూలు దగ్గర వాళ్ళెక్కడ కన్పిస్తారో అని భయపడ్డాను. వాళ్ళు రాలేదు, అంతేకాదు ఆ రోజు నుంచి వాళ్ళు నన్నెపుడూ వేధించలేదు. ఎప్పుడయినా కనబడినా చూడనట్లు వెళ్ళిపోయేవారు.

ఆ సంవత్సరం పదవ క్లాసు ఫేలయ్యాను. అమ్మ నాన్నగారు నన్ను ఏమీ అనలేదు, నా తప్పు నేను తెలుసుకున్నాను.

రెండో సంవత్సరం టెన్త్ బాగా చదివి పాసయ్యాను. అప్పటినుంచి బి. ఎ. పాస్ అయ్యేవరకు ఏ పరీక్ష తప్పలేదు. ఏ పని చేసినా దాని మంచి చెడ్డలు ఆలోచించి నిర్ణయం తీసుకోవడం అలవాటయ్యింది నాకు. యిప్పటికి తెలిసీ తెలియని వయస్సులో పిల్లలు ప్రేమను గురించి మాట్లాడితే నవ్వు వస్తుంది నాకు. ✻

# బొద్దింకలు

## వసుంధర

"ఏమండీ! బజార్లోకి ఏదో మంచి బొద్దింకల మందు వచ్చిందట. రుక్మిణి చెప్పింది" అంది జయ.

మా ఇంట్లో బొద్దింకల బాధ చాలా ఎక్కువగా ఉంది రాత్రయ్యేసరికి ఇంట్లో మూల మూలల నుంచి వచ్చి బాత్రూంలోనూ, వంటింట్లోనూ సంచారం ప్రారంభిస్తాయి. వీటివల్ల మాకు రకరకాల ఇబ్బందులున్నాయి.

బొద్దింకలు అదోరకం వాసన వేస్తాయి. ఆ వాసన అంటే ఇష్టముండక పోవచ్చు కానీ మా ఇంట్లో అందరికీ ప్రత్యేకమైన ఎలర్జీ కూడా. తర్వాత రాత్రిళ్ళు బాత్రూంలోకి వెళ్లాలంటే చాలా ఇబ్బంది. ఒక్కోసారి అవి కాళ్ళ క్రిందపడి నలిగి చస్తూంటాయి మా మనసుకు కలిగే బాధసంగతి అటుంచితే రాత్రిపూట కాళ్ళూ అవీ కడుక్కోవడం, నిద్ర తేలిపోవడం జరుగుతూంటుంది. అదీ కాక కాళ్ళకింద ఓ ప్రాణి నలిగి చస్తున్నదంటే మీ అందరికీ కూడా వళ్ళు జలదరించి పోతుంది. మా పిల్లల సంగతైతే వేరే చెప్పక్కర్లేదు. ఇద్దరికీ కూడా అవంటే చచ్చేటంత భయం. ఒక రాత్రివేళ వాళ్ళు లేవారంటే-కేవలం బొద్దింకల కారణంగా వాళ్ళతోపాటు మేమూ లేవాల్సి ఉంటుంది. బొద్దింకలు అన్నం మీద పాకినా, నేతి గిన్నెలో దూరినా చాలా అసహ్యం వేస్తుంది. ఆ పదార్థాలింక అవతల పారేయాల్సిందే!

ఇంత వరకూ బొద్దింకల గురించి మేము ఏమందూ వాడలేదు. శుచి, శుభ్రత లేనిచోట అవి చేరతాయని విని ఇల్లంతా ఎంతో శుభ్రంగా ఉంచే వాళ్ళం. ఫినాయిల్‌తో కడిగించే వాళ్ళం. కానీ బొద్దింకలు మా ఇంట్లో చేరనే చేరాయి. దిన దినాభివృద్ధి చెందుతున్నాయి.

"బాగా పని చేస్తోందిటా?" అని అడిగాను.

"ఒక్క రాత్రిలో మొత్తం అన్నీ చచ్చిపోతాయిట" అంది జయ.

"సరేలే-ఈవేళ కొందాం-" అన్నాను జయతో. ఆ రోజు మాకు సెలవురోజు. ఒక వారం రోజుల్లో మకు ప్రయాణం ఉన్నది. అందుకు గాను స్టేషన్‌కు రిజర్వు చేయించుకోవాలి. ఇదొక పెద్దబోరు.

రిజర్వేషన్ చేయించడానికి స్టేషన్‌కి వెళ్ళి క్యూలో నిలబడితే అక్కడ గంటకు ఒక మనిషి చొప్పున బయటకు రాగల్గుతారు. అందుకు అనేక కారణాలున్నాయి. కొంతమంది పలుకుబడి గలవాళ్లు కౌంటర్ గదిలోకి వెళ్ళి తమ పనులు చేయించుకుంటారు. ఈ పనులు కూడా బయట క్యూ ఉండగానే జరుగుతాయి, అయినా ఎవ్వరూ మాట్లాడరు. ఎదురు చెప్పరు. ఎదురు చెబితే రిజర్వేషన్ లేదు, అనేస్తారని భయం. మరో కారణం



ఏమిటంటే క్లర్కుల నెమ్మదిగా పనిచేయడం వల్ల జనానికి కూడా అంత భయం పట్టుకుని ఏజంట్ల ద్వారా పని చేయించు కుంటారు. సమయానుకూలంగా ఈ ఏజంట్లు టికెట్‌కు అయిదు రూపాయల నుంచి ఎంత వరకైనా పుచ్చుకుంటారు.

ఇవన్నీ సామాన్య జనానికి తెలుసు. అయితే ఎవరి పనుల్లో వారే తలమునకలై పోతున్న కారణాన ఎవ్వరూ వీటి గురించి ఫిర్యాదు చేయరు, పట్టించుకోరు. ఈ అవినీతి ఇలాగే కొనసాగుతూ ఉంటుంది.

ఆరోజు నేను కాస్త పెందరాళే వెళ్ళాను. లైన్లో నా నంబరు మూడు. పన్నెండు గంటలకు క్యూలో నిలబడితే సుమారు, రెండు గంటలకు నాకు అవకాశం వచ్చింది. నేను వెళ్ళి లైన్లో నించున్నాక నా కళ్ళ ముందే కౌంటర్లోపల ముగ్గురికి రిజర్వేషన్ పని అయింది. ఆ పనేదో కౌంటర్ మూసేశాక చూసుకోవచ్చుగా-క్యూలో నించున్న వాళ్ళకులాగే అన్నీ వాళ్ళకు అప్పుడే పూర్తిచేసి ఇస్తున్నాడా క్లర్కు. నేను మూడు గంటలకు అక్కణ్ణించి బయట పడ్డాను. ఆ క్షణంలో నాగొంతు దాహంతోనూ, మనసు కోపంతోనూ, వళ్ళు ఆవేశంతోనూ, మండిపోతున్నాయి. ఇంటికి వెళ్ళగానే జయ-"టికెట్లు దొరికాయా-" అనడిగింది.

"దొరికాయి-" అన్నాను.

"అమ్మయ్య-" అంది జయ.

నేను జయపై విరుచుకు పడ్డాను-"నువ్వు అమ్మయ్య అన్న ఒక్క ముక్కలో ఆనందాన్ని వ్యక్తపరిచావు. కానీ ఈ టికెట్లు గురించి చెయ్యండేటంత దూరంలో కౌంటర్ దగ్గర మూడుగంటలసేపు నిలబడ్డాను" అన్నాను.

"నేనేం చేయనండీ"-అంది జయ.

నేనింకా రెచ్చిపోయి ఇంకా ఏవేవో అన్నాను. కాసేపటికి నాకోపం, ఆవేశం చల్లారాయి. జయ ఇచ్చిన చల్లని నీళ్లతో దాహం కూడా తీరింది.

"ఏమీ అనుకోకు—ఇందాకా కోపంలో ఏవో అన్నాను"-అన్నాను జయతో.

"బాగానే ఉంది. ఆకోపంలో పదోవంతు ఆ క్లర్కు మీద చూపించి ఉంటే ఈ అవినీతికి అంతం ఉండేదేమో-" అంది జయ.

జయ నన్ను దెబ్బ కొట్టిందని గ్రహించాను. అవును-నేను జయతో దెబ్బలాడటమెందుకు? ఇందులో ఆమె చేసిన తప్పేముంది? అసలు తప్పు చేసిన వాళ్లను ఏమీ అనలేక పోతున్నానేం? నా అవసరం నన్ను అవినీతికి తలవంచేలా చేసిందా?

నాకు తెలుసు—ఒకప్పటి సంగతి ఏమో కానీ క్యూలో నించున్న వాళ్ళ కోపానికి ఇప్పటి క్లర్కులు ఏ మాత్రమూ చలించరు. క్లర్కులు అవినీతికి పాల్పడుతున్నారని-అది అరికట్టడం కోసం ప్రభుత్వం ఇప్పుడు కొన్ని కొత్త ట్రయిన్స్ వేసింది. వాటిలో అన్నీ సెకండ్ క్లాసే! ప్రతి స్టేషన్‌కూ చాలా ఎక్కువ మొత్తం కోటా ఉంటోంది. అందువల్ల బెర్తులు దొరక్క పోవడం ప్రసక్తి లేనే లేదు. ఎటొచ్చి ఓపిగ్గా క్యూలో నించోవాలి. ఈ కొత్త ట్రయిన్స్ అవినీతిని బాగానే అరికడుతున్నాయి. ఐనా శతకోటి దరిద్రాలకు అనంత కోటి ఉపాయాలు.

ఆ సాయంత్రం నేనూ, జయా బజారుకి వెళ్ళినప్పుడు మరిచి పోకుండా బొద్దింకల మందు కొన్నాం. ఆ మందును చూస్తే అన్ని బొద్దింకలను చంపగలదని అనిపించలేదు. కానీ ఖరీదట్టే లేదు కాబట్టి ధైర్యం చేసి కొన్నాము.

రాత్రి ఒక్క పడక గదిలో తప్ప—మిగతా అన్ని గదుల్లోనూ ఆ మందు ఉంచాం. ఒక చిన్న ప్లేట్లో ఆ మందుపోసి గదిలో మూల పెట్టి తలుపులన్నీ బంధించి వేయడం ఒక్కటే మేము చేసిన పని. మర్నాడు తెల్లవారి లేచేసరికి ఇంట్లో వేలాది వేలుగా బొద్దింకలు చచ్చిపడి ఉన్నాయి. మా ఇంట్లో అన్నివేల బొద్దింకలున్నాయని నేను కానీ శ్రీమతి కానీ అనుకోలేదు. వాటిని అలా చూసేక మేము షాక్ తిని చాలా సేపటివరకూ ఆ షాక్‌లోనే ఉండి పోయాం. ఇల్లంతా బొద్దింకల రణరంగంలా ఉంది. పిల్లలు కూడా వాటిని చూసి చాలా కంగారు పడిపోయారు.

పని మనిషి రాగానే ఆ బొద్దింకలన్నిటినీ తుడిపించి అవతల పారేయించాం. తర్వాత




ఇల్లంతా శుభ్రంగా కడిగించాం. ఇన్ని బొద్దింకలను చంపడానికి మేము కొన్న మందులో ఆరోవంతు కూడా ఖర్చు కాలేదు. అందువల్ల ఉత్సాహంగా రెండో రోజు కూడా ఆ మందు పెట్టాం. ఈ సారి కూడా చాలా బొద్దింకలు చచ్చాయి. అయితే ఆ సంఖ్య వేల నుంచి వందలకు మారింది.

నాలుగు రోజుల్లో మా ఇంటో బొద్దింక లన్నవి లేకుండా పోయాయి.

"ఈ పని ఎప్పుడో చేయాల్సింది-" అంది జయ.

బొద్దింకలు లేని మా ఇంట్లో ఎక్కువ రాత్రులు గడపకుండానే మా ప్రయాణం వచ్చేసింది. రిజర్వేషన్ దొరికింది కాబట్టి ప్రయాణం హాయిగా జరిగింది.

అమ్మ, నాన్న మమ్మల్ని ఆప్యాయంగా పలకరించారు. ఉద్యోగరీత్యా దూర ప్రాంతాన ఉంటున్నప్పటికీ కుటుంబానికి సంబంధించి నాకు చాలా బాధ్యతలున్నాయి. పొలానికీ, స్వంత ఇంటికీ సంబంధించిన కొన్ని లావాదేవీల కారణంగా నా తిరుగు ప్రయాణానికో తేదీ అంటూ నిర్ణయించడం కష్టమైంది. ఈ లావాదేవీలను చూసుకోవడంలో నేను ఎంతో అవినీతిని చూశాను. లంచ మివ్వకుండా, పలుకుబడి ఉపయోగించకుండా చిన్నపని కూడా జరగడం లేదు. అవసరమైనప్పుడల్లా ఇవ్వగలిగిన లంచ మిస్తూ, దొరికిన పలుకుబడి ఉపయోగిస్తూనే నేను ఈ విషయం గురించి తీవ్రంగా ఆలోచించ సాగాను.

దేశంలో ఇంత అవినీతి ఎలా ఏర్పడింది? ప్రభుత్వం ఈ అవినీతిని గుర్తించి-దీనిని అదుపు చేయడానికి ఎన్నో పథకాలు రూపొందించింది. కానీ అవినీతి పరులు అవన్నీ అధిగమించి మనగలుగుతున్నారు. ఈ అవినీతికి అంతంలేదా? దీన్నెవ్వరూ ఆపలేరా?

పల్లెటూళ్ళలో పన్నులు, బ్యాంకులిచ్చే ఋణాలు, ప్రభుత్వపు అభివృద్ధి పథకాలు- అన్నీ అవినీతి పరుల చేతిలోపడి శక్తిహీనమై పోతున్నాయి. సామాన్యులకుపయోగ పడకుండా పోతున్నాయి.

నేను సెలవు పొడిగించాను. తిరుగు ప్రయాణానికి తేదీ నిర్ణయమయింది కానీ- రిజర్వేషన్ దొరకలేదు. ట్రయిన్ దగ్గర ప్రయత్నించవచ్చునని సలహా ఇచ్చారు చాలామంది. అలాంటివి నాకు భయం-కానీ ఈసారికి తప్పలేదు.

నేను, జయ, ఇద్దరుపిల్లలు ప్లాట్‌ఫారం మీద నిలబడితే నా తమ్ముడు నాకు అస రాగా వచ్చాడు. ఇలాంటి రిజర్వేషన్సు స పాదించడంలో వాడు ఎక్స్‌పర్ట్!

ట్రయిన్ రాగానే ముందుగా నేను కండక్టర్ దగ్గరకు వెళ్ళాను. ఆయన ఏమీ లాభం లేదని చెప్పాడు. నేను నిరుత్సాహ పోయాను. మరో రెండు నిముషాల్లో తమ్ముడు అదే కండక్టరుతో సంప్రదించి—"త్వరగా ఎక్కండి టైమైపోతోంది—" అంటూ నన్ను హెచ్చరించాడు.

నేను తట పటాయించాను—ఆ కండక్టర్ మధ్యలో దింపేస్తాడేమోనని నా భయం.

"ఊఁ....ఎక్కండి—ట్రెయిన్ కదుల్తోంది కూడాను" అన్నాడు కండక్టర్.

నేను ఆశ్చర్యపడ్డానికూడా సమయం లేకపోయింది. గబగబా అంతా ఎక్కేశాం. బెర్తుకి పదిరూపాయలు ఎక్స్‌ట్రా ఇవ్వమని చెప్పి వెళ్ళిపోయాడు తమ్ముడు. ట్రెయిన్ కదిలాక కండక్టర్ మాదగ్గరకు వచ్చాడు.

నాకు అంతరాత్మ ఉన్నది కానీ దాని వల్ల నాకు గానీ దేశానికి గానీ ఏవిధమైన ప్రయోజనమూ లేదు. ఇటువంటి సందర్భాలు వచ్చినపుడు అది గొణుక్కుంటుంది కానీ నేను లెక్కచేయను.

"మీరు నాకు ఇచ్చేది పదిరూపాయలైనా అందువల్ల మీకు నష్టం నాలుగు రూపాయలలోపే" అన్నాడు కండక్టర్.

"అదెలా?" అన్నాను.

"మీకు రసీదు ఇవ్వను. బండంతా ఖాళీగా ఉంది. ఇష్టం వచ్చిన చోట పడుకోండి—" అన్నాడు.

"ఎవరైనా చెకింగ్‌కు వస్తే?"—అదీ నా భయం.

"అదంతా నేను చూసుకుంటాను...."

"చివరి వరకూ మీరు రారు గదా"—అదీ నా అనుమానం.

"నా మనిషికి మిమ్మల్ని అప్పజెబుతాను. మీకే ఇబ్బంది ఉండదు—"

నాకు భయం వేసింది. ఇలాంటి ప్రయాణాలు చేయాలంటే నా ప్రాణాలు గుప్పిట్లో ఉంటాయి. అదే చెప్పాను.

"అయితే మీ ఇష్టం. మరో ఆరుం పావలా దండగ పెట్టుకోండి"—అన్నాడు కండక్టర్.

ప్రభుత్వానికి న్యాయంగా చేరవలసిన ఆ ఆరుం పావలానూ అతడు దండుగ అనడం నాకు ఎంతో బాధ అనిపించింది. కానీ నేనా దండుగ పెట్టుకుంటాననే అన్నాను.

కండక్టర్ నవ్వి—"ఈయన్ని చూడండి. ఈయనకు టికెట్టే లేదు. భద్రంగా చేరవలసినచోట దింపుతానని మాట ఇచ్చాను"—అన్నాడు తన సామర్థ్యాన్ని విశ్వసించని నాకో ఉదాహరణ చూపిస్తూ,

ఈసారి నేను బాగా భయపడ్డాను. ఇటువంటి వాటి గురించి వినడమే కానీ చూడ్డం తక్కువ.

"ప్రభుత్వం బెర్తుల కోటా పెంచింది. మా ఆదాయం తగ్గింది. అందుకని మేము ఎన్నికన్న కొత్తదారి ఇది"—అన్నాడు. కండక్టర్.

ప్రభుత్వం కొత్త ట్రయిన్స్ వేస్తోంది. బెర్తుల కోటా పెంచుతోంది. చెకింగ్ స్క్వాడ్స్‌ను నియమిస్తోంది—కానీ కండక్టర్ వీటికి చలించడం లేదు.

నేను మాత్రం బెర్తులకు రసీదు తీసుకున్నాను.

మేము ఇల్లు చేరేసరికి ఈ నెలా పదిహేను రోజుల వ్యవధిలోనూ బొద్దింకలు మాఇంట్లో మళ్ళీ చేరాయి. జయ చాలా విసుక్కుంది. కానీ ఉపాయం ఉండనే ఉందిగా! మళ్ళీ మందు కొన్నాము.

ఈ సారి మందుకు బొద్దింకలు ఎక్కువ సంఖ్యలో చావలేదు. మా బొద్దింకల సమస్యను మందు పూర్తిగా తీర్చ లేకపోయింది.

ఐదు నెలల తర్వాత బొద్దింకలు మేము పెట్టిన మందును తృప్తిగా భోంచేస్తూ కన్పించాయి. ఈ విషయం నాకు

చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది ఒకప్పుడు ప్రాణాంతకంగా ఉండే ఆ మందును అవి ఆహారంగా ఎలా చేసుకోగలిగాయి?

నా స్నేహితుడు రాఘవరావు సైంటిస్ట్. ఈ విషయం చెప్పగా అతను నవ్వి- 'బొద్దింక చాలా బలమైన ప్రాణి. ఎంతటి విపత్కర పరిస్థితికైనా అది కాలక్రమేణా తట్టుకుని మనగల్గుతుంది. ప్రతి విషానికీ అది రెసిస్టెన్సు — అనగా నిరోధక శక్తిని క్రమంగా సంపాదించుకోగల్గుతుంది. ఈ ప్రపంచం అణ్వస్త్రాల కారణంగా సర్వనాశనమైపోతే-ఆ రేడియో యాక్టివ్ కిరణాలకు తట్టుకుని ఈ భూమిపై తన జీవితాన్ని కొనసాగించగల ప్రాణి బొద్దింక ఒక్కటేనని ప్రముఖులభిప్రాయ పడుతున్నారు. దాన్ని నువ్వు బజార్లో మందు కొని వాడి చంపాలనుకోవడం చాలా తెలివితక్కువ"- అన్నాడు.

"అయితే దాన్ని చంపడానికి వేరే ఉపాయమేమీ లేదా? వీటి బాధలను మనమలా భరించవలసిందేనా?" అన్నాను నిస్పృహలో.

"లేకేం-ఒకే ఒక మార్గముంది"- అన్నాడు రాఘవరావు.

"ఏమిటది?" అన్నాను ఆశగా.

"పరశురాముడిలా ఇంట్లోని అణువణువు శోధించి-కనబడిన బొద్దింకనల్లా ఏ చెప్పుతోనో కొట్టి చంపి అవతల పారేయడమే?" అన్నాడు రాఘవరావు.

నాకీ ఉపాయం అంతగా నచ్చలేదు కానీ మర్నాడో మనిషిని పెట్టి అమలు మాత్రం జరిపించాను. వాడు నేనిచ్చిన పది రూపాయలకూ ఆశపడి ఎంతో సమర్థవంతంగా బొద్దింకల్ని వెతికి వెతికి చంపేశాడు. ఇంట్లో బొద్దింకల సంఖ్య బాగా తగ్గిపోయింది. ఆ తర్వాత ఇంట్లో కూడా ఎక్కడైనా ఒకటి అరా బొద్దింకలు కనబడితే తక్షణం చంపి అవతల పారేయడం ఇంటిల్లిపాదీ అలవాటు చేసుకున్నాం. ఈ పద్ధతి తీవ్రంగా అవలంబించేసరికి కొంత కాలానికి మా ఇంట్లో బొద్దింకల బాధ తగ్గిపోయింది

ఒక రోజు పేపర్లో అవినీతి నిర్మూలనకు ప్రభుత్వం తీసుకుంటున్న కొత్తచర్యల గురించి మొదటి పేజీల్లో పెద్ద పెద్ద అక్షరాలతో రాశారు. ఆ వార్త చదువుతూ నేను నిట్టూర్చాను.

"ఏమిటండీ— లా దిగులుగా ఉన్నారు?" అంది జయ.

ఆమెకా వార్త చూపించి-"వెయ్యి రూపాయల నోటు డిమోనటైజ్ చేశారు, బ్లాక్ మనీ బయటకు వచ్చిందా? వీళ్ళెన్ని చేస్తున్నారు-వాళ్ళవన్నీ అధిగమిస్తున్నారు. ఈ వార్తలు కేవలం కన్నీళ్ళు తుడవడానికి తప్ప దుఃఖాన్ని పోగొట్టడానికి పనికి రావు"-అన్నాను.

"అంటే?"

"ఏం చేసినా ఈ దేశంలో అవినీతి నాశనం కాదు"—

"బాగుందండీ-రాఘవరావుగారు. బొద్దింకలాంటి బలమైన ప్రాణి లేదన్నారు. వాటినే మనం నాశనం చేయగలిగాం మన ఇంట్లో లేకుండా-అలాంటప్పుడు అవినీతిని నాశనం చేయడం ప్రభుత్వానికి వల్ల కాకుండా పోతుందా?" అంది జయ.

జయ అలా అనగానే నాకు మేము బొద్దింకలను నాశనం చేసిన పద్ధతి గుర్తు వచ్చింది చేతిలో చెప్పు-క్రింద బొద్దింక!

అవినీతిని నాశనం చేయడానికి ఇదొక్కటేనేమో పద్ధతి!

అయితే... ... ... ... ....

పైకి ఎత్తబడిన ఆ చెప్పు అలానే ఉంది. కాని ఆ క్రింద పాకే బొద్దింకల స్థానంలో నాకు నా తల్లి దండ్రులూ, బంధువులూ, స్నేహితులూ,... ... ....ఆఖరికి నేనుకూడా కనిపిస్తున్నాను.



మినీ కథ

# కాకులు

## పోలాప్రగడ జనార్దనరావు

రోడ్డు మీద నడుస్తున్న మనిషి ఉన్నట్టుండి దభీమని పడిపోయాడు. చుట్టు పక్కల షాపుల దగ్గర సరుకులు కొనుక్కోవడానికి వచ్చిన వాళ్ళు, బస్సుస్టాండులో నించున్న బాపతు, కిళ్ళీ కొట్టు దగ్గరున్న కలాసారాయుళ్ళు, మోళీవాడి చుట్టూ గుమిగూడినట్టూ పేలంపాటవాడి దగ్గర వేలం వెర్రిగా జేరిన జనంలా పడిపోయినతనికి చుట్టూ మూగారు

"అరెరె మూర్ఛరోగం అనుకుంటా. చూస్తారేమిటండి నీళ్ళు పట్టుకురండి తొందరగా—తాళం చేతులున్నాయా ఎవరిదగ్గరేనా?" అంటూ ధన్వంతరి వేలు విడిచిన మేనమామలా దగ్గుతూ ఆయాస పడుతూ హడావిడి చేసాడు ఒక రోగిష్ఠి ముసలాయన.

"ఈ.......... అలవాటేలెండి. ఏ జేబో కొట్టి నాలాంటోడ్ని సూసి పరిగెట్టబోయి పడుంటాడు. నాటకాల నా........నాలుగంటించి నానంటే ఈడు, ఈడిబాబు, ఈడి పామిలీ ఓలు మొత్తం అంతా మన వెంకాల పాలోఅవుద్ది. ఆపాలి ఏం జరిగిందంటే వూ... ఆ సరిగ్గా బిపోర్ లాస్ట్ యీరు యిల్లాంటి నాకొడుకే" అంటూ ఫ్లాష్‌బాక్ మొదలెట్టాడు అక్కడున్న జనాన్ని క్లియర్ చేసి ట్రాఫిక్ ఆగకుండా చూడాలన్న జ్ఞానం కూడా లేని పోలీస్ కానిస్టేబుల్.

"కంటిన్యూగా ఒకే బ్రాండ్ ఎంత తాగినా పరవాలేదు గురూ! బచ్చాగాళ్ళు, తెలీక అదికాస్త ఇదికాస్త అంటూ కక్కుర్తి పడతారు; పడిపోతారు — నాబోటి గాడి దగ్గరకొచ్చి "గురూ ఇదీ సంగతి" అంటే వాడికి పారం నేర్పినట్టు వుంటుంది. నాకూ ఒకరోజు గడిచిపోయేది కదా!... ఛీ ఛీ ఎప్పటికి బాగుపడతారో ఏమిటో"

"ఏమిటండి ప్రతి వాడు పడిపోయిన వాడి గురించి యిష్టమొచ్చినట్లు మాట్లాడేవారే. సాటి మనిషి పడిపోతే సాయం చేయరు సరికదా, యిష్ట మొచ్చినట్టు అభాండాలు వేస్తారా? ఇదేనా మీ సంస్కారం? ఇదేనా మీ సంస్కృతి? అదే మీ తమ్ముడో మీ బావో అయితే అల్లా అనగలరా? మీకు యిటువంటి రోజు వస్తే ఏం చేస్తారు? నాన్న యింకా యింటికి రాలేదు అని ఎదురు చూసే అతని పిల్లలు గురించి ఆలోచించారా?" అంటూ విపరీతమైన ఆంగికాభినయంతో నాటకం డైలాగుల్తో చుట్టూ గుమిగూడిన మనుష్యుల్లో అటు యిటు తిరుగుతూ అంతర్ధానమయ్యాడు ఆ యువకుడు... (ఒకటి రెండు పర్సులతో)

జనం గుమిగూడి వుంటే నాలుగు డబ్బులు దొరుకుతాయేమోనని సొట్టలు పడ్డ సత్తుగిన్నెతో సత్తువలేని బక్క చిక్కిన ముసలాడొచ్చాడు అక్కడికి. "అడుక్కోవడానికి అభిమానపడ్డట్టుంది బిడ్డకి, పడిపోయాడు తిండిదొరక్క - జీవా ముక్తికి మార్గమును కనలేవా" అంటూ పాడుకుంటూ అడుక్కోవడానికి వెళ్ళిపోయాడు.

"గుమిగూడిన జనంలో కనీసం మూడొం

తులు ఓటర్లు వుంటారు. ఏక్సిడెంటు అయి వుంటే పోలీసు రిపోర్టు యిచ్చి చచ్చిపోయి నాడింటికెళ్ళి వాళ్ళ వాళ్ళకి చెప్పి తనే దహన క్రియలు జరిపించాలి. (అన్నట్టు ఫొటోగ్రాఫర్ని పిలవడం మర్చిపోకూడదు) అతని భార్యకి సాయం చెయ్యాలి...అదీ కాకపోతే ఒకవేళ కొట్టుకున్నారేమో... ఈ గొడవకి కారణం తన ఎగస్పార్టీ వాళ్ళ మీదకి బనాయించాలి. దెబ్బలు తిన్నవాడు ఎవరైనా సరే తన ఉడిభుజం క్రింద ప్రక టించాలి. ఒకవేళ పెద్ద గుండాగాడై వుంటే మొన్న మీటింగ్లో తనమీద రాళ్ళు యిసి రించిన వాళ్ళ మీటింగులో ఈడిచేత సోడా బుడ్డీలు యిసిరించాలి ...ఒకవేళ దెబ్బతిన్న వాడు నిరుద్యోగి అయితే నిరుద్యోగ కరువు భత్యం గురించి కడుపు మండి వు టాడు కాబట్టి కాస్త కాఫీనీళ్ళు పోయిస్తే ఆడే గోడలు కరాబు చేస్తాడు"...ఇలా ఆలో చిస్తూ జనం దగ్గరకి చేరుకున్నాడు ఓమాజీ రాజకీయ నాయకుడు....

జనం మాట్లాడుకోవడం తప్ప కనీసం తనకి ఎవ్వరూ చేయూతని ఇవ్వలేపక పోవడం అప్పుడే కాస్త స్పృహలోకి వస్తున్న అతను గ్రహించాడు. మెల్లిగా తనంతట తానే లేచాడు.

"జీవం"లేని నువ్వు జీవం వున్న వాళ్ళ కంటే ఎన్నో రెట్లు గొప్పదానవు. రోడ్డు మీద ఆలోచిస్తూ నడువ కూడదని, అల్లా నడవడం ఎన్నో అనర్థాలకి దారి తీస్తుందనీ నాకు గుణపాఠం నేర్పావు. నువ్వు దాచు కున్న దాన్ని వాడుకొని నిన్ను నిర్దయగా రోడ్డుమీద పారేస్తే మరి పారేసిన వాడి కాళ్ళు ఊగడం నీధర్మం....థాంక్యూ వెరీ మచ్" అనుకుంటూ అందరి వంకా చూసి, కాలి క్రింద పడున్న అరటిపండు తొక్కని జాగ్రత్తగా పక్కనున్న కాలవ లోకి విసిరేసి సవ్యంగా వున్న ఒక్క కాలుని జాడించుకొని కుంటుకుంటూ వెళ్ళిపోయాడు అతను. 

# అన్నదానం




ప్రసన్నకుమార్ సర్రాజు

ధబ్ మని చప్పుడయింది.

అకస్మాత్తుగా వింటే ఏదో ఆలోచనతో

అంటూ వీపు గుద్దుకుసేంత భయంకర శబ్దం కాదది.

వుంటారు

ఆలస్యంగావచ్చో, లేక మొదటి పంక్తిలో చోటు లేకో, రెండో పంక్తి కోసం ఎదురు చూసేవాళ్ళు.....

వడ్డించిన విస్తరిలాంటి జీవులు నాజూకుగా ఎంగిలిపడి లేచిపోయాక కిందపడే ఆ 'కట్ట' కోసం కలిసికట్టుగా ఎదురుచూసే వాళ్లు.

ఈ రెండు తరగతులకీ వున్న దూరం ఆహారధాన్యాల మూటలు విసిరేసే సర్కారువారి విమానానికీ, వరద బాధితులకీ వున్నంత దూరం.

విసిరేసే చేతికీ, చాపే చేతికి వున్నంత దూరం.

ఆ శబ్దం-మొదటి పంక్తి అయిపోయిందని సూచించే గంట.

ఆ శబ్దం—వీనుల విందుగా వినిపించి తాత్కాలికంగా చల్లార్చే కడుపుమంట.

భోజనాలకు వచ్చిన వాళ్ళకు మర్యాదలు చేయటంలో సతమత మవుతూనే ఆ శబ్దం విన్నాడు చక్రపాణి అప్రయత్నంగా డాబా మీదనుంచి కిందకు చూశాడు.

ఎప్పుడు కిందపడతాయా అని ఎదురు చూస్తున్నాడు.... ఆ విస్తళ్ళకట్ట పడగానే పరుగు పరుగున వచ్చాడు ఆ వ్యక్తి.

మనిషి చిక్కిపోయిలేడు. కానీ ఆ మురికి అవతారం, పీలికలై వ్రేలాడుతున్న చొక్కా, తైల సంస్కారంలేని జుట్టు, రెండు పూటలా తిండికోసం ఎప్పటికప్పుడు బిజీగా వుండి తమ విషయం పట్టించుకోవటం లేదని ఫిర్యాదు చేస్తున్నట్లున్నాయి.

అదే సమయంలో ఎక్కడినుంచి వచ్చాయో రెండు గ్రామసింహాలు—కాళ్లు చేతులు వుండి నువ్వు కూడా ఇలా మాకు పోటీ వస్తే ఇక మేం బతికేదెలా అన్నట్టు వాటి భాషలో పోట్లాడుతూ అరుస్తూ మీద మీదకి వచ్చాయి.

వాడు కిందకు వంగాడు. కాళ్లు చేతులు సరిగా వుండేవారు చేసే పనులలో ఇది కూడా ఒకటి అన్నట్లు రెండు రాళ్లు చేతిలోకి తీసుకున్నాడు. శక్తికొద్దీ గురిగా విసిరాడు.

కుయ్యో మంటూఅరిచాయి...ఇకలాభం లేదనుకుని దూరంగా వెళ్ళిపోయాయి.

చక్రపాణి ఇల్లు వూరికి కాస్త దూరంగానే వుంది. అక్కడ ఆరోజు ఎంగిలాకుల విందు వుందని వాడిలాంటి జీవాలకు తెలిసే అవకాశంలేదు. అందుకే వాడికి పోటీలేదు అక్కడ.

చెత్తకుండీకి కాస్త దూరంగా గొంతు కూర్చున్నాడు, తీరిగ్గా కట్ట విప్పేడు, పైఆకులోవున్న పదార్థాలు కింద వున్న బొత్తి మీదకు దులిపాడు. ఆతర్వాత ఖాళీ అయిన ఆకు ప్రక్కనపెట్టి, మిగిలిన ఆకుల్లోని పదార్థాలు ఒక్కొక్కటీ తీసి ఆ ఆకులో పెట్టాడు.

చక్రపాణి తల తిప్పుకున్నాడు. మనసంతా అదోలా అయిపోయింది. అప్పటి వరకూ దహిస్తున్న ఆకలి ఒక్కసారి బిందెడు నీళ్ళు తాగినట్లు ఆరిపోయింది.

ఆకలి ఆరిపోవడమేమిటి?

"అగ్నివంటిది ఆకలి. అగ్ని దేన్నయినా దహించివేయును. ఆకలి ఎంత పనైనా చేయించును."

రెండు రోజులయినా వాడు ఆవీధి వదలలేదు గృహప్రవేశం సందర్భంగా సత్యనారాయణ వ్రతం చేసుకున్న రోజు ఆవీధిలోకి వచ్చాడు వాడు. ఆ ఒక్కరోజుకే ఆ విందు భోజనం-మరి తరవాత?

చక్రపాణి, భార్యని వాకబుచేశాడు. ఆ వీధిలో తాముకాక ఆరు బ్రహ్మణ కుటుంబాలు వున్నాయట. వాళ్ళ ఇళ్ళనుంచే రోజూ ఓ పది విస్తళ్ళయినా ఆకుండీలో పడుతుంటాయని మామూలుగా చెప్పింది శ్రీమతి.

చక్రపాణి మధ్యాహ్నంపూట ఆఫీసు నుంచి ఇంటికి భోజనానికి వస్తూంటాడు. కానీ భోజనం ఇష్టంగా చెయ్యడమంటే ఏమిటో మరచిపోయాడు.

కారణం....




రోజూ మధ్యాహ్నం ఇంట్లోకి అడుగు పెట్టే సమయంలో కుండీకి కాస్త దూరంగా తాజాగా పడిన ఎంగిలాకులని భోంచేస్తూ "వాడు" కనిపించటమే.

చక్రపాణికి ఈ విషయం చాలా చిరాకుగా అనిపించింది. అందరిలా పట్టించుకోకుండా తానుండ లేడు-

పట్టించుకుంటే అసలుండలేడు.

ఒక రోజు మధ్యాహ్నం ఆఫీసునుంచి ఇంటికి వచ్చాడు. కుండీలో విస్తళ్ళు ఇంకా పడలేదేమో వాడు తలవంచుకుని ఎదురింటి అరుగు నానుకుని కూర్చున్నాడు.

ఆ అరుగు గల ఇల్లు ఎప్పుడూ తాళం వేసేవుంటుంది. అందుకని అక్కడే వాడి నివాసం ఏర్పరచుకున్నాడు.

చక్రపాణి ఒక నిశ్చయానికి వచ్చాడు.

"ఏయ్..ఇలారా."—పిలిచాడు.

వాడు తలతిప్పి చూశాడు. లేవలేదు. తనను కాదనుకున్నాడేమో మళ్ళీ తల వంచుకుని కూర్చున్నాడు.

చక్రపాణి మళ్ళీ పిలిచాడు.

ఈసారి చటుక్కున తలెత్తాడు. చక్రపాణి వాడివంకే చూస్తూండటంతో తననే పిలిచాడని గ్రహించాడు.

లేచి భయంగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాడు. దూరంగా నిలుచున్నాడు.

చేతులు కట్టుకోలేదు. కొంచెంకూడా వంగ లేదు. కానీ కొంచెం తల వంచి చక్రపాణి వంకే చూస్తూన్నాడు. కళ్ళలో బెదురు వుంది.

పిల్చాడేగానీ చక్రపాణికి ఏంమాట్లాడాలో తోచలేదు. కాస్సేపాగి, "ఈ రోజునుంచి నువ్వు ఆ ఎంగిలాకులు తినకు" అనేశాడు.

ఈసారి వాడు భయపడుతున్నంతా జరిగిందన్న భావం వాడి ముఖంలో కనిపించింది చక్రపాణికి.

ఎంగిలాకులు తినటం వాడి జన్మ హక్కయినట్లు, ఆ హక్కుని తాను వదులుకోవటం ఇష్టంలేనట్లు, నిరసన కదలాడింది వాడి కళ్ళల్లో.

వాడు మూగవాడు కాదని చక్రపాణికి తెలుసు అయినా మాట్లాడడు....

మాట్లాడటం మరచిపోయి కొన్ని ఏళ్ళయింది వాడికి. తనలో తను తప్ప మాట్లాడుకోడు. కుక్కలతో తప్ప పోట్లాడడు. వాడు మనిషితో మాట్లాడటం అవమానంగా భావించాడో లేక తనని తాను మనిషిగా గుర్తించలేదేమో....

అందుకే మాట్లాడడు.

వాడు మనిషితో మాట్లాడితే కోర్టు డఫేదారు చనువుగా మేజిస్ట్రేటు భుజంమీద చెయ్యేసినట్లుంటుంది. లేక పోలీసుకానిస్టేబుల్ ముఖ్యమంత్రి జుట్టులో ఇరుక్కున్న గడ్డిపరకను చేతితో తీసివేసి నట్లుంటుంది.

అందుకే వాడు మనిషితో మాట్లాడడు.

"రోజూ నేను భోజనం పెట్టిస్తాను. అర్థమయిందా?" వాడికి చక్రపాణి మాట్లాడిన మాటలు బాగా వినపడ్డాయి. అర్థాంతరంగా వచ్చిన ఈ ఆహ్వానానికి అర్థం కాక పోయినా అర్థవంతంగా తలవూపాడు.

చక్రపాణి లోపలికి వెళ్ళిపోయాడు. వాడు నెమ్మదిగా గోడదగ్గిర కూర్చున్నాడు.

ఐదు నిముషాల తర్వాత చక్రపాణి ఇంట్లోంచి పనిమనిషి వచ్చింది.... విస్తట్లో అన్నం పెట్టుకుని.

అది చూడగానే ఛటుక్కున లేచి నిల్చున్నాడు.

భుజాన వ్రేలాడుతున్న తువ్వాలు రెండు చేతులతో పట్టాడు. దానిలో విస్తరి తీ పడేసి లోపలికి వెళ్ళిపోయింది. అరుగు దగ్గరకు చేరుకున్నాడు. ఎప్పుడో పట్టి వుంచుకున్న నీళ్లు ఒక రేకు డబ్బాలో వున్నాయి. తృప్తిగా ఆత్రంగా చాలా కాలం తరువాత ఎంగిలి విస్తట్లో భోజనం చేశాడు.

చూడకూడదు అనుకుంటూనే వాడు అన్నం తినటం మేడమీద కిటికీలోంచి చూశాడు చక్రపాణి. అతని మనసుకేదో తృప్తిగా అనిపించింది. కానీ ఈ ఒక్కపూట వాడికి అన్నంపెడితే సరిపోతుందా?

సరిపోదని, అలా సరిపుచ్చుకుంటే తాను జమ అయిపోతాడని తెలుస్తూనే వున్నది చక్రపాణికి.... మరి....?

అందుకే ఒక నిశ్చయానికి వచ్చాడు. పది మందికైతే ఏమో చెప్పలేడు గానీ ఒక్కడికి రోజూ రెండుపూట్లా అన్నంపెట్టే తాహతు తనకుంది.

నాలుగు రోజులుగా వాడికి చక్రపాణి ఇంట్లో నుంచి పని మనిషి ద్వారా భోజనం అందుతూనే వుంది. వాడి ముఖంలో కాస్త కళ వచ్చినట్లు కూడా చక్రపాణి గమనించాడు.

ఎందుకు వాణ్ణి వూరికే మేపటం అని భార్య కసురుకుంది. వాడిచేత పనిచేయించుకుందాం అని సూచించింది. దానికి చక్రపాణి మనసు ఒప్పుకోలేదు. ప్రతిఫలం ఆశించి వాడికి అన్నం పెట్టినట్లు అవుతుందనీ, అది ఆత్మవంచన అనీ అనుకున్నాడు. అదీ గాక....... అంతరాంతరాల్లో తరతరాలుగా రక్తంలో జీర్ణించుకుపోయిన జుగుప్స.... ఎంగిలాకులు తినేవాడిని లోపలికి రానివ్వడమే........ అసంభవం అనే అంతస్యం కూడా ఆ ప్రతిపాదనకు ఒప్పుకోలేదు.

తరువాత చక్రపాణి వాడి విషయం అంతగా పట్టించుకోవటం మానేశాడు. అతనికి తెలుసు తన ఆర్డర్ ప్రకారం వాడికి రోజూ భోజనం అందుతూనే వుంటుందని.

ఇక ఇంటికి వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు వాడెక్కడవున్నాడో చూడటం మానేశాడు.

వాడి అవతారం.... మొహం వాచి ఎంగిలాకులు తినటం చూడలేక గదా భోజనం ఏర్పాటు చేశాడు. తర్వాతకూడా వాడి మంచి చెడ్డలు కనుక్కోవటం అనవసరం అనిపించింది. తన వ్యవహారాలతో బిజీగా వున్నాడు.

నెల రోజులు గడిచాయి.

ఒకరోజు అర్ధరాత్రి చక్రపాణి మామగారికి సీరియస్‌గా వుందని టెలిగ్రామ్ వచ్చింది. వెంటనే భార్య, పిల్లలతో టాక్సీ

స్టాండుకు వెళ్ళి ఒక టాక్సీ కుదుర్చుకుని మామగారి ఊరువెళ్ళాడు.

ఆయన అప్పటికే పరమపదించాడు—పద మూడోరోజు దాకా వుండి, ఇక సెలవు లేదని ఒక్కడే ప్రయాణమయ్యాడు.

బస్సులో గానీ గుర్తుకురాలేదు చక్రపాణికి. ఇల్లు తాళం వేశామని, వాడు పాపం భోజనం కోసం ఎదురు చూస్తూ వుంటాడని.

పెద్దగా పట్టించుకోలేదు. ఎప్పుడైతే తన ఇంట్లోనుంచి భోజనం వెళ్ళలేదో, వాడికి ఎంగిలాకులు రెడీగానే వుంటాయిగదా! మళ్ళీ శ్రీమతి వస్తేగానీ భోజనం దక్కదు. ఎప్పటిలా అప్పటివరకూ తనకూ హోటల్ కూడే గతి.

సాయంత్రం 5గంటలయింది -చక్రపాణి దిగాడు ఇంటిముందర. డబ్బులిచ్చి, తాళం తీసి లోపలికెళ్ళాడు. ఇల్లంతా దుమ్ము కొట్టుకుని వుంది.

చక్రపాణి వచ్చిన విషయం తెలిసి, పక్కింట్లో పని చేస్తున్న పని మనిషి వచ్చింది.

"అమ్మగారు రాలేదా బాబూ" అంది

దానికి సమాధానం చెప్పి, స్నానంచేసి, బాల్కనీలో కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

పని మనిషి ఇల్లు శుభ్రం చేస్తోంది.

అప్రయత్నంగా కిందకు చూశాడు. చెత్తకుండీనిండా అరిటాకులు పేరుకు పోయి వున్నై.

చటుక్కున చుట్టుపక్కల చూశాడు. వాడు కనిపించలేదు. 'లక్ష్మి' కేక వేశాడు.

"ఏంటి బాబూ" అంటూ వచ్చింది పని మనిషి.

"వాడు.... మనం రోజూ అన్నంపెట్టే వాళ్ళమే.... ఏడీ?" అడిగాడు.

"ఆడా బాబూ.... చచ్చిపోయాడు"

అదిరిపడ్డాడు చక్రపాణి "చచ్చిపోయాడా! ఎలా!!"

"తిండిలేక...."

"తిండిలేక ఏమిటి? రోజూ ఎంగిలాకులు కుండీ నిండా పడుతూనే వున్నైగా! ఎప్పటిలాగా అవి తిని బతకలేకపోయాడా?"

"ఆడికి సూకరం ఎక్కువైంది బాబూ. మీ రెళ్ళిపోయాక రెండు రోజులు మీరు ఒస్తారేమో, అని ఎదురు సూశాడు. కానీ మీరు రాలేదు గదా! తర్వాత ఎంగిలాకులు తిందామనే కుండీదాకా పోవటం, ఎనక్కి ఎల్లిపోవటం.... నేనంతా గమనిత్తానే వున్నాను బాబూ....... అసలాడికి మీరు సేగారు లెండి ... ఆడికి మంచి భోజనం తినటం అలవాటుకాగానే ఆ ఎంగిలాకులు తినలేక పోయాడు. ఈ యీధిలో మీలాగ గుప్పెడన్నం పెడదామని ఎవరికుంది? ఎవరూ పట్టించుకోలేదాణ్ణి అలాగే ఆకలితో మాడాడు పాపం....నాలుగు రోజుల కిందట సచ్చిపోయాడు బాబూ....మున్సిపాలిటీ వోళ్ళు ఆడి శవాన్ని...."

ఇక వినలేక పోయాడు చక్రపాణి.

నాదే తప్పు.... నాదే తప్పు....వాడిని ఎప్పటిలా ఎంగిలాకులు తినేవాడిగా ఉంచేస్తేనే బాగుండేది.... వాడికి అన్నంపెట్టి చంపాను.... అన్నంపెట్టి చంపాను.... అని బాధపడుతూ, చాలా రోజుల వరకూ ఆ షాక్ నుంచీ కోలుకోలేక పోయాడు చక్రపాణి.

✳



# నీలి గోరింట

నాయని కృష్ణకుమారి

ఇంటిముందు రకరకాల కార్లు రోడ్డుకు అటూ ఇటూ బారులు తీరి ఆగి ఉన్నయ్. గేటు కెదురుగా వాకిట్లో రోడ్డు మీద పిడకలు రాజేసిన నిప్పు నివురు కప్పి మసక మసకగా ఉంది. పిడకలమీదనుండి వచ్చే పొగను దాటుకుంటూ మనుషులు లోపలకీ బయటకీ నిర్విరామంగా పయనిస్తూనే ఉన్నారు. ఇంతమంది మనుషులు అటూ ఇటూ తిరుగుతున్నా అక్కడి వాతావరణంలో ఎక్కువ మాటా పలుకూ లేక, స్తబ్ధుగా, బరువుగా ఉంది. అందరి ముఖాల్లోనూ ఏదో చెప్పలేని నిస్సహాయత్వం—

o o o

"ఇంతమంది వస్తున్నారు. పూలమాలలతో ముంచేస్తున్నారు. నాకు నచ్చని ఈ అగరువత్తుల ధూపం వల్ల కాబోలు చుట్టూ ఉన్న వాళ్ళముఖాలు మసకబారి ఉన్నాయి. మామూలు రోజుల్లో నవ్వులు పేలుస్తూ తిరిగేవాళ్ళు కూడా ఇంత బరువుగా దిగులుగా ఉన్నారేమిటి! అవతల కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుని చేతులు జోడించి వెక్కుతున్న అబ్బాయి రామూ కాదూ; నేను ఉద్యోగం ఇప్పించిన పిల్లవాడు! ఇక్కడ నుండి ఒక్క అడుగైనా అవతలకు కదల లేకుండా ఉన్నాను. ఎంతోమంది ఆడవాళ్ళు తోసుకుని వచ్చేస్తున్నారు. వీళ్ళంతా ఎప్పుడో ముప్ఫైయేళ్ళ కిందట, మేము కలిసి మెలిసి ఉన్న ఒక్క లోగిలిలోని వాటాల వాళ్ళు. వీళ్ళందరకీ నేనంటే యిష్టమే. వీళ్ళు నిజంగానే దుఃఖపడుతున్నారు. పాపం సావిత్రి వాళ్ళను చూచి ఏడుపాపుకోలేకపోతూంది. దాన్ని ఎవరూ ఊరుకోబెట్టలేరు. ఒద్దన్నకొద్దీ దుఃఖం తన్నుకొస్తోంది. అది అంతే. అందరూ వద్దన్న పని విడవకుండా చెయ్యడమే దాని జీవితాదర్శం. ముప్ఫైయేళ్ళపాటు నా జీవితాన్ని పంచుకుంది. నోరు మెదపక పోయినా, నేను చేసే పనులకన్నిటికీ ఎంతో చాకచక్యంగా అయిష్టం చూపించేది. ఒక విధంగా నేనే దాని కయిష్టమైన పనులన్నీ చెయ్యాలని వెతుక్కునేవాడినేమో! అది నా మనస్సేమాత్రమైనా గ్రహించిందా! నా జీవితంలో, ఏది పెద్ద లోపమై, అగ్నిగుండంలా మండి, అనుక్షణమూ నన్ను కాల్చుకు తిన్నదో, ఆ లోపాన్ని —కు పూరించగలిగిందా? కనీసం అదేమిటో ఇప్పుడైనా నీకు తెలియదుకదా సావిత్రీ! ఆ సావిత్రి భర్తకోసం యముడితో యుద్ధం పెట్టుకుంది. ఈ సావిత్రి భర్త మనస్సుతో ఏళ్ళతరబడి జరుగుతున్న యుద్ధాన్ని గుర్తుపట్టలేకపోయింది. ఈవిడ శరీరంలో అణువణువునూ నాలో కలుపుకున్నానుగాని, మనస్సులోకి తొంగిచూచే ప్రయత్నం

చేయ్యలేదు. తను జోరబడుతుందేమోనని భయపడి నా మనసు తలుపుల్ని గట్టిగా మూసేశాను. సావిత్రి తెలివి గలది. అవి గ్రహించే, నామీద కోపాన్ని, కసినీ మౌనంగా, నోరు మెదపకుండా, ప్రదర్శించే దనుకుంటాను ఇప్పుడు గుండెలు పగిలేలా ఏడుస్తోంది-ఉత్త పిచ్చిది. ఒకవేళ నేను తిరిగి వస్తే నా మనస్సుకు శాంతిని సావిత్రి యివ్వగలదా? లేదు. లేదు. ఆ శాంతి నిచ్చే వ్యక్తి సావిత్రి కానే కాదు.

ఏనాటి కథ! నలభై యేళ్ళ కిందటి మాట! ఆ ఊళ్ళో మట్టి ఎర్రగా ఉండేది. అప్పుడు నా మనస్సు కూడా ఎంత చిన్న పాటి ఆకర్షణకైనా రాగపూరిత మౌతుం డేది. ఇంటిచుట్టూ విశాలమైన స్థలం. రాళ్ళూ రప్పలూ, పిచ్చిమొక్కలూ పెరిగి ఏదో అరణ్యంలో వనవాసం చేస్తున్నట్లుం డేది. ఆ పిచ్చి మొక్కల్లో నీలిగోరింటలు మనోహరంగా గాలికి ఊగుతూ హాయిగా పలకరిస్తుండేవి. మూతిమీద నూనూగు మీసమూ, గరుగ్గా తగిలే ఎదిగీ ఎదగని గడ్డమూ, నన్ను ఇబ్బంది పెడుతూండేవి. అప్పుడే కాదూ నా బ్రతుకు స్మృతుల్లోకి ప్రవేశించిందో నీలి గోరంట! తర్వాత ఎన్ని సార్లు చూచాను! పెళ్ళికాని పడుచు పిల్లగా, పిల్లతల్లిగా, ఇంటా బయటా సర్వమూ సంభాళించుకునే బాధ్యతగల ఉద్యోగినిగా గౌరవ ప్రదురాలైన స్త్రీని ఎన్ని దశల్లో చూచాను. ఆ నా ప్రాణాన్ని! ఒక్క ఊళ్ళో ఉంటూ ఎంత అంతరం నాకూ ఆవిడకూ మధ్య — ఇంత మంది, ఇక్కడికి వస్తూ పోతున్నారు. కాని ఏదీ ఆ మహా రాణి రాదేం! ఆత్మ ఎక్కడికైనా ఎగర గలదంటారు. నేనీ గదీ వదల్లేక పోతు న్నాను. రావూ? చివరి సారిగా ఈ దేహాన్ని చూడడానికైనా, నా ప్రాణమూ, నువ్వు! ర్వాత పిండాన్ని కాకులు ముట్టకపోతే, తృప్తి పడకాల విషయంలో నాకు అసం తృప్తి అనుకుంటారు మూర్ఖ

o o o

ఆ యింటి ముందు వచ్చేపోయే వాళ్ళ సందడి అంత కంతకూ ఎక్కువై పోతోంది. ఇంటి యజమాని హఠాత్తుగా పోయాడు. విశాలమైన గదిలో ఎత్తుగా బల్ల్లిద మంచు గడ్డలు పేర్చి, శవాన్ని ఉంచారు. శవంమీద కప్పిన తెల్ల గుడ్డ, భయానికి సంకేతంలా మెరుస్తోంది. శవం మీద చేమంతి దండట! గదినిండా ఊదొత్తుల వాసన, మనుషుల విచార వదనాలు, నీర సపు గొంతులు, అన్నీ కలిసి ప్రతివాళ్ళ మనస్సుల్లో తమ తమ అంతిమ యాత్రా ప్రయత్నాల ఊహాల బొమ్మల్ని చెక్కు తున్నయ్. అప్పుడు గడపదాటి లోపలికి ప్రవేశించిందో యాభై యేళ్ళ ఆడమనిషి. ఆవిడ సన్నగా తెల్లగా ఉంది. ముక్కుకొన దేలి వ ఖంలో స్థిరత్వాన్నీ, కార్య దీక్షనూ తెలియజేసే సాధనంగా ప్రకాశి స్తోంది. కళ్ళు చిన్నవైనా కళ గలవి. కొద్దిగా బొట్టు చెరిగి, ముఖంలో హుందా తనం ప్రవేశించింది. ఆవిణ్ణి చూస్తే ఎవ రైనా తెలివిగలదనుకుంటారు. సౌమ్యురా లైన మంచి మనిషను కుంటారు. ఆవిడ అక్కడున్న అందరికీ బాధ్యతగల వ్యక్తిగా పరిచయం. ఆవిడంటే అందరికీ గౌరవమే.

సావిత్రి ఆవిణ్ణి చూచి కుమిలి కుమిలి యేడ్చింది, ఆవిడకు సావిత్రిని సముదాయిం చడం ఎంతో కష్టమైపోయింది.

శవాన్ని పడుకోబెట్టిన చోటుకు ఎదు రుగా గుమ్మంపైన ఒక పడుచుపిల్ల వాడి ఫోటో ఉంది.

"ఇది మీ ఆయనదే కాదూ సావిత్రీ!" అన్నదావిడ.

"అవును. ఆయనకు ఇరవై యేళ్ళప్పటి ఫోటో" అని వెక్కుతూ చెప్పింది సావిత్రి

టాప్ స్టార్ ఉన్న
కప్పు ఏది?



చూడండి, ఇక్కడ
చిక్కని, కమ్మని టీ ఉన్నది

చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం
రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్షలో లిప్టన్ టాప్‌స్టార్‌దే గెలుపు. చూడగానే తెలుస్తుంది దానిలోని ప్రత్యేకత. తాగగానే తెలుస్తుంది దానిలోని మాఱైన రుచి.




# లిప్టన్
# టాప్ స్టార్
# టీ

చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్



"ఈ వయస్సులో ఉన్నప్పుడే మీ ఆయన్ని నేను మొదటిసారి చూచాను తెలుసా? ఈ రూపం నాకు బాగా జ్ఞాపకం. అప్పుడు నాకెన్నేళ్ళనుకున్నావ్ సావిత్రీ! పద్నాలుగేళ్ళేమో! మీ ఆయన వాళ్ళ పిన్నివాళ్ళింట్లో చదువుకుంటుండేవాడు. వాళ్ళ పిన్ని భర్త మా మేనమామ. ఒక వేసవి సెలవల్లో అమ్మా వాళ్ళలో వాళ్ళ ఊరెళ్ళాను. ఆ యిల్లు ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం. చుట్టూ విశాలంగా చెట్టూ చేమలతో జీబురుటూ బోలెడంత ఖాళీ స్థలం. ఆ స్థలంలో నీలిగోరింట పూలు విరగబూచేవి. మీ ఆయన ఎక్కువ మనుషుల్లో కలిసేవాడుకాడు. మాట్లాడ్డం కూడా తక్కువే. ఎందుకో చెప్పలేనుకానీ, ఆ ఏమీ తెలీని వయసులో, మౌనంగా, గాలికి ఊగే, ఆ నీలి గోరింట పూలూ, మీ ఆయనా, ఒక్క రీతికి చెందిన వస్తువులే అనుకునేదాన్ని. ఇప్పటికీ, ఎక్కడ ఆ పూలు చూసినా నాకు మీ ఆయన జ్ఞాపకం రాకుండా ఉండదు సావిత్రీ – ఆ పువ్వులున్నంతకాలం మీ ఆయనకూడా నా జ్ఞాపకాల్లో ఉండిపోతాడు"—ఈ మాటలన్నీ వింటున్నంతసేపూ సావిత్రి వెక్కి వెక్కి యేడుస్తూనే ఉంది.

o o o o

"అంతేనా! ఏదో ఎసోసియేషన్ వల్లనైనా నేను నీ గుండెలో బ్రతికుంటానన్న మాట. పోనీ అది మాత్రం ఎంత అదృష్టం కాదు! నేను బ్రతికుండగా నీతో నోరు విప్పి నువ్వంటే నాకేమిటో ఒక్క ముక్కయినా చెప్పలేకపోయాను. అది నా మనసులో సమాధై పోయింది. ఎముకలకు పట్టి యే కాస్తన్నా మిగిలి ఉంటే, ఇంకాసేపటికి అదీ బూడిదై పోతుంది. ఇప్పుడు చెప్పమంటావా! ఈ చెప్పడం నీకు వినపడదని నాకు తెలుసు.

ఆనాడు నువ్వన్నట్లు పధ్నాలుగేళ్ళ ప్రాయంలో ఉన్నా నువ్వు నన్నెంత ఆకర్షించావో నీకు తెలియదు. పావడా జాకెట్టు వేసుకునేదానివి-నీ అందాన్ని నీ శరీరంలో కాదు నేను చూచింది. ప్రతి కదలికలో చూచాను. ఏమీ తోచక చిన్నచిన్న పిల్లల్ని వెంటేసుకుని ఆ జీబు పొదల్లో తిరుగాడుతూ నీలిగోరింట లేరేదానివి. ప్రకృతిలో ఉన్న ప్రతి చిన్న చిన్న అందానికి పరవశిస్తూ స్వేచ్ఛగా నువ్వు కదిపే ప్రతి అడుగూ కిటికీలో నుంచి నిన్ను గమనించే నా గుండెమీద పడుతున్నట్లుండేది. నెల రోజుల తర్వాత ఆ యిల్లు వదలి నువ్వు వెళ్ళావుగాని, నా గుండెను మాత్రం ఖాళీ చెయ్యలేదు. తర్వాత అయిదేళ్ళకు నా తరఫున మా బాబయ్య, మీ అమ్మగారితో రాయబారం నడిపారు. అప్పటికి నా చదువు అర్థంతరంగా ఆగిపోయి, చిన్న ఉద్యోగంలో ఇరుక్కున్నాను కాదూ! నువ్వు పై చదువుల్లో మునిగిపోయావు. "అమ్మాయి చదువుకుంటున్నదిగదా అన్నయ్యా ఇప్పుడే దాని పెళ్ళి మాటెందుకు!" అన్నదట మీ అమ్మగారు.

ఆ రోజు నేనెంత కుమిలిపోయానో నీవు ఊహించలేవు. మనసులో నా చదువులేని తనానికి, చేతగాని తనానికి, దుఃఖం! నువ్వు నాకు దొరకవని నిస్సహాయత. నువ్వే నాకు అందకపోతే బ్రతుకెందుకని నిరాశావహం. నిన్ను నేరుగా అడుగుదామనుకున్నాను. కాని ఎట్లా? ఒకప్పుడైనా నోరు విప్పి నీతో మాట్లాడాను గనుకనా! నేను నలు




గుర్లో కలవలేనివాణ్ణికాదు, పరమ పిరికివాణ్ణి. ఆ పిరికితనానికి నా జీవితాన్నే బలిపెట్టుకున్నాను. ఆ రకంగా నా మనసొక అగ్నిగుండమైపోయింది. అందులో నేను పూర్ణాహుతి చెందడం సహజమే. కాని అదుగో ఆ యేడుస్తున్న నా భార్య సావిత్రిని చూచావా - ఆవిడకూడా పూర్తిగా శలభమై మాడిపోయింది. నువ్వే సావిత్రిని ఓదార్చాలి. నువ్వే!"

○ ○ ○

ఊరుకో సావిత్రీ! మా అమ్మ కదూ! మీ ఆయనకేం పుణ్యాత్ముడు. నలుగురి చేతా మంచివాడనిపించుకున్నాడు. కుడి చెయ్యి ఎరక్కుండా ఎడమచేతితో దానాలు చేశాడు. ఎందరికో పెళ్ళిళ్లు చేయించి యిళ్ళు నిలబెట్టాడు. పది మందికి ఉద్యోగాలు చూపి అన్నం పెట్టాడు. ఆయన అడుగు జాడల్లో నడిచిన సహన మూర్తివి, మీ ఆయన ఎక్కడికీ పోలేదు సావిత్రీ! నీ గుండెలోనే స్థిరంగా ఉండిపోయాడు.

"మీరన్న మాటలన్నీ నిజమే. కాని చివరి మాట కాదు. ఆయన గుండెలోకి నన్నేనాడూ జొరబడనీయలేదు. ఆయన స్థిరంగా ఉండిపోడానికి ఎన్నుకున్న గుండె నా గుండె కాదని మాత్రం నాకు బాగా తెలుసు. కాని అది ఎవరిదో, ఎక్కడుందో ఎప్పటికీ కనుక్కోలేను" —అని మనసులో అనుకుంటూ కుమిలి కుమిలి యేడ్చింది సావిత్రి.

ఆమె లేచి, శవం పాదాలు ముట్టుకుని నమస్కారంచేసింది. శాశ్వతంగా మూసుకుపోయిన ఆ కళ్ళ వేపు తదేకంగా ఒక్క క్షణం చూచి బయటికి నడిచింది.

బయట రాజుకుంటున్న పిడకల పొగ ఆవిణ్ణి చుట్టుముట్టగా, ఆవిడ ఆకారం రేకులు కరుగుతున్న నీలి గోరింటలా ఉంది. ★

# ఎముకలు

## అల్లం రాజయ్య

**1978** డిసెంబర్ ఆఖరు వారం....

బారెడు పొద్దెక్కింది ఎండ పొడ గుడిసెల మీద, గూనిళ్ళ మీద సమంగానే పడుతున్నది. గుడిసెల కొప్పుల్లోనుండి పొగ నీరసంగా పైకి లేస్తున్నది. పశులు గుంపులు గుంపులుగా ఎగురుతూ అడివికేసి వెళుతున్నాయి వరికోతల రోజులే మోటా రోకలి పోట్ల చప్పుడు-ఐశ్వర్యం తపుకు తపుకన చెరిగిన చప్పుడు వినిపిస్తున్నాయి... ఊరు ఊరంతా ఎవరి పనుల వాళ్ళే చేసుకుంటూ సందడిగా ఉన్నది. ఊరికి దూరంగా విసిరేసినట్లున్న మాదిగ్గూడెం బయటకొచ్చి ఒక మనిషి కళ్ళకు చెయ్యడ్డం పెట్టుకొని ఊరుకేసి చూశాడు. అతనికి ఊరు నూరుమైళ్ళ దూరమున్నట్టుగా తోచింది. బరబర తల గోక్కుని తుపుక్కున ఉమ్మి ఊరువైపు కదిలాడు....

ఆ మనిషి ఎలాగున్నాడయ్యా అంటే—పీక్కుపోయిన చెంపల మీద వికృతంగా పెరిగిన గడ్డం—ఎండిపోయిన గుంటకళ్ళు—మసుగులో గారె కలిపితే తేలిన మొయ్య చేప పిల్లలాగ కనుగుడ్లు—పుల్లల్లాంటి కాళ్ళు ఆ కాళ్ళు కలిసిన చోటును కప్పేస్తూ చిన్న గుడ్డపేగు-ఒళ్ళు ఎముకల గూడు-మసిక లేసిన పాతగుడ్డలాగ చర్మం-ఆ చర్మంకూడా కమిలిపోయి ఎముకలకు ఇగ్గి కట్టినట్టున్నది-రెండు చేతివేళ్ళ మధ్య గోకుడు నపిమీరు పుళ్ళుపడి ఉన్నాయి—కాళ్ళ మడిమెలు ఎండకాలం నెర్రిడిసిన లో చెరువులాగున్నాయి. కుడి మోకాలు చిప్పకు పాత గుడ్డొకటి చుట్టబడి ఉన్నది. ఇంకా చెప్పాలంటే మనిషి వానకు తడిసి ఎండకు గుంజుకొచ్చిన పాత చెప్పులా ఉన్నాడు...

మనిషిని చూసి వయసు చెప్పాలంటే డెబ్బయేండ్ల ముసలోని లాగున్నాడు. నెత్తిమీది వెంట్రుకలు చూస్తే రాగిరంగు దిరిగున్నాయి .. నిజానికి అతని వయసు 45 దాటుండదు అతని తల్లిదండ్రులు ఏం పేరు బెట్టారో ఎవరికి తెలియదు. తెగలకానే వయసప్పుడు మిగతా అవయవాలు కనిపించకుండ కాగంత బొత్త ఉండేది. కనుక అతన్ని ఆ ఊరివాళ్ళు బొత్తోడు అని పిలుచుకున్నారు. ఆ పేరే స్థిరపడి పోయింది.

బొత్తోడు ఊరు సొరుదల కొచ్చాడు. కాళ్ళు పట్టుదప్పిపోయి ఊగులాడుతున్నట్లుగా నేలమీద పడుతున్నాయి. ..అంత దూరం నడిచినందుకే మనిషి ఎండలో తరుముకు రాబడ్డ దున్నపోతులాగ అఖర్ గొడుతున్నాడు. మరింక నడవలేక తంగేడు చెట్టుకింద కూలబడి పోయాడు.

"అంతు జెరమవ్వను కుక్కల్ .... సెత్తకుప్పకు దెబ్బెగదా! మరింక కోలుకునే దవద్దం... ఒంట్లో నెత్తురు సచ్చింది.... జిగి సచ్చింది... సీకిన బొక్కయిపాయె తనువు మరింక రొండొద్దులైతే సెత్తే సచ్చె



టట్టున్నది" బోత్తొని తప్పకళ్ళల్లో లాడాడు, కాళ్ళు కదలడం లేదు
భయం మరింక ముందుకు ఆలోచించ ఆ దారి వెంట ఎవరైనా వస్తారేమో
కూడదనుకున్నాడు లేవడానికి పెనుగు లేపి నిలబెట్టగలరనుకొని ఆశాస నుండి ఈ

కొనదాకా పారచూశాడు. కనుచూపు మేరలో ఎవరూ కన్పించలేదు. కుక్కొకటి నాలుక ఊగులాడుతు దగా మాదిగగూడెం నుండి ఊరిలోకి ఉరికేది ఆగి తంగేడు చెట్టును బొత్తోన్ని మురికిచూసి కాలెత్తి తంగేడు చెట్టుమీద ఉచ్చ బోసింది.

"నీ తల్లి దీనికి సుత నేను మనిషి తీర్గ గన్పత్తలేను ...మన్నయిపోయింది సెత్త. రాయయిపోయింది పొల్ల గండ్లు....అ-గ్గా నె-పు-పొల్ల-గండ్లు" అనుకుంటూ శక్తి నంతా కూడతీసుకుని లేచి నిలబడాలను కున్నాడు. తంగేడు కొమ్మ తెగిపోయింది. మళ్ళీ కూలబడి పోయాడు.

ఎటూ చేతకాక దుమ్ములో కుడిచేత కెలికిండు—ఏదో పొగొట్టు కున్నోనిలాగా—తప్పకళ్ళ నుంచి రాలినకన్నీళ్లు దుమ్ములో ఇంకిపోయాయి....

ఎవరివో అడుగుల చప్పుడు—తలెత్తి చూశాడు. ఎదురుగా జోగు బానక్క నిలబడున్నది....

"ఏందిరన్న గిడ కూలబడినవ్...." బానక్క బొంగురు గొంతుతో కుడిచేతిలోని త్రిశూలం గంట ఊపుతూ అడిగింది.

బానక్క నుదుటిమీద ఎర్రగా రూపాయంత కుంకుంబొట్టు—నూనె కారే జిడ్డు ముఖం—జెడలు గట్టిన గంపంత సిఖ చూసు కుంటూ బొత్తోడు చప్పుడు చేయలేదు....

"సీకేసిన బొక్కయి పోతివిర అన్నగ-పోశవ్వతల్లి సిన్నది గాదుసుమా? పిల్లో పిసుకో మొక్కు—నా తండ్రి రాయేకుని బెల్లం బంచి పెత్తనని మొక్కకపోతివి-పెద్దవ్వ తల్లికి...." బానక్క చెప్పక పోతున్నది.

"బానవ్వ నన్ను గింతంత లేవట్టి నిలు సుండ జెట్టె—గీసిదనక్క సత్త వత్తచ్చిన-గీడి కచ్చినంక నా తరంగాలే .......కూలబడి పోయి " బొత్తోడు.

బానక్క రెండు జబ్బల క్రింద చేతులేసి నిలసుండ బెట్టింది. .మనిషి ఊగిపోయాడు.

"పెయ్యిసూడు సిల్లకుండ తీర్గ సల్లబడిపోయిందె-మల్ల అనుకచ్చెటట్టున్నది. మంచాల పడుండక ఏడికి బోతన్నవ్ సావ—"

"బానవ్వ నేను మల్లమనుషుల్ల గలుత్తానే... ?"

"ఏవున్నదిరా నీ సెత్తల? పోశవ్వ సప్పరిచ్చేసింది... మట్టి సెత్తకువ్వ కత్తెనుల్ల కోలుకుంటాది?"

"గంతే నంటావే?"

"అంత భగవంతుని దయరన్న! గంపంత కన్ను బెట్టుకొని ఏడున్నడో నా తండ్రి—" బానక్క గుడ్లు తిప్పి ఆకాశం వేపు త్రిశూల మెత్తి మొక్కి "ఔనుగని—గిప్పుడేడికి బోతున్నవ్....?" జోలె భుజం మీదికి ఎగ దోసుకుంటూ, అడిగింది.

"నీ జాంచెన్ బానవ్వ! పదియేనొద్దు లాయె-మంచాలబడి-రెక్కాడ్తెనే డొక్కాడె బతుకులాయె-ఒక్కటి మీ అదినె కొట్టి పోసుకుంటే పోర గండ్లకే సాల్తలేదు. పటేలింటికి బోయి ముంజీత మన్న తెత్తామని బోతున్న"

"నువ్వా! నడుమిరిగిన ముసిల్ది తాడి సెట్టెక్కుత నన్నట్టున్నది కత-నడుసుడే ఒమ్మ కట్ట మయితంది—మరింక జీతం మోసుకత్తావ్...."

బొత్తోడు జవాబు చెప్పకుండా అడుగు లేస్తున్నాడు... తూలుకుంటూ నడుస్తున్న బొత్తోన్ని ఆశ్చర్యపడి చూసి, "కడుపు కగిదల్ల పాపిట్టిది....భగమంతుడా ఏం జల్మ మిత్తివి నా తండ్రి! నడీకు ఒడక ముందె మనిషి బొగ్గయి పోయిండు గదా! ఎప్పుడో రాలిపోతడు ..." బానక్క త్రిశూలం గంట విషాదంగా మోగుతుండగా ముందుకు నడిచింది.

బొత్తోడు ఊరుచొచ్చే సరికి మళ్ళీ కాళ్లలో సత్తువ సన్నగిల్లింది. ఏది ఏమైనా కూలబడితే మళ్ళీ లేవడం కష్టమని దారి కటుయ్యిటూ నాటున్న ఒక పక్క దడిని పట్టుకొని నిలబడిపోయాడు.

అదే దారివెంట కాసేపటికి షావుకారు




మల్లేశం ధోవతి చెంగులు తన్నుకుంటూ వచ్చాడు-దిగజారిన చెంపల్లో చీమగుళ్ళ లాగున్న చిన్న కళ్ళు టపటప లాడించి "ఎవనివిరో? బొత్తోడా! ఎంకయ్యపటేలు పెద్ద పాలేరోడు దల్లపొంట పాకులాడ్తం డేందికత?" అన్నాడు కాగంత కడుపు కిందికీ మీదికి ఊగుతు డగా పళ్ళు బెకబెక లాడినట్లు నవ్వుతూ....

"నీ బాంచెన్ అంతుజెరం గొట్టి గిట్లయి పోయిన" బొత్తోడు.

"కొట్టదామరి ..మాదుగులు బొత్తిలకు బేనిదార్లయి పోతిరి- కాలంగా ....కాలం బొత్తిలకు సెడి పోయింది....మాదుగులకు మదమెక్కి పోయింది. సింత పండు కొర్గ వోళ్లు మిరపకాయల తీర్గ మెరమెర లాడవట్టిరి సిన్న పెద్ద అంటారు లేకుండయి పోయింది... ఓ నీ యవ్వల.... సంఘాలు గింగా అని పింగబింగ డబట్టిరి... పోశమ్మను గొలువ నిచ్చేరా? మైసమ్మకు మొక్కనిచ్చేరా? లంజ కొడుకలారా! సావుండ్లి-ఇగో నేను ఖరాఖండిగ సెప్పుతన్న మల్ల ఎనుకటి గత్తరచ్చి ఊడ్సకపోక పోతె నా పేరింకోటి బెట్టు-" మళ్ళీ అసహ్యంగా—ముతక బనీను లోపల ఎత్తు పొట్ట కిందికి మీదికి కదలగా నవ్వాడు.

"గొడ్డుకు పుండాయె-గద్దకు ఇందాట" అందామనుకున్నాడు బొత్తోడు. అది కూడా అనడానికి ఓపిక లేక ఊరుకున్నాడు.

"బాగని....నాబాకి గొట్టి సత్తమనుకుంటన్నవ-వారీ! కోమటోని బాకీల బడి పోతే నరకంల నూనె కడయిలేత్తరు జెగర్త" హెచ్చరించాడు.

నూనె మరకలతో నల్లగా మాగిన అంచె నెత్తుకొని బరిబాత పిల్లవాడు ఒకడు వచ్చి అంచెకిందిఉండే "ఎటుబోదాం సావుకారీ?" అడిగాడు.

మట్టి ముద్దకు పుల్లలు గుచ్చినట్లుగా ఉన్న పిల్లవాడి కాళ్ళు అంచె బరువుకు జవజవలాడుతున్నాయి.

"ఇంకేడ బోదాం కాసాలగడ్డకు-మాది గిడ్లకు సావు" అన్నాడు మల్లేశం.

కాళ్లు బలంగా పొడుస్తూ పిల్లవాడు ముందుకు నడిచాడు.

"ఏమాయెర బొత్తోడ—బెల్లంగొట్టిన రాయోలె పలుకవు పలుకవు. అరె బాకంటె బాకంటె — ఎల్లువాను లేకపోతే పెన్సా

నమ్మి కట్టాలె-ఏమనుకున్నవో!" మల్లేశం

బొత్తోడు ఆ మాటకు నోరు తెరవలేదు. వెనుక వేపు నుండి ఎవరో రావడం చూసి మల్లేశం కందు పండ్లు గిలకరిసి గొనుక్కుంటూ ఎవరో తరుముతున్నట్లుగా నడిచాడు...

వచ్చినవాడు ముత్తయ్య.... ముత్తయంటే రెండేండ్లకింద పొరుగూరినుంచి ఈ వూరికి నమిలికోండ అంకూశనింటికి ఇల్లుట మచ్చిన ముత్తడు. ముత్తయ్య వచ్చిన ఆర్నెల్లకు అత్తమామ పాలీ కెక్కి గుడిసెమాత్రం అల్లునికి బిడ్డకు విడిచి పోయారు.... కలిగినోల్ల నేతల్ల సేకయిలిసేసి బతికిండు ...తొలుత ముత్తయ్యను చూసినప్పుడే మెదడు తిరిగిపోయిందనుకున్నారు జనం. ఎప్పుడు ఆసు బోసినట్లు ఊరంత కలె తిరిగేటోడు. కనిపించిన వాల్ల నల్ల కష్టంసుఖం అరుసుకునేటోడు.... మెదడు తిరిగిపోయినవాడు నిరుటి నుంచి పదాలు కూడ పాడసాగిండు. ఆ పాటలు జనాలకు చిత్రంగా కొత్తగా, మాట్లోనివో, చిందోనివో, బుఋగు జంగమోనియో కాకుండా ఉన్నా పలుశారుగానే ఉన్నాయి.... ఊరిలోకి కొత్త మనుషులు రావటం జరిగింది... వాళ్ళు సుట్టాల"ని చెప్పేవాడు. సుట్టాలకు ముత్తనిలాగే మెదడు తిరిగినట్టున్నది.... వచ్చిన చుట్టాలు వచ్చినట్టుండక కూలోల్లందరినీ కుప్పేసి పదాలుపాడి-కతలు చెప్పి కొంత కట్ట మీదికి తెచ్చారు. ఊళ్ళున్న కలిగినోళ్ళు కళ్ళు తెరిచేటాల్లకే ముత్తడు ముత్తయ్యయి పోవడమేకాదు. లేనోల్ల నోట్లె నాలికయి పోయాడు. కలిగినోల్లు గుజులు కట్టేసరికే — లేనోల్లు సంఘం పెట్టారు. ముత్తయ్య సంఘం పెద్దయ్యిండు...గప్ చిప్ గ ముత్తయ్యను మట్టికింద గప్పాలని కలిగినోల్లు ఓ రాత్రి పూట ముత్తయ్య ఇంటి మీదపడి నెత్తురు ముద్దయ్యేదాక కొట్టి కోలాటమేసి-గుడిసె కగ్గి పెట్టిండ్లు-సమయానికి గూడెపోల్లంత కుప్పకూడి ముత్తయను బతికించుకున్నారు. కాని పొద్దులతోనున్న ముత్తయ్య పెళ్ళాం నెమిలికోండ కర్రెల్లి గుడిసెలోపలే కాలి బూడిదై పోయింది, బతికిన ముత్తయ్య కుడిచెయ్యి విరిగి పోయింది.

తరువాత చాలా జరిగి పోయాయి. కూలోల్ల కూలిలెక్కినయ్. పాలేరోల్ల జీతాలెక్కినయ్. ఉన్నోల్లు "గతిలేని లంజకొడుకుల కండ్లు నెత్తికెక్కిన"యనుకున్నారు.

"బొత్తయ్యబావా! ఏందే గట్లనికి పోతున్నవ్? ఎట్లయి పోయినవు మలిపివి?" ముత్తయ్య....

"ముత్తయ్యబావా జెరవచ్చి నీకడుపున బుడుకన్నా ఆనరబట్టి జెర ఎంకయ్య పటేలింటి కాడ ఇడిసి పెట్టావ్...." బొత్తయ్య నూతిలో నుంచి మాట్లాడినట్లుగా అడిగాడు.

"దా...పోదాం ...ఏం పనోంట? నిన్ను సూత్తె కండ్లకు నెత్తుగత్తంది. ఎట్లయి పోయినవ్? నీ నెత్తల నెత్తురు ఎంకయ్య పటేలు బూములు దాగినయి. నీ మాంసం అని బొగాలకు ఎరువైంది—నీ నెత్తురు మాసంతోని పండిన పంటంత ఆకుదిని బలిసి పోయింది-అంటేందన్న మాట నిన్ను ఎంకయ్య పటేల్ కోడి బొక్క తీర్గ సీకి పారేసిండు" ముత్తయ్య బొత్తయ్యను భుజాని కానించుకొని ఇట్లా చెప్పుకుంటూ తీసుకొచ్చాడు.

బొత్తయ్యకు ఈ మాటలు చెవికెక్కడం లేదు ఒక్కొక్క ఇల్లు దాటుకుంటూ పోతుంటే వెంకయ్య పెద్దరువాజ "ఎప్పుడత్తదా?" అని చూస్తున్నాడు. లోపల మాటలు పేర్చు కుంటున్నాడు, అడుగబోయె ము జీతం గురించి ఆశలు పేర్చుకుంటూ....

వెంకయ్య పెద్దరువాజ తెరిచున్నది. "ఇగనేం బోత పనున్నది." ముత్తయ్య వెనుదిరిగి ఏదో గొనుక్కుంటూ మొండి



"కర్కశంగా, గరుకుగాఉండే
పళ్ళపొడులు మీ పళ్ళకు,
చిగుళ్ళకు
హానికలిగించవచ్చు..."

# కోల్గేట్ టూత్ పౌడర్‌తో మీ చిగుళ్ళను, చెడుశ్వాసను కూడా అరికట్టండి పళ్ళను కాపాడుకోండి.







కోల్గేట్ టూత్ పౌడర్ ఎంతో మెత్తగా ఉండే తెల్లని పౌడర్
అది అతి మృదువుగా మీ చిగుళ్ళను తోముతుంది
అంతేగాకుండా దానిలో ఉండే సున్నితమైన మెరుగునిచ్చే
పదార్థం మీ పళ్ళ మీది పాచిపొరలను తొలగిస్తుంది
మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా చేస్తుంది కోల్గేట్‌లోని
పుష్కలమైన నురుగునిచ్చే చర్య పళ్ళ సందులలోనికి
చొచ్చుకుపోయి చెడు వాసనను దంతక్షయకారకములైన
సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది

**మీ కుటుంబానికి కోల్గేట్ టూత్ పౌడర్‌తో అధునాతనమైన తీరులో దంతరక్షణ సమకూర్చండి. దానియొక్క చల్లని, పిప్పర్‌మెంట్ రుచిని వారంతా మెచ్చుకుంటారు.**

P.G. 30 TL

చెయ్యి ఊపుకుంటూ వెళ్ళిపోయారు.

బొత్తాడు కాళ్లు నిలదొక్కుకొని పెద్ద దర్వాజ లోపలికి నడిచాడు. లోపల వాకిట్లో పిల్లల కోడొకటి కొక్కొ కొక్కొ మనుకుంటూ మట్టిగీరుతోంది. మనుషుల అలికిడేమిలేదు. పడారి గోడకు ఆనిగి పోయిన నాగళ్ళు ఒక పాతజంబు నిలబెట్టున్నాయి. నాగళ్ళ పక్క కూలబడి పోయాడు— ధాన్యపు యిల్లు అరుగమీద గొనెపట్టా కుర్చీని పులుకు పులుకున చూడ సాగాడు.

చాలా సేపటిదాక ఎవరూ రాలేదు. ఆ తరువాత భూతంకూసడు చిరిగిపోయిన కొడవళ్లు భుజం మీదేసుకొని బయటకొచ్చాడు.

"అంకూశన్నా పటేలింట్లున్నడా?"

"ఎవలూ బొత్తన్నా! పనికత్తలేవేమె! అంటు జెర తాకిందని మనోల్లనుకోంగ ఇన్న- సూసత్తా మనకుంటే తీరకేడిది కోశల దేవుసంగుత్తా మంచె తీర్తలేదు. ఔనుగని...." అంకూశడు బెదిరి బెదిరి వెనుకకు చూశాడు. మిడతగుడ్లు విచిత్రంగా తిప్పి — బండ పెదిమలు ఎండిమి పట్టి ఏదో చెప్పాలనన్నట్టుగా చూసి-ఏమనుకున్నాడో... "పటేలు పలారం జేత్తండట" అనేసి గబగబ వెళ్ళిపోయాడు....

బొత్తానికి కళ్ళు మసకబారినయ్ నో రెండుకపోయి పెదిమలు గిడసబారిపోయాయి. కడుపుల ఆకలి కట్టు లేచింది అరిపాదాలనుండి చల్లగా ఏదో పాకుతున్నట్టుగున్నది... పెదిమలు నాక్కున్నాడు.

మాగన్నుగా మొక్కి నాగలి కొరిగి కూర్చున్నాడు. ఆ మధ్యలో చాలా మంది వచ్చిపోయారు. అతనికి వచ్చినవారెవరో? పోయినవారెవరో తెలియనేలేదు. కాని ఆ అడుగుల చప్పుడు మాత్రం ఎంకయ్య పటేల్ది గాదని మాత్రం తెలుసు. ఆ విధంగా ఎంతసేపు కూర్చున్నాడో!

"వారీ! బొత్తాడస్తనావు రా?" అన్న గద్దింపుతో బొత్తాడు కళ్లు తెరిచాడు. ఎదురుగా పటేలమ్మ రాజమ్మ చెంగులు ఎత్తి పట్టుకొని గంపంతనోరు తెరిచి అడుగుతోంది.

బొత్తాడు పుల్లల్లాంటి చేతులెత్తి దండం బెట్టిండు "నీ బాంచెన్ గింతంత గంజుంటె బొయ్యిండ్లి. లాపోతె నిజ్జంగనే సచ్చిపోత"

"నిగబడ చనవ అండి ఆర్సి తయారు బెట్టిన.. నీ పెండ్లాం మిండెడు దాస బెట్టిండా గంజి..." రాజవ్వ తడకముక్క పోగు లెగురుతుండగా అరిచింది.

"ఏందే? ఏం సంగతి?" త్రేన్చుకుంటూ ఎంకయ్య పటేల్ కూకేటి పాములాగా బయటకొచ్చాడు. ఆ సంగతేదో తెలియక ముందే బొత్తడు గోక్కున్నాడు.. కుడి చేతిలో ఈనెతీసిన పొగాకు కాడున్నది బొత్తాన్ని చూడకుండానే ధాన్యపింటి అరుగెక్కి "పరాత్పరా ...!" అనుకుంటూ కుర్చీ కిటకిట లాడగ కూర్చున్నాడు....

"పెద పాలేరు బొత్తాని' గంజంట—లాపోతె సత్తడట' రాజవ్వ

అదేదో మామూలు సంగతన్నట్లు చెవుల సుట్టదీసి పొగాకు కాడ తుంచి సుట్టలో పెట్టి బనీను పక్కజేబులో నుంచి అగ్గిపెట్టె తీసి సుట్ట ముట్టించి దమ్ములాగి "ఇగో . నిన్న....ఆనికి త గంజ గట్రేసి పొమ్మన్న . ఆనితోని మాట్లాడాలె.." అన్నాడు. చుట్ట కొరుకుతునే మూస్తూ...

నీ పెండ్లాం ఎవన్నెత్తుకొని పోయిందిర- ఇంటి మొఖాన తొంగన్న సూత్త లేదు"

బొత్తాడు ఏదో మాట్లాడాలనుకొని నోరు తెరవాడు- బొత్తాడు ఏం మాట్లాడక ముందే రాజవ్వ లోపలకెల్లి పోయింది.... సత్తిపోరి కడుముంతల గంజి గట్క కలుపుకొని తెచ్చింది. బొత్తానికి ఎటూ తాగాలో మొదట తెలియలేదు. ఆకలి మీదున్నడేమొ ఆత్రంగా దోసిలి పట్టాడు. పెరిగిన గడ్డం మీద, నెత్తిమీద చిల్లుతుండగా సత్తిపోరి ఎత్తిపోసింది. మొదటి బుక్క లోపలికి పోక తిమ్మి కొట్టింది. కళ్ళు వికృతంగా




పోడుచు కొచ్చాయి. సత్తిపోరి మనసు కలికలై పోయింది. బెదురుగా ఎంకయ్య వేపు చూసింది. ఎంకయ్య మరెటో చూస్తున్నాడు. సత్తిపోరి కొంచెంసేపాగి మళ్ళీ పోసింది .. ఈ సారి గంజి గొంతులకు దిగింది. నెత్తిమీద కొట్టు కొమ్మన్నట్టుగా సత్తిపోరి సైగ చేసింది... మొత్తానికి బొత్తోడు గంజి తాగి మూతి తుడుచుకున్నాడు.

ఈ సారి కాళ్ళల్లోకి సత్తువ వచ్చినట్లనిపించి లేచి నిలబడ బోయాడు.

"ఆన్నే కూకో! నేనే పిలిపిత్తా మనుకున్న—బిడ్డా బొత్తోడా గంజి కడుపులకు జారిందా? ఇగో పొగాకు గావల్నా? సరే పొంగ తీసుకు నేవు ... ...బిడ్డా! నీ ఈడు ఆరున్న కాన్నుంచి నేనెరుగుదును నువ్వు పని దొంగవు గాదు—లంగవు గాదు గందుకనే ముప్పయేండ్ల మంచి నా కొలువు లుంచుకున్న—నువ్వు నా పాలేర్లల్ల పెద్ద పాలేరు వైనవ్—నీ మీద సోడిసి పెట్టి ఇనొద్దులు నిర్రంధిగున్న దొంగ బుద్ధి లేదు" ఎంకయ్య కాండ్రిచ్చి ఉమ్మిండు....సుట్ట చేలో పట్టుకొని కొంచెంసేపు మాట్లాడలేదు.... బొత్తోని ముఖం చూడాలనుకొని ఆ ప్రయత్నం విరమించి "నేను చెప్పచ్చేదేమంటే?... దునియ బేకారయి పోయింది. నీ ముంగటనే పాలేరోల్లంత ఏడొద్దులు పని బందు బెట్టిరి. సరే మెడకు బడ్డపాము కరువక మానదని జీతాలెక్కిచ్చినమ్.... మాకు పశతలుండద్దా? పదిపొరొద్దులాయె నువ్వు మంచాల బడ్డవ్. మనది మట్టిసెత్తి ఇయ్యాల్లింట్ల రేపు మంల్లె-ఏమంటవు....నీ సెత్తల జిగి సచ్చింది. నాదేమొ బారెడ్లు, భారికేతాయె—పనుల దెవుసం నీ అంతుకు సుక్కల కొండన్ని ఆరదినాల కింద మాట్లాడుకున్న....నా లెక్కన నువ్వు ఇద్దుం జోడ్లు బాకి దేలినవ్....నీ అరబిగెడు సెలుక లెక్కగట్టు కోంగ ఇన్నూరు రూపాలు యియ్య దేలినవ్—మొన్న గాడి ఒర్రెను దెచ్చిన గదాన్ని ఏరే మేపియ్యాలనకొన్న-మీ రాయేశన్ని రేపటి నుంచి పనికిదోలు-" ఎంకయ్య మళ్ళీ కాండ్రకిచ్చి ఊంచిండు.

"అదిగాదు పటేలా! నేను పెరిగింది

తమరి దగ్గర్నే—నా కార్తీకల్లు కప్పుకచ్చినయ్. తమరి అరువం దగ్గర్నే గింత జీవాత్త నొదులుత." బొత్తోని గొంతు తిరబోయింది....

"గిప్పుడేమున్నది? అంతలావు కావాల్నంటె మల్లగలువు—మైసమ్మ మిట్టకొత అట్టిండ్లు—కొత్తకాడికి బోవాలె—సత్తీ జెర అంగందుకోయే...." ఇంట్లోకి కేకేశాడు.

సత్తిపోరి అంగీ, చెప్పులు తెచ్చింది... కిర్రుచెప్పులు చప్పుడు చేస్తుండగా ఎంకయ్య పటేల్ వెళ్లిపోయాడు..

బొత్తోని కళ్ళవెంట నీళ్ళు కారినయ్.. తను పాలేరుగా ఆ ఇంట్లో గడిపినరోజులు జ్ఞాపకానికొచ్చాయి.... ఎందుచేతనో పెదిమలు వనికాయి.... గతంలో రాత్రి పగలు తనుపడ్డ కష్టం గుర్తుకొచ్చి కళ్లు ఎరుపెక్కాయి.... బిగుసుకపోయి చాలాసేపు అట్లాగే కూర్చున్నాడు, అరిగిపోయిన నాగలిలాగా....రేపో మాపో అరిగిపోయిన నాగలి ఊడబీకి ఒక్క లేసి పొయ్యిలో పెడ్తారు.... తను ఇయ్యాల్లనే పొయిల బెట్టబడ్డాడు.... చివరకు పిడికెడు బూడిదిగా మారి పోతాడు....

బొత్తోడు లేచి నిలబడి పెద్దరువాజ దాటి వెనుకకు తిరిగి చూశాడు. ఆరేండ్ల కిందప్పుడు ఇదే గడపలకు తనయ్య దీసుకచ్చిండు. అప్పటి నుంచి పనిజేత్తెనే శాగు పత్తనని ఒళ్ళు దాసుకోకుంట పనిజేసిండు. ఇయ్యల్ల ఒంట్లె నెత్తురు తాగేసి గడపవతలికి ఇసిరేసిండు. ఎటుపోవాలో అర్థంగాక పడారి గోడ నీడన గువ్వ పిట్టలాగా కూర్చున్నాడు. ఆ దారివెంట ఎందరో పోతున్నారు పనులమీద — "రేపు అళ్ళ ఒంట్లె నెత్తు రోడిసినంక నా తీర్గనే కప్ప కూలితోతరు, గీ బజార్లు, పడారి గోడలు ఎందరి నెత్తురు తాగినయో? గబూముబు ఎందరి మాసం తిన్నయో?" ముత్తయ్య మాటలు హోరెత్తుతున్నాయి....

చాలాసేపు అట్లా కూర్చుండి చివరకు దేవుడు పూనినవానిలాగ లేచి నిలబడి కాంట్రడకిచ్చి పెద్దరువాజ తలుపుల మీద ఊంచి తూలుకుంటూ మాదిగ గూడానికి నడిచాడు.

అట్లా నడిచినవాడు సీదా సంఘం గుడిసె - అంటే ముత్తయ్య గుడిసె—ముత్తయ్య గుడిసె కాలిపోయిన తరువాత లేవోల్లంత గలసి గుడిసెనైతె వేశారుగాని దానికి పనుగడ పెట్టలేక పోయారు. లోపలికి నడిచిండు. లోపలంతా దుమ్ము కొట్టాడుతున్నది ఓ మూలకు కుక్కొకటి ముడుచుక పన్నది—కుక్క తప్ప అందులో మనుషు లెవరు లేరు. ఓ మూలకు నాలుగైదు ఓకు కర్రలకు ఎర్రజెండాలు కట్టబడి ఉన్నాయి పెద్ద పెద్ద అక్షరాలురాసిన కాయిత మొకటి దూలానికి తల అతికించబడి ఉన్నది.

బొత్తోడు నిట్టాడు కానుకొని కూర్చుండి బయటి ఎండను చూడసాగిండు, అతని మనసులో ఎన్నో పగలు రాత్రుల్లు, పంటలు పతులు, పశువులు, మనుషులు, పనులు మెదిలాయి... తన తండ్రి సావంగ ఇచ్చి పోయిన రెండెకరాల సెలుక మెలింది. తనిప్పుడు సెలుక కాదు కదా సెత్తకూడా భూమ్మీద ఉండకుండా అయిపోయాడు.

మొదట తన జాడకు తన కొడుకొస్తాడనుకున్నాడు. చివరకు పెళ్ళామన్నా వస్తుందేమో అనుకున్నాడు ఎవరు రాకుండానే ఎండపొడ వెళ్లిపోయింది. చీకటి దిగిపోయింది. అప్పుడు ముత్తయ్య వచ్చాడు. చీకట్లో కూర్చున్న బొత్తోన్ని చూసి ఏదో గొణిగాడు.

బొత్తోడు హఠాత్తుగ ముత్తయ్య మీద పడిపోయి కడుపుల పేగులు బయటి కొచ్చేలాగా ఏడ్చిండు. ఏడుస్తూనే సంగతి చెప్పిండు.

ముత్తయ్య కాసేపు ఎంకయ్యను తిట్టి పోసి "లేపడుగుదాం.... ఐదులుతరా! అదులెద్దు-మన ఒతుకు కట్టంలబట్టి కట్టంల బెరిగిందే.... నువ్వు ఇంటికి పో..." తీసుకొచ్చిండు....